# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938–1972)



సెప్టెంబరు 1973

సంపుటము : 50 : సంచిక : 9 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# వి ష యా ను క్ర మ ణి క

## సెప్టెంబరు 1973

# స్వాగతమ్మిదె! నీకు సుస్వాగతమ్ము

శ్రీ ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులు

నీలాల నింగిలో నెయ్యమ్ము పచరించి
పరుగుల పందెమ్ము మెరుపుదోఁచ
రాగాల రవళిలో రక్తి శక్తుల నిల్పి
మాయూర కలగీతి మైక మిడఁగ
నిండారు మల్లెల నెత్తావి హత్తించి
దోసిళ్ళతో నీళ్ళు త్రుళ్ళఁజేయ
పొంగారు జంటలోఁ బువ్వులఁ బూయించి
మధురైక్య భావనా మధువు నింపి

మిన్ను దిగివచ్చి మా తెన్ను కన్నులనిడి
మోదవృష్టుల నార్ద్రమై భువి వెలుంగ
రమ్ము! పర్జన్య! ముత్యాలరాశి పఱచు
స్వాగతమ్మిదె! నీకు సుస్వాగతమ్ము.

చీకఁటి వ్రేగునం బడలి, చిక్కని గాలులఁ దూలితూలి—ఆ
లోక విలోకన ప్రభల, రోష విభీషణ గర్జ సేతువో!
శోకదవానల జ్వలిత శుష్క జనావళి జాలిఁ జూతువో!
తేకువ నిర్ణయింపఁగల తెన్నొక యింతయుఁగాన రాదొకో!

చీకఁటి దాడులున్, కనులు చీల్చెడి వైద్యుత కాంతిరేఖలున్
భీకర ఘోషలున్, ప్రళయ భీకర వాయు విచాలన ధ్వనుల్,
వ్యాకుల పాటు సేయ, సమయార్భటిగాఁ దలవంచు ప్రాణులన్
జేకొని కాతువో! విమల శీతల ధారల దప్పిఁదీర్తువో!

చిలికిన వాన జల్లులకుఁ జేవలు దీరిన ప్రకృతిద్యుతుల్
తొలకరి మెర్పులన్ పులకితోజ్జ్వల గాత్రిగ ధాత్రిఁ జేసెడిన్

కలిపిన శాలమ్మై నిలిచి, కన్నుల పంటలు గ్రుమ్మరింతువో!
విలయము తాండవింపఁ బలువేదవలం బొలియింతువో! మమున్

గుండెలు బండబారఁ గను గూడుల నాశల నిల్పి, దీక్షతో
మండెడి యెండలోఁ దనువు మాడ్చెడి కర్షకు ఘర్మబిందువుల్
పిండిన రక్తబిందువులొ! విశ్వ మహోదయ యజ్ఞకుండికన్
కుండల నిండుగా విడుచు కోటి మదుంగురి నాజ్య ధారలో !!

జీవనమార్గమిచ్చి, సుఖజీవన శాంతి లభింపఁజేసి, శ్రో
కావన పావన ప్రభల ఖ్యాతి గడించిన వర్షరాజమా !
భావనలుర్ణ పిర్ణ, సమభావముచూపి, అనుగ్రహింపుమా!
దీవనలిచ్చి కావుము! సుదీర్ఘ శుభమ్ముల నందఁజేయుమా !

బ్రతుకుల వెల్తురిచ్చి, పలుబాములఁ దీర్చెడి దీనబాంధవా!
పొలము పారదోలిఁ గనువిందుగ సర్యము నాట్యమాడుతన్
గతుకులు వూడి, యిల్యెలుగఁ గర్షకమిత్రులు పైడి పంటలన్
బ్రతుకొక పూలబాట యయి వర్ష వినోదము విండు ధారుణిన్.



# పండితరాయల వెక్కిరింపులు

డా. మహీధర నళినీమోహన్

## కుక్క

పండిత రాయలని పరాభవించాలనే పట్టుదల నానాటికీ పెరిగిపోతోంది కవక్‌లాల్‌లో. ఆ శక్తి తనకి లేదని నమ్మకం కుదరడంచేత భైరవస్వామి అనే చిల్లర పండితుణ్ణి చేరదీశాడు. పిస్తా, బాదమ్ వగైరాలు తినిపించేవాడు. ఎక్కడెక్కడి గ్రంథాలూ తెప్పించి అందించేవాడు. భైరవుడి ప్రగల్భాలు కోటలు దాట సాగేయి.

ఈ సంగతి పండిత రాయలకి తెలిసింది. శిష్యులు వార్త మోసుకు వచ్చారు. ఆయన పకపకా నవ్వేడు.

వెనకటికి ఓ బోయవాడికి సింహాన్ని పరాభవించాలనే కోరిక కలిగింది. కసి పుట్టింది. పట్టుదల హెచ్చింది. ఆ పని ఎలా సాధ్యమా అని అహోరాత్రాలూ ఆలోచించాడు. అంతలో దారే పోతూ చెవులు గళ్లు పడేలా అరుస్తూన్న పెద్దకుక్క ఒకటి కనిపించింది. దానిని చూడగానే తన కార్యం సఫల మవుతుందని నమ్మకం తోచింది. దానిని చేరదీసి పెంచడం మొదలు పెట్టేడు. దానికి రోజూ పాలు, పెరుగు, నెయ్యి, గోమాంసం వగైరాలు పెట్టి బలిపించ సాగేడు. అన్నీ తిని అడ్డంగా బలిసిన ఆ గ్రామ సింహాన్ని వెంట బెట్టుకుని సింహం కాపరం ఉండే గుహా ప్రాంతాలకు వెళ్లేడు. ఈ అలికిడి విని గుహ లోపల మాగన్నుగా పడుకుని ఉన్న సింహం తల అయినా ఎత్తకుండా గుర్రుమంది. అంతే. ఆ కుక్క తోక ముడిచి ఒకటే పరుగు. ఒకటే పరుగు. అది మళ్లీ కనిపిస్తే ఒట్టు. పాపం ఆ బోయవాడికి గోహత్యా పాతకం మాత్రమే మిగిలింది.

### శార్దూల విక్రీడితం

పంచాస్యస్య పరాభవాయ భషకో
మాంసేన గోర్భూయ సా
దధ్యన్నైరపి పాయసైః ప్రతిదినం
సంవర్ధితోఽజ్ఞేనయః
సోఽయం సింహరవాత్ గుహాంతర గతాత్
భీత్యాకులః సంభ్రమాత్
హంతాశా వలయం గతో హత విధే!
లాభః పరం గోవధః.

### శార్దూల విక్రీడితం

పంచాస్యంబు పరాభవించు పనికై
సంతాన మూర్ఖుండు తి
న్పించెన్నిత్యము గ్రామసింహమునకున్
క్షీరాన్న గోమాంసముల్
చంచద్దీర్ఘ సటీ కఠోర హరి
గర్జారావమాలించి చూ
పించెన్ పిక్కబలంబు కుక్క—
తుదకున్ వెన్నంటె గోహత్యయే.

* * *

## బూరుగుచెట్టు

కోటికి పడగలెత్తిన సెట్టి ఒకడు చుట్టుపక్కల వంద ఆమడల దూరంలో తనంత ధనవంతుడు లేడని విర్రవీగుతున్నాడు. ఆస్తి చూసుకుని మురుము కుంటున్నాడు. కాని, అతడివల్ల ఉపకారం పొందినవాడు ఒక్కడంటే ఒక్కడు లేడు. ఆ ఊళ్లోనే ఒక సామాన్య గృహస్థు డున్నాడు. అతడి చేతికి ఎముక లేదు. అతడి

ఆదరానికి హద్దులేదు. ఎక్కడ విన్నా ఆతడి వితరణ సంకీర్తనలే. ఎక్కడ చూచినా ఆతడి దయావర్షంలో తడిసినవారే.

ఈ విషయాన్ని మనస్సులో ఉంచుకుని పండిత రాయలు ఒక బూరుగుచెట్టుని నిందిస్తున్నాడు.

చాలా పొడుగ్గా లావుగా ఉన్నాననీ, వయస్సులో నన్ను మించిన చెట్టు ఈ చుట్టుపక్కల ఎక్కడాలేదనీ తెగనీలుగుతున్నావుగానీ ఓ బూరుగుచెట్టూ! అదిగో అల్లా చూడు కళ్లుతెరిచి. ఆ మూలనున్న తియ్య మామిడిచెట్టు తాలూకు చిగుళ్ల రుచి మరిగిన గండు కోయిలలూ, దాని పూగుత్తులనుండి వరదలై పారు తున్న తేనెవాకలచే పరవశమైపోయిన తుమ్మెదలూ అడవి అడవిఅంతా ఆ మామిడిచెట్టు దాతృత్వాన్ని ఎల్లా పొగుడుతున్నాయో గమనించు.

## శార్దూల విక్రీడితం

ఉచ్చైస్త్వ్వయసాచ శాల్మలి తరో!
నిః సారమాగామదం
మా కందస్య వవస్య నాస్య విపినే
జానాసి నూనం గుణాన్
ఏతస్యైవ వనేవనే పరభృతా
వాదాన్యకం కాననే
మార్ద్వీక ప్లవదూర్మికా మధులిహో
గాయంతి గాథం యశః.

## మత్తేభ విక్రీడితం

పొడవున్ పెద్ద వయస్సు చూచుకొని
ఈ పోకిళ్లు చాలించవే
వెడగుం బూరుగుచెట్ట! చూత విటపీ
విస్తార దాతృత్వమున్
అడవిన్ వల్లెన చాటుచున్న వవిగో
ఆలించవే తేనెలన్
కమపుల్ నిండివ తేంట్లు, లేజివురు
రేకల్ దిన్న పుంస్కోకిలల్.

*　　*　　*

ఆ సెట్టిగారి దగ్గర చాలాకాలం పడిగాపులు పడిపడి, ఇహ లాభం లేదని విసిగి వేసారి వెళ్లిపో తున్నాడు ఒక యాచకుడు. ఇంతకాలం వ్యర్థం అయి పోయింది. ఇంతకన్న మరో చోటికి పోయినా కాస్త ఫలించేదేమో అని నిట్టూరుస్తున్నాడు.

రామచిలుక ఒకటి బూరుగుచెట్టుమీద చాలా కాలం వేచి ఉంది. కాని, ఏమీ దొరకలేదు. విసు గెత్తి ఆఖరికి ఇల్లా అంది. ఓ బూరుగుచెట్టూ! ఉలిపి కట్టెలా ఊరికి దూరంగా ఉంటున్నావు. శరీరం నిండా నీకు ముళ్లు. నీడ శూన్యం. కోతులు కూడా నీ పళ్లను నోట బెట్టవు. నీవి నిర్గంధకుసుమాలు. నీ చాయలికి తుమ్మెదలు రావు. సారవిహీనలైన నిన్ను ఇంతకాలం సేవించి అమూల్యమైన కాలాన్ని వృథా చేసుకున్నాను. నిట్టూరుస్తూ వెళ్లిపోతున్నాను.

## మందాక్రాంతా

దూరే మార్గాన్ని వసపి పునః
కంటకైరావృతోఽసి
చ్ఛాయా శూన్యః ఫల మపిచతే
వానరై రప్య భక్ష్యమ్
నిర్గంధస్త్వం మధుప రహిత.
శాల్మలే! సారశూన్యః
సేవాస్మాకం భవతి విఫలా
తిష్ఠ నిశ్వస్య యామః

## ఉత్పలమాల

నీడ హుళక్కి, నీకు మెయినిండుగ
ముండులు, కోతులైన మూ
చూడని పండ్లు, సౌరభము శూన్యము,
సారమునాస్తి, తుమ్మెదల్
పొడవు నీ సమీపమున, వ్యర్థపు
సేవల నింత కాలమున్
పాడయి పోయె—మాకు పెలవా
మరి బూరుగుచెట్టు వేస్తమా!

*　　*　　*

## ఉన్మోత్త

శివుడు పిశాచాలకి భర్త. దానికి తగ్గట్టుగానే అతడి చేష్టలు కొన్ని అపసవ్యంగా ఉంటున్నాయిట.

బాలచంద్రుడికి నివాసయోగ్యమైన తన జటాజూటంలో ఒక ఉమ్మెత్త పువ్వుని పెట్టుకున్నాడు. దానితో ఆ ఉమ్మెత్తకి ఎక్కడలేని గర్వమూ పుట్టుకు వచ్చింది.

ఓసి పిచ్చి ఉమ్మెత్తపువ్వూ! చందమామ పక్కని స్థానం దొరికిందని, అందువల్ల చంద్రుడితో సమానురాలివనీ అనుకుంటున్నావా?

చంద్రుడు కనిపించేసరికి చెరువులోని కలువలు కలకలలాడుతూ వికసిస్తాయి. ఆ పని నీవల్ల అవుతుందా?

చీకట్లని పారదోలగల శక్తి చంద్రుడికి ఉంది. మరి నీకో?

చంద్రుణ్ణి చూడగానే సముద్రాలు పొంగుతాయి. చంద్రకాంత శిలలు స్రవిస్తాయి. నీవల్ల ఏమవుతుందే ధూర్తమా!

షాజహాన్ చక్రవర్తి ఏ కళని ఉన్నాడోగాని ఒక నాడు కనక్‌లాల్‌కి పండితరాయలతో సరిసమానమైన స్థానాన్ని ఇచ్చాడు దర్బారులో. అంతమాత్రంచేత కనక లాల్ జగన్నాథుడికి సమానం అవుతాడా? పండితరాయల లాగ గంగాలహరి చెప్పి గంగని ఉప్పొంగించ గలడా? అప్పయ్య దీక్షితులికీ భట్టోజీ దీక్షితులుకీ ఎదురు నిలిచి తొడచరిచి సవాలు చేయగలడా? ఏకసంథాగ్రాహియై 'కురాను' వప్పగించగలడా? అపూర్వమైన కవిత్వం చెప్పి సరస్వతీదేవి చేత వీణ వాయించడం కూడా మాన్పించగలడా? ఈ పనులు కనక్‌లల్‌వల్ల ఏమవుతాయి?

## వసంతతిలక

ధుత్తూర! ధూర్త! తరుణేందు నివాసయోగ్య
స్థానే పిశాచ పతినా వినివేశితో౾సి
కింకైరవాణి వికసంతి? తమః ప్రయాతి?
చంద్రోపలః స్రవతి? వార్థిరుపైతి వృద్ధిమ్?

## చంపకమాల

తలపయి చంద్రు డుండ దగు
స్థానమునందు పిశాచ భర్తనిన్
నిలిపె నటంచు ధూర్త! కడు నిక్కెదు
నీకెదు—చాలు—నీ ప్రభన్
కలువలు విచ్చునో? దెసల గ్రమ్మిన
చీకటి విచ్చిపోవునో?
జలధులు పొంగునో? జలము
చంద్ర శిలాతతముల్ స్రవించునో?

*  *  *

ఒక కవి స్వమాట్టుగారున్నారు. ఆయనకి వల్ల మాలిన గర్వం. అయితేనేం? వారి కవిత్వం ద్రాక్షారస సన్నిభం. కనుక తద్రసా స్వాదన తత్పరులైన రసికులు ఆయన తల బిరుసుదనాన్ని చూచీ చూడనట్లు ఊరు కుంటున్నారు. కాని, వాడి తస్సాగొయ్యా కట్టు పొగరు బోతు తనమే తప్ప ఆధిక్యత ఎందులోనూ లేని ఈ అల్పునిలోని ధూర్తత్వాన్ని ఎల్లా సహించగలరు ప్రజలు?

పెదవికి తగిలితే చాలు అమృత ధారలు చిప్పిల్లే పనసకి పైన ముళ్ళు ఉన్నప్పటికీ పోనీలే అని జనం సహించుకుంటున్నారు గానీ, నోటికి తగిలితే పిచ్చి ఎక్కించే ఈ ఉమ్మెత్తకాయ మీాది ముళ్ళని ఎల్లా సహించుకుంటారూ?

## ఉపజాతి

మాధుర్య సారా ధరితా మృతస్య
తత్కంట కిత్వం పనసస్య సహ్యమ్
ఉన్మాదినో మాతుల పుత్రకస్య
కథం సహామో బత కంట కిత్వమ్?

## తేటగీతి

అధరమంటిన మాత్రాన అమృతధార
లొలుకు పనసకు ముండ్లున్న నోర్వవచ్చు
దాని సిగగొయ్య! ఉమ్మెత్త మేవమున్న
కంటకమ్ముల నెట్లోర్వ గలరు జనులు?

*  *  *

## నీడ

పండితరాయల వేషాన్నీ, అలవాట్లనీ అనుకరించే కుహనా పండితులు కొందరు బయలు దేరేరు. ఆయన

నడిచినట్లే నడవడం, ఆయనలాగే చేయి విసరడం, ఆయన లాగే పంచె కట్టడం, ఆయన లాగే చూడడం, ఆయన లాగే గండపెండేరం తొడుక్కోవడం వగైరా పనులు బాగా అనుకరించగలుగుతున్నారు. ఇవి అన్నీ చేశారు సరే మరి పండితరాయలలాగే కవిత్వం చెప్పమను చూద్దాం.

రాజాంతఃపురంలో ఒక రామచిలుకని పెంచుతున్నారు. నిగనిగామెరిసే మణిస్తంభాలలోనూ, గోడలలోనూ ఆ చిలుక తాలూకు ప్రతిబింబం కనిపిస్తోంది. ఆ ఛాయాకారాన్ని ఉద్దేశించి జగన్నాథుడు ఇల్లా అంటున్నాడు.

ఆ అసలు చిలుక మెడ ఒరగేసి చూస్తే నువ్వూ అచ్చంగా అల్లాగే చూస్తున్నావు. అది ఒయ్యారంగా కూర్చుంటే నువ్వూ అల్లాగే కూర్చుంటావు. అది ఎగిరితే నువ్వూ ఎగురుతావు. ఆ చిలుక చేష్టలన్నింటినీ చక్కగా అనుకరించగలుగుతున్నావు సరేగాని ఛాయా కీరమా! ఆ చిలుక ముద్దు ముద్దుగా మాట్లాడితేమాత్రం నువ్వు ఆ విధంగా మాట్లాడలేక, నోరు మూసుకుని ఊరుకుంటున్నావు. అనుకరింపులు ఇల్లాగే ఉంటాయి మరి.

## శార్దూల విక్రీడితం

యాతే యాత ముత స్థితే స్థిత
ముపర్యాలోకితే లోకితం
యద్యద్రాజశుకో౽యమా కలయతే
శుద్ధాంత మధ్యస్థితః
తత్సర్వం మణిభిత్తిమేత్య భవతా
ఛాయా శుకాంగీకృతమ్
తస్మిన్కర్ణసుఖం వితన్వతి గిర
స్తూష్ణీం త్వయా స్థీయతే.

## శార్దూల విక్రీడితం

చూడన్ జూతువు, నిల్చినన్ నిలుతువు,
ఎచ్చో పోయినన్ పోదువు, ఏ
జాడన్ పెంపుడు చిల్కచేసిన
మణిస్తంభాంతరా బింబితా
రూఢిన్‌జేసెదుగాని, తీయనగు
పల్కుల్ పల్కినన్ నీవు మా
టాడం జాలవు రాజసౌధమున
ఛాయాకీరమా ! మూగవై.

*   *   *

## బొమ్మ

భామినీ విలాసాన్ని చూచి, దానిని అనుకరిస్తూ చిల్లరకవులు కొందరు శ్లోకాలు వ్రాయడం మొదలుపెట్టేరు. ఆ శ్లోకాలకి నాలుగేసి పాదాలైతే ఉన్నాయి. ఛందస్సు కూడా సరిగ్గానే ఉంది. వ్యాకరణ దోషాలు లేకపోవచ్చు. కాని వాటిలో రసం లేదు. మాధుర్యం లేదు అసలు జీవమేలేదు.

చిత్రకారుడు చిరకాలం శ్రమపడి అందమైన పువ్వుల బొమ్మను రంగులతో గీస్తే గీయవచ్చు. ఆ పూలు అందంగా కనిపిస్తే కనిపించనూ వచ్చు. కాని, అసలు పూలవాసన ఆ బొమ్మలకి ఎల్లా వస్తుంది? తుమ్మెదలు వాటిలో దూరి తేనె ఎల్లా తాగుతాయి?

## కాలభారిణి

కుసుమాని లిఖంతు నామ చిత్రే
కతి చిత్కాల విశేష రూఢ శిక్షాః
సురభిత్వ మమూని కిం లభంతే?
కథ మేతేషు రసం పిబంతి భృంగాః?

## తేటగీతి

చిత్రకారుడు చిరకాల శిక్షణమున
సొంపుగా పుష్పములను చిత్రింపవచ్చు
కాని యా పూలకెట్లు సౌగంధ్యమబ్బు?
తేటు లేరీతి వానిలో తేనె త్రాగు?

*   *   *

## ఏనుగు

వంశీధర మిశ్రుడు అనే పండితుడొకడు జగన్నాథుని మీదికి కత్తిదూయడానికి ప్రయత్నాలు

చేశాడు. షాజహాను ని ఆస్థాన పండితులలో అతడొకడు. ఏదో ఓ పాటి కవిత్వం చెప్పగలవాడేగాని అతడికి తనతో వాదం ఏమిటీ తిని కూర్చోలేక అనిపించింది పండితరాయలకి. అతడికి సలహా ఇస్తున్నట్లు వెక్కిరిస్తున్నాడు.

నీ పరాక్రమం కమ్మని భోజనం చేయడంలో చూపించుకో. ఓనమాలు సరిగారాని పండితమ్మన్యులున్నారు. వారితో వాదించుకో నీపోటి దురద తీరేటట్లు. పోనీ యువన యువతులున్నారు. వారిమీద ప్రకటించుకో నీమగతనం. అంతేకాని, నాతో పోటీకి దిగుతానంటా వేమిటయ్యా! తప్పు. తప్పు.

ఓ ఏనుగూ! సరోవరాలలో నవనవలాడే తామర పువ్వులు కోకొల్లలుగా ఉన్నాయి. వాటిని నీ ఇష్టం వచ్చినట్లు మెక్కు. కొండ కొమ్ముల మీదనుంచి జలతారు తీగలలా జారిపడే సెలయేళ్లు ఉన్నాయి. అక్కడికివెళ్లి నీ చిత్తం వచ్చినట్లు స్నానం చెయ్యి. మాంఛి వయస్సులోఉన్న ఆడ ఏనుగులు తొండంతో నీ ఒళ్లంతా నిమురుతూ ఉంటే కలిగే అమర సౌఖ్యాలను అనుభవించు. అంతేకాని, మృగరాజుతో యుద్ధం చేయాలనే పిచ్చి ఆలోచన కట్టిపెట్టు,

## వసంత తిలక

కేళిం కురుష్వ పరిభుంక్ష్వ
సరోరుహాణి
గా హస్వ శైలతట
నిర్ఝరిణీ పయాంసి
భావానురక్త కరణీ
కర లాలితాంగ!
మాతంగ! ముంచ మృగరాజ
రణాభిలాషమ్.

## చంపకమాల

ఉదరము నింపు కొమ్మ లలితోత్పల
పంకజపాళి, చెమ్మటల్
వదలగ శైల నిర్ఝర జలమ్ముల
స్నాన మొనర్పుము; ఆత్మ కిం
పొదవ ప్రియాంగనా గణకరోచిత
లాలన సౌఖ్యమందుమో
మదగజ నాయకా! విడువుమా
మృగరాజ రణాభి లాషమున్.

*   *   *

## కాకులు

షాజహాన్ చక్రవర్తి అండచూచుకొని అల్పులు కొందరు పండితరాయలకు సమఉజ్జీలమన్నట్లుగా పండితాసనాలను ఆక్రమించారు. ఆ పని అయితే చేయగలిగేరు కాని అపాత రమణీయమైన కవిత్వధారతో పండితరాయలు రసికలోకాన్ని ముంచెత్తేస్తూఉన్న సమయంలో ఈ అలగా జనం అంతా పళ్లు పిండుకోవడంతప్ప ఏం చెయ్యగలరు పాపం.

ప్రభువుల అండచూచుకుని కాకులుకూడా కోకిలలతో కలిసి మామిడి చెట్లమీదికెక్కి సహపంక్తిని ఆ పుష్పరసాన్ని జుర్రుకోవచ్చుగాక. అందులో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు. కాని వసంతకాలంలో కోకిలలాగ జగదానందకరంగా పంచమ రాగాలాపన చేయగల శక్తి కాకులకి ఏదీ?

## వసంత తిలక

కాకాః ప్రభుప్రణి హితాః
పిక పంక్తి బృందై
ర్మాకంద బృంద మకరంద
రసాన్ పిబంతు
ప్రాప్తే వసంత సమయే
కథ మాచరంతి
కర్ణామృతాని కలపంచమ
కూజితాని?

## మత్తేభ విక్రీడితం

పలుగాకుల్ వరవాతు నండగొని
త్రావన్ వచ్చు మా కంద ని
స్తుల సారమ్ము పికాళితో కలసి
బంతుల్దీరి—వానంత వే

ఖలటో నయ్య వికర్ణ పేయముగ
నాలాపింపగా నేర్చు నే
కలకంఠోచిత పంచమస్వర
కుహూంకార ప్రకారంబునన్

*   *   *

## పాము

సామర్లకోట సంస్థానంలో కాలూమకోడానికి స్థానం దొరుకుతుందేమోనని ప్రయత్నిస్తూన్న జగన్నాథుడికి ఫణిభూషణుడు అడ్డు తగిలేడు. అతడు బహు అల్పుడు. విషప్పురుగు. కాని, రాజావారికి దగ్గరలో ఉంటూఉండడంచేత తనంతవాడు లేడని అందరివీూదా ఖస్సూ బుస్సూమంటూ ఉంటాడు.

పాము ఉంది. అది బహు క్షుద్రమైన జంతువు. కాని, మహేశ్వరుని కంఠాన్ని చుట్టబెట్టుకుని, తనంతది లేదని పొగరుగా బుసలుకొడుతోంది. అవునులే, స్థానం ప్రధానంగాని శక్తిసామర్థ్యాలతో పనిలేదుగా! ఉన్నత స్థానంలో కూర్చొబెడితే వట్టి చవట కూడా సింహం అవుతాడు కదా!

## ఇంద్రవజ్ర

జానామి నాగేంద్ర! తవ ప్రభావం
కంఠే స్థితో గర్జసి శంకరస్య
స్థానం ప్రధానం నబలం ప్రధానం
స్థానస్థితః కా పురుషోఽపి సింహః.

## ఉత్సాహ

నేను తెలిసికొంటినోయి నీ ప్రభావమంతయున్
స్థాణు మెడనుజుట్టి సర్పనాధ! హుంకరింతువా?
స్థానమే ప్రధాన మెన్ని శక్తులున్న దండుగే
స్థానబలిమియున్న వట్టి చవట కూడ సింగమే.

*   *   *

## మిడుగురులు

మిడుగురు పురుగుల మిలమిలలు చంద్రోదయం అయేదాకానే. చంద్రకాంతిలో అవి కానరావు. తూర్పున సూర్యుడు ఉదయించాడంటే మిడుగురులూ లేవు, చంద్రుడూలేడు. ప్రచండమైన ఆ సౌర తేజస్సులో అన్నీ మునిగి అంతర్ధానమైపోతాయి.

వంశీధర మిశ్రుడు షాజహాను ఆస్థానంలో చేరగానే అక్కడ అంతకు ముందున్న చిన్నకారుకవులు, పండితులూ వెలవెలబోయారు.

ఆ దర్బారులో జగన్నాథ పండితరాయలు అడుగుపెట్టే పెట్టగానే ఆ అల్పకవులూ, వంశీధర మిశ్రుడూకూడా నోళ్లు మూసేశారు.

## అనుష్టుప్

ఖద్యోతో ద్యోతతే రాత్రౌ
యావన్నోదేతి చంద్రమాః
ఉదితేతు సహస్రాంశౌ
నఖద్యోతో న చంద్రమాః

## తేటగీతి

మిడుగురులు రాత్రివేళల మెరయుచుండు
తుహినకరు డాకసంబున తోచుదాక
అర్కబింబంబు ప్రాగ్దిశ నవతరింప
మిడుగురులు లేవు, శీత రశ్మియును లేడు.

*   *   *

## చిన్నచిన్న రాజులు

అర్థిస్తే ఢిల్లీశ్వరుణ్ణి అర్థించాలి. లేదా జగదీశ్వరుణ్ణి అర్థించాలి. వీరిద్దరే యాచకుల కోరికలను తీర్చగలవారు. లోకంలో ఇంకా రాజులు లేకేం. ఉన్నారు. ఉప్పు, పప్పు, చింతపండు, కూరగాయలు వంటి వస్తువులు మాత్రమే కావలసివస్తే వాళ్లని యాచించవచ్చు.

## ఉపజాతి

ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా
మనోరథాన్ పూరయితుం సమర్థః
అన్యైర్నృపాలైః పరిదీయమానం
శాకాయవాస్యా ల్లవణాయ వాస్యాత్.

## తేటగీతి

విశ్వనాథుండొ లేక ఢిల్లీశ్వరుండొ
అర్థులను తృప్తి పరుప సమర్థులెన్న
ఇతర నరపాలకులము నర్థింపవచ్చు
శాక పాకాల కొరకు వెచ్చముల కొరకు.

* * *

వెడితే మృగేంద్రుడి గుహకే వెళ్లాలి. మత్తేభ కుంభస్థలాలలోఉండే అపురూపమైన ముత్యాలు దొరుకుతాయి అక్కడ. గుంటనక్కల బొరియలు వెతికితే ఏముంది? ఏ దూడతోకో, డెక్కో, తోలుముక్కో దొరకవచ్చు.

## రథోద్ధతా

గమ్యతే యది మృగేంద్ర మందిరమ్
లభ్యతే ద్విరద కుంభ మౌక్తికమ్
జంబుకాలయ గతేవ లభ్యతే
వత్సపుచ్ఛ ఖుర చర్మ ఖండనమ్.

## ఆటవెలది

సింహమందిరమ్ము చేరిన లభియించు
మహిత కుంభి కుంభ మౌక్తికములు
చిక్కవచ్చు కొంకి నక్క బొక్కను జేర
దూడతోక, డెక్క, తోలుముక్క.

* * *

## మేఘం

రాజమహేంద్రవర సంస్థానంలో ప్రవేశం దొరకక విసుగెత్తి ఉన్నాడు జగన్నాథుడు. ఆ రాజు మంచివాడే. చెరువులు తవ్వించడం, సత్రములు కట్టించడం వంటి పుణ్యకార్యాలు చేయిస్తూనే ఉన్నాడు. ఆయనవల్ల లాభం పొందినవాళ్లు లేకపోలేదు. వేటగాళ్లు, పగటివేషగాళ్లు, గారడీ విద్యలవాళ్లు ఎందరెందరో ఆయన అండని వృద్ధిపొందుతూనే ఉన్నారు. కాని, తనకూ తనబోటి ఇతర విద్వత్కవులకూ మాత్రం అక్కడ స్థానంలేదు.

ఆషాఢమేఘం కుంభవృష్టి కురిసింది. భూమండలం అంతా మెత్తబడింది. వనములన్నీ పచ్చబడ్డాయి. నదులు వరవళ్లతో సుడిగుండాలతో ప్రవహిస్తున్నాయి, సరస్సులన్నీ నీటితో నిండేయి. ఓ మేఘుడా! నీ రాకవల్ల మంచి పనులు ఎన్నెన్నో జరుగుతున్నాయి కానీ, నీ చర్యలలో కొన్ని దోషాలు కూడా కనిపిస్తున్నాయి. కప్పల బెకబెకలతో చెవులు హోరెత్తిపోతున్నాయి. కోకిల కూతలు ఆగిపోయాయి!

## శార్దూల విక్రీడితం

స్నిగ్ధాభూదవనీ వనీ మరకత
శ్యామాచ కల్లోలినీ
నానావర్త విహారిణీ జలధర!
స్వచ్ఛాంబు పూరం సరః
సర్వం సాధుతవోదయే కిమిహ
తద్దుర్నీతి మా లోకయే
యద్భేకా ముఖరీ భవంతి విరళీ
భూతాశ్చ పుంస్కోకిలాః

## మత్తేభ విక్రీడితం

అవనీ మండలి స్నిగ్ధమయ్యె, వనముల్
శ్యామంబు లయ్యెన్, సరః
ప్రవరంబుల్ జలపూర్ణ మయ్యె,
నదులా వర్తోజ్జ్వలంబయ్యె, ఓ
నవనీలాంబుద! నీ సదుద్యమమునన్
కన్పట్టె దోషంబులున్
చెవులన్ దిబ్బడవేసె కప్పల రొదల్,
చెల్లెన్ పికారావముల్

* * *

## ఖడ్గమృగం

దారాషికోతో కలిసి అస్సాము అడవులలోకి వేటకి వెళ్లి, ఎత్తైన మంచెమీద కూర్చున్న పండితరాయలకి ఖడ్గమృగం కనిపించింది. చిత్రమైన దాని ఆకారాన్ని చూచి నవ్వుతున్నాడు.

ఓసి ఖడ్గమృగమా! నీ కాళ్లు చూస్తే ఏనుగు జ్ఞాపకం వస్తోంది. నీ రూపం చూస్తే దున్నపోతుల్లా

ఉంది. నీ చర్మం చూస్తే మెట్టతాబేలు గుర్తుకు వస్తోంది. పైగా నుదుటి మీద కొమ్ము ఒకటి. ఎవరికి పుట్టిన బిడ్డవే నువ్వు?

## భుజంగ ప్రయాతా

అరే ఖడ్గ ! పాదాగజస్యైవ రూపం
లులాయేన తుల్యం లలాటే ఒస్తి ఖడ్గమ్
స్థలీకూర్మ తుల్యస్త్వచా క్రూరజంతుః
కుతస్తే జ నిర్మోహనీయా తవైషా

## భుజంగ ప్రయాతం

కరిన్‌బోలు పాదాలు, కాయంబు దున్నన్
స్మరించున్, స్థలీకూర్మ సామ్యమ్ము చర్మం
బరే ఖడ్గమా ! ఖడ్గ మబ్బెన్ మొగానన్
ఎరింగింపరా జన్మ మెందుండి నీకున్

*    *    *

## బడాయి

పదవాక్య ప్రమాణ పారీణులని పేరమభట్టుకి గల బిరుదును చూచి, చిల్లర పండితులు కొందరు ఆ బిరుదును తాము కూడా ధరించడం మొదలుపెట్టిన సంగతి జగన్నాథుడికి తెలియవచ్చింది. వాళ్లని వేళాకోళం చేస్తున్నాడు. అందుకు శ్లేషని ఉపయోగించుకున్నాడు.

పనికిమాలినవాళ్లు కొందరు గొప్పకోసం మంచి మంచి పేర్లు పెట్టుకుంటున్నారట.

అంబరం అంటే బట్ట అని కదా అర్థం. శూన్యమైన ఆకాశం కూడా తానూ అంబరాన్నే అంటోందిట!

విష్ణువు అని అర్థం వచ్చే హరి శబ్దాన్ని గోదురుకప్ప తగిలించుకుంది!

బ్రాహ్మణుడనే అర్థం వచ్చే ద్విజ శబ్దాన్ని కాకి తగిలించుకుంది!

భోగి అనే పేరును పాము పెట్టుకుంది!

పంచదార అనే అర్థం వచ్చే శర్కరా శబ్దాన్ని గుల్ల ఇసుక కూడా పెట్టుకుంది!

ఈవి అనే అర్థం వచ్చే దానశబ్దాన్ని తగుదునమ్మా అని ఏనుగు మదజలం తగిలించుకుంది! ఈ విధంగా అల్పులకు ఆడంబరాలు ఎక్కువ.

## స్రగ్ధరా

ఆకాశశ్చాంబరాఖ్యో హరిరితి గహనం
దర్దురస్యాభిధానం
కాకస్యాపిద్విజత్వం విషమ ఫణిపతే
ర్నామభోగీ భుజంగః
క్షుద్రాశ్మా శర్కరేతి ద్విరద మదజలం
దాన మర్థేన శూన్యం
కేచిన్నామాని చైవం దధతి తనుభృతః
సంతి సాడంబరాని

## ఉత్పలమాల

ఆకసమంబరం బనుచు, హస్తి మదమ్మది
దానమంచు, ప
ల్గాకి ద్విజంబటంచు, హరులంచును
కప్పలు కోతులు, ఉగ్రద
ర్వీకరజాతి భోగులని పేరులు
కొన్ని నిరర్థకంబుగా
చేకొని డాబు సేయుదురు
చేవ యెరుంగని అల్పు లిద్ధరన్.

*    *    *

## వానవాక

పేరమభట్టుతో వాదించడానికి వచ్చిన హరిదీక్షితులు అనే ఆసామీ తాను ఉభయ విద్యాధురంధరుడనని గర్వంగా కుండలాలు ఊగిసలాడేటట్లు తల ఎగరేసుకుంటూ మాట్లాడడం చూచి జగన్నాథుడు అతడిని అవహేళన చేశాడు అన్యాపదేశంగా.

మహామహోపాధ్యాయులూ, షట్ఛాస్త్ర పండితులూ అయిన పేరమభట్టుగారితో తలపడడానికి వచ్చావా? నీ కర్మకి ఎవరు బాధ్యులు—సరే ఏదో అఘోరించుకో. కాని, ఒక్కటి మాత్రం జ్ఞాపకం ఉంచుకో. నీ యీ బిరుదావళిని మాత్రం ఆయన

ముందు వర్ణించకు సుమా! ఇదే నేను నీకు ఇచ్చే సలహా.

నాలుగు వర్షాలు గట్టిగా కురిస్తే ఒళ్లూపై తెలియకుండా పరవళ్లు తొక్కే వాన వాగూ! గంగా నదిలో దూకాలి అని నీకు అంత ముచ్చటగా ఉంటే మధ్యలో నా అభ్యంతరం ఏముంటుంది? కాని, నీ తరంగ కోలాహలాన్ని మాత్రం ఆ వియద్వాహిని ముందు ప్రకటించబోకు సుమా!

## ఉపజాతి

నవారయామో భవతీం విశంతీం
వర్షానది! స్రోతసి జహ్నుజాయాః
నయుక్తమేతత్తు పురోయద స్యా
స్తరంగ లీలాం ప్రకటీ కరోషి.

## ఆటవెలది

నీకు గంగలోన దూక కోరికయేని
వానవాక! అడ్డుపడము మేము
కాని, నీ తరంగ గర్వమ్ము మాత్రమ్ము
దాని ముందు చూపదగదు సుమ్ము.

* * *

## కొంగ

ఊరి బయట రావిచెట్టు కింద హఠాత్తుగా బ్రహ్మానంద స్వాములవారు వెలిశారు. పద్మాసనం వేసుకుని, ముక్కు కొనని చూపులు కేంద్రీకరించి, మౌన వ్రతం అవలంబించి, తపోనిష్ఠలో ఉన్న ఆయనని సేవించుకోడానికి జనం వస్తున్నారు. ఆయన మహత్తులను శిష్యులు ప్రచారం చేస్తున్నారు.

ఆయనని దర్శించుకుని ఇంటికి తిరిగి వచ్చిన కామేశ్వరి పెదవి విరిచింది నిరసనగా, భక్తురాండ్ర మీద ఆయన ఆదరం అధికాధికంగా చూపిస్తున్నాడంది. జగన్నాథుడికి నవ్వొచ్చింది.

'అల్లాచూడు' అని చెరువువైపు చూపించాడు. అక్కడ కొంగ ఒకటి ఒంటికాలి జపంచేస్తూ కనిపించింది.

ఆ కొంగ ముక్కు కదపదు. కళ్లు తిప్పదు మెడ ఆడించదు. రెక్కలు కదిలించదు. ఒంటికాలి మీద నిలువబడింది. ముక్కు కొనని చూపులు నిలిపింది. బహుకష్టసాధ్యమైన ఈ తపశ్చర్యలన్నీ ఒక స్వాములవారికి చేప దొరికేవరకేనే సుమా!

## శార్దూల విక్రీడితం

నభ్రూణాం స్ఫురణం నచంచు
చలనం నోచూలికా కంపనం
నగ్రీవా చలనం మనాగ
పి నయత్పక్షద్వయోత్క్షేపణమ్
నాసాగ్రేక్షణ మేకపాద దమనం
కష్టైక నిష్ఠం పరం
యావత్తిష్ఠతి హీన మీనవదన
స్తావద్బక స్తాపసః

## మత్తేభ విక్రీడితం

శిరసూగింపదు, కంఠమున్ కదుపదు,
అక్షిద్వంద్వమున్ త్రిప్పదు, ఆ
తురతం జూపదు, ముక్కునెత్తదు,
ఎరకల్ తూగింప దావంతయున్
గురుకష్టాన్విత మొంటికాలి జపమున్
ముక్కుంగొనన్ జూపులన్
నెరపున్ కొంగ ఝషమ్ము చిక్కువరకున్
నిష్ఠన్ తపశ్చర్యలన్.

* * *

అప్పయ్య దీక్షితుల వారికి అపర శంకరుడని ప్రఖ్యాతి. ఆయన సకల శాస్త్రాలలోనూ నిధి. శతాధిక గ్రంధకర్త. ఆయనకి వేలకొద్దీ శిష్యులున్నారు. పైగా కొండవంటి మహారాజుల అండ ఉంది. ఇన్ని ఉండగా తనకింక అడ్డు ఏమిటని నిశ్చింతగా ఉంటున్నాడుగాని ఇంతలో సింహప్పిల్లలాగ పండితరాయలు రంగంమీదికి దూకుతాడని ఆయన కలగన్నాడా? పాపం!

ఈ విషయాన్ని సూచిస్తూ అన్యాపదేశంగా చెప్పిన మూడు శ్లోకాలను ఇక్కడ ఉదాహరిస్తాము.

## మహావృక్షం

ఓ మహావృక్షమా! నీ మొదలు బహుస్థూలమైనది. నీ వందలాది కొమ్మలు బహు బలిష్ఠమైనవి. నీవు ఉండేది దుర్గమమైన పర్వతాగ్రాన. నీ కింక భయం ఏమిటి? కాని నా మనస్సును ఒక శంక పీడిస్తోంది. అదేమిటంటే, అడ్డూ అపూ దయా దాక్షిణ్యం లేకుండా అన్నింటినీ కబళించేసే ప్రచండమైన దావాగ్ని ఎక్కడ ప్రజ్వరిల్లుతుందోనని.

## శార్దూల విక్రీడితం

మూలం స్థూల మతీవ బంధన దృఢం
శాఖాశతం మాంసలాః
వాసోదుర్గ మహీధరే తరుపతే!
కుత్రాస్తి భీతిస్తవ
ఏకః కింతు మనాగయం జనయతి
స్వాంతే మమాధి జ్వరం
జ్వాలాళీ వలయీభవన్న కరుణో
దావానలో ఘస్మరః

## ఉత్పలమాల

కొమ్మలు పెద్దపెద్దవని కొల్లలుగా
కలదానవంచు, కాం
డమ్ము మహాబలిష్ఠమని, నా నిలయ
మ్మచలాగ్రమంచు, వృ
క్షమ్మ! భయమ్ము జెందవు—అగుగాక
ననున్ భయపెట్టు నొక్కటే
చుమ్మలు చుట్టుచున్ కరుణ చూపని
ఘస్మరదావ వహ్నియే

* * *

## నందనవనం

స్వర్గలోకానికంతకీ నీవే మకుటంవంటి దానివి. నీలోనే కల్పవృక్షాలు పెరుగుతున్నాయి. శచి, ఇంద్రుల పూర్వ పుణ్య ఫలమవు నీవే. ఇవి అన్నీ బాగానే ఉన్నాయి కానీ ఖాండవ వనరంగంమీద ప్రచండ తాండవంచేసిన అగ్నిదేవుణ్ణిమాత్రం నీ జోలికి రాకుండా చూడవలసిందని సహృదయులు బ్రహ్మదేవుణ్ణి నిత్యమూ ప్రార్థిస్తూ ఉన్నారు తెలుసా?

## శార్దూల విక్రీడితం

స్వర్లోకస్య శిఖామణిః సురతరు
గ్రామస్యధామాద్భుతం
పౌలోమీ పురుహూతయోః
పరిణతిః పుణ్యావలీనామసి
సత్యం వందన! కిం త్విదం సహృదయై
ర్నిత్యం విధిః ప్రార్థ్యతే
త్వత్తః ఖాండవరంగ తాండవనటో
దూరేఽస్తు వైశ్వానరః

## మత్తేభ విక్రీడితం

పెరుగున్ నీ యెడ కల్ప వృక్షములు,
నీ వే మౌళి స్వర్వాటికిన్
పురుహూతేంద్ర పురంధ్రికా కృత
పురాపుణ్యంబ వీవు—అన్నియున్
సరియే గాని, ప్రచండ ఖాండవ నటత్
స్వాహాపతిన్ నీ కడన్
దరియన్నీ కనిగొల్తు రుత్తములు ధాతన్
నందనోద్యానమా!

* * *

## సముద్రం

ఓ సముద్రుడా! నీ నీళ్ళు తాగి మేఘాలు గర్జిస్తాయి. ఇంద్రుడు వజ్రాయుధంతో పర్వతాల రెక్కలు తెగ నరుకుతూ ఉంటే వాటికి అభయం ఇచ్చిన వాడివి నీవే. కల్ప వృక్షానికి జన్మభూమివి నీవే. గాంభీర్యంలో నిన్ను మించినది లోకంలో లేదు. అయినప్పటికీ నిన్ను చూస్తే నాకు జాలి వేస్తోంది. ఓ సలహా ఇస్తాను విను. ఏ ఉపాయం చేతనైనాసరే అగస్త్యమహర్షిగారి కృపా వీక్షణాలు నీ మీద ప్రసరించేలా చూసుకో.

## స్రగ్ధరా

పీత్వా గర్జంత్యపస్తే దిశిదిశి జలదాస్త్వాం
శరణ్యో గిరీణాం
మత్రామత్రాన భాజాం త్రిదశ విటపినాం
జన్మభూమి స్త్వమేవ
గాంభీర్యం తచ్చ తాదృక్ త్వయి సలిలనిధే!
కింతు విజ్ఞాప్య మేతత్
సర్వోపాయేన మైత్రావరుణి మునికృపా
దృష్టయః కాంక్షణీయాః

## మహాస్రగ్ధర

జలదంబుల్ నీ జలంబుల్ చవిగొని యురుమున్,
శైలముల్ వజ్రిభీతిన్
తలదాచన్ నిన్ను జేరం దలచెను, మొదలన్
కల్పవృక్షంబు నీలో
వెలసెన్, గాంభీర్య సంపద్వి భవుడవు—
సరే—విన్నపం బొండు సేయన్
వలతున్—పాథోధీ! కుంభోద్భవముని కృపకున్
పాత్రతన్ గోరుకొమ్మా.

* * *

## కిరాతి

ఒకసారి జగన్నాథుడు వీరవిల్లిపాలెం అనే చిన్నారిపల్లెటూరికి వెళ్లవలసి వచ్చింది దూరపు బంధువుల ఇంట్లో పెళ్లికి. అక్కడి పాటకపు జనం ఇతడి వేషభాషలు అట్టహాసంచూచి ప్రశ్న చెప్పించు కోడానికని ఎంతో ఆశగా వచ్చారు. తనకు ప్రశ్న చెప్పడం చేతకాదు అన్నాడు జగన్నాథుడు. తర్క వ్యాకరణాలంకార వేదాంత ధర్మశాస్త్రాల్లో ఏదైనా కావలిస్తే చెప్పగలనన్నాడు. చిన్నప్రశ్నే చెప్పలేకపోతే ఈ వేషం గీషం అంతా ఎందుకన్నట్లు నిరసనగా చూచి, పెదవి విరిచి, ఒక్కొక్కరే అక్కడినుంచి జారుకున్నారు. వాళ్ల అమాయికత్వం చూడగా పండిత రాయలకి జాలేసింది. నవ్వొచ్చింది.

సింహం అప్పుడప్పుడే ఓ మత్తేభాన్ని చంపింది. దాని కుంభస్థలంలోని ముత్యాలు కొన్ని సింహం గోళ్ల సందుల్లో గుచ్చుకుని, ఆ మృగరాజు వెళ్లిన దారిలో రాలిపడ్డాయి. మరి కాంసెం సేపటికి అటునైపుగా ఒక కిరాత స్త్రీ వెడుతూ, దారిలోపడిఉన్న రక్త సిక్తములైన గజముత్యాలను చూచింది. అవి రేగు పళ్లు అనుకుంది! పిల్లలకి ఇష్టం తింటారు అని వాటిని ఏరి కొంగువ మూట కట్టుకుని, గుడిసెకు చేరుకుని, శుభ్రపరచడంకోసం నీళ్లల్లోవేసి కడిగింది దానితో రక్తం అంతాపోయి తెల్లని స్వచ్ఛమైన ముత్యాలు మిగిలేయి. అవి రేగుపళ్లు కాదని అప్పటికి గ్రహించింది ఆమె. హయ్యో! నా తెలివి తెల్లారా, వీటిని ఇంతదూరం వ్యర్థంగా మోసుకువచ్చానే అని నిట్టూర్చి, పెంటకుప్పమీదకి విరేసింది!

## మాలినీ

హరి నఖర విముక్తా రక్తసిక్తాహి ముక్తాః
పరిణత బదరాణీ త్యాదరే ణోవ గృహ్య
సపది సరసి ధౌతాః ప్రత్యభిజ్ఞాయ ముక్తాః
పరికిరతి కిరాతీ హంత కాంతార ఏవ.

## చంపకమాల

హరినఖముక్త రక్తమయ హస్తి
శిరస్థిత మౌక్తికమ్ములన్
పరువపు రేగుబండులను భ్రాంతి
వనేచరభామ యోర్తు నం
బరమున నింటి కేరుకొని వచ్చి,
జలమ్ముల గుమ్మరించి, నె
త్తురు దొలగంగ నుస్సురని
దూరమునన్ పడవైచె వానినిన్.

* * *

## కోతిమూక

ఒకప్పుడు ఒక పండితుడు కాశీనుంచి స్వగ్రామం వెడుతూ దారిలో పెద్దమల్లు అనే మన్యం దొరను దర్శించబోయాడు. లోపల్లపరిచి కూర్చోమని ఆహ్వానించాడు ఆ దొర. తాగడానికి పనందైన ఇప్ప కల్లు ఒక గేదె కొమ్ముకిండాపోసి అందించాడు. ఆ

పండితుడికి ఒళ్లుపట్టి స్నానం చేయించమని ఇద్దరు వస్తాదులకి పురమాయించాడు.

కోతుల సభలో చెట్టుకొమ్మలే మృదులాసనాలు. కిచకిచలే సుభాషితాలు. పళ్లతో కొరకడమూ, గోళ్లతో బరకడమూ ఆతిథేయాలు. న్యాయమే మరి.

## ఉపజాతి

యుక్తం సభాయాం ఖలుమర్కటా నాం
శాఖాన్తరాణాం మృదులా సనాని
సుభాషితం చీత్కృతి రాతి థేయా
దంతైర్నఖా గ్రైశ్చ విపాటనాని

## ఆటవెలది

చెట్టుకొమ్మ లుచిత సింహాసనమ్ములు
కిచకిచల్ మనోజ్ఞ వచన రచన
పళ్లగోళ్ల కొరికి బరుకుటాతిథ్యంబు
కోతిమూక తీరు కొలువులోన.

* * *

## సముద్రుడు

జమీందారుగారి దివాణం చాలా పెద్దదీ, ఖజానా చాలా బరువైనదీ అనివిని ఒక పండితుడు ఆయనగారి దర్శనంకోసం వెళ్లేడు. అతగాడు విన్నది నిజమేకానీ, అక్కడ అతడికి దక్కినది ఏమీ లేదు. పైగా అసూయా పరులైన దివాణపు ఉద్యోగులు అతడికి దేహశుద్ధి చేయించాలని చేసిన ప్రయత్నాల మంచి ఎల్లాగో తప్పించుకుని బయటపడేసరికి తల ప్రాణం తోకకివచ్చింది. 'ప్రాణాలతో నన్ను బయటికి వెళ్లనిచ్చావు అంతే చాలునయ్యా జమీందారూ!' అనుకున్నాడు.

ఓ సముద్రుడా! నీలోని పగడాలను, ముత్యాలను, మణులనూ ఏరుకుందామనే వెర్రి ఆశతో వచ్చాను, వాటికన్నింటికీ వెయ్యేసి దండాలు చాలు చాలు. అవి అన్నీ నాకు దొరికినట్లే సంతోషిస్తున్నాను. నీలోని దారుణమైన జలచరాలు నన్ను ఉట్టపడియంలా నమిలి మింగెయ్యకుండా ప్రాణాలతో వదిలి పెట్టేయి· అంతే చాలు. సెలవు.

## వసంతతిలక

స్వస్త్యస్తు విద్రుమవనాయ
నమోమణిభ్యః
కల్యాణమా వహతు
మౌక్తిక శుక్తిమాలా
ప్రాప్తంమయా సకలమేవ
ధనం పయోధే!
యద్వారుణైర్జల చరైర్న
విదారితోఽస్మి

## చంపకమాల

జలనిధి! నీ ప్రవాళవన సంతతి
కొక్క సలాము! రత్న రా
శులకు నమ శ్శతంబులు!
విశుద్ధ మనోహర మౌక్తిక వ్రజం
బుల కొక వేయి దండములు!
ముట్టినయట్లె తలంతు నన్నియున్
జలచర కోటి నన్ నమిలి చంపక
పీడెను, చాలునంతియే.

* * *

(ఇందులోని తెలుగు పద్యాలు డాక్టర్ మహీధర నళినీమోహన్ అనువదించిన భామినీ విలాసం లోనివి.)

# జోలగోల

శ్రీ వి. మోహన ప్రసాద్

నిద్ర మాత్త్రర్లు నాలు గేసుకొని
నూతిలోంచి నీళ్లు తోడుతూన్నా.

ప్రాణాలు తోడీ తోడీ
నీళ్లన్నీ ఒంపేసీన్నా
శ్రీ మ దరబిందో కవిత. చదివినట్టూ
కబాడీ చావు గీతమీద రాలిపడినట్టూ
ఇటార్సీదాకా జీ. టీ.లో తోరణంలా వ్రేలాడినట్టూ
గంగ ఆవలి ఒడ్డున పీళ్ళాడి నట్టూ
నూతిలోంచి నిద్రను తోడీ తోడీ
ఒంట్లోంచి ఊపిరిని వొంపీ వొంపీ
ఒక్కొక్క ఆవులింతలోనూ ఒక్కొక్క కవి
బాదెలేర్ మలార్మే రిం బాడ్‌ల అనుభవ వేదాల తుంపుర్ల్ని
నెత్తిమీద పోసుకొని చలి కొణుకుతూ
నిద్రలేని మాత్రలు నాలుగు మింగి
వరాలలో పేనిన చాంతాడు నజ్జునజ్జువుతూంటే
నగరాలలో నా మీదకు వొంగిన నావా గగనాల
తుంపుల మంచుని చీల్చుకొంటూ వొస్తున్న జ్ఞాపకాలు
శల్యావస్థలోఉన్న శిశిర ప్రసూనాలు
ముఖ్యంగా బిర్లామందిరం ముందు రోజా ఉదయాలు
ఈ క్షణానా
కొన్ని యుగాల నాటి ఓ క్షణానా గుర్తు.
మానవునిలో ప్రవహించే రోజా రంగూ
ఓ ఎర్రని కలా
కాంక్షా

ఎంతకూ ఒట్టిపోని యీ నూతిలోంచి
బిందె తర్వాత బిందెగా
జన్మ తర్వాత జన్మగా

కాగ్నిషన్ తర్వాత రికగ్నిషన్‌గా
నన్నూ నా అనుభవ వేదననూ తడుపుతూంటై.

నిద్ర మాత్రలు వాలు గేసుకొని
సైకిలు తొక్కినా
పడవ మీద పడుకొన్నా
పోలీసువాడి టోపీ తన్నినా
పర్వతే రైలుమీద శీర్షాసనం వేసి నుంచున్నా
క్రీస్తు మరణశయ్య మీద పలాశాలు చల్లుకు పడుకున్నా
డొక్కలో ఎక్కడో ఓ పక్క నన్ననిసూది గుచ్చినా
పేరుపేరునా క్షమా ప్రేమల ఉత్తరాలు రాసి ఉంచినా
ఇంకేం చేసినా గాని
నిద్ర మాత్రలు 4 వేసుకో నట్లే లెక్క,
మృత్యు మందహాస వ్యసనానికి లోనయి
కిల్ కిస్ కిల్ కిస్ అంటో
నిద్ర మాత్రలు నాలుగైదారేడెనిమిత్తొమ్మిది
వేల మాటవదార్లు తీసుకోవాలి.
నేలమీది ఆ నానా నూన ప్రమూనాల్ని
మబ్బుల్లో విరివెన్నెల్లో పూయించాలి.
మలార్మేకి అరబిందోకి షేక్‌హాం డిప్పించాలి.
తాజ్‌మహల్లో ఓ కల్కటా ఆడించాలి.
ఆడ్రియన్ హె్రనీకి ఆదికవి నన్నయ పాదాభివందనం చేయాలి.

కాలం ప్రవహిస్తుంది
మన మానసిక భావజాలం కాల జలంలోకి
కాగిత ప్పడవలా కదలిపోతుంది.
చెడిపోయిన గడియారమూ
ఏదో ఒక సమయం చూపిస్తుంది.

అనుభవ సారాన్ని మాటల్లో చెప్తామా
అవ్యక్తాన్ని వ్యక్తంగానూ
నిద్రను స్వప్నంగానూ చెప్తామా
అది చివరికి వ్యక్తావ్యక్తంగా లీనా లీనంగా
కునికిపాట్ల అలికిడిలోకి
నిదానపు నవ్వుల అలల్లోకి మారిపోతుంది,
అందుకే మనం నిద్రలో నీళ్ళ
తోడుతూంటాం బావిలోంచి.

జో ల గో ల

కల నిజం కాదు కాని
కలలోని బావి నిజం
కల కలకాలం నిజం కాదు గాని
కలలోని కాలం నిజం
తోడిన నీళ్లు నిజం కాదు గాని
ఊరిన కన్నీళ్లు నిజం.
నిజం నిజం కాదు గాని
అబద్ధం కానంతవరకు నిజం.

-

జీవన దార్శనికోద్వేగాన్ని
గగన శూన్యంలో పారాడే నీలంగా
కాగుతున్న తేనీటి ఆవిరిగా
అట్లపెనంమీద వేయించిన మంచు ముక్కగా
షేక్స్పియర్ బట్టతలనుంచి మొలిచిన గరిక పూవుగా
కరుణగా
దయగా
తీతువు కూతగా
వేకువ వానగా
చింతలతోపులో కురియు చిన్కులకున్ తడిముద్దయ్యైన బా
లింత యొడిన్ శయించు పసిరెక్కల మొగ్గగా
పోలీసులు మేకులు గుచ్చిన క్రీస్తుగా
రౌద్ర భీకర విప్లవారణ్యాలలో నేల రాలిన త్యాగమూర్తిగా
ప్రాణాన్ని యాచించని పట్నాయక్ గా
జీవన దార్శనికోద్వేగాన్ని
అధివాస్తవికంగా రిఫ్లెక్టెడ్ పారోలో చెప్తానా నేను
అందులోనూ నిజం ఉన్నది
కాల్చే నిజం కాదు కరగించే నిజం
కార్సో ఫెర్లింగెట్టీ గిన్స్బర్గ్
ముత్యాలమ్మ పారాబట్టీ
భిక్షు వర్షీయసి
గేదెమ్మటే పేడకడికోసం పర్వేట్టే పదేళ్ల పిల్ల
కూలీలోని మున్నీ లందరిలోను నిజం ఉన్నది
కాల్చే నిజం కరిగించే నిజం.
తెలిదా
నిద్రలోంచి నీళ్లు తోడటమంటే

చిందే పడిపోయిన మరణేచ్ఛని
జీవన భయ విహ్వలతనీ తోడిపొయ్యటం.
నో దెన్ దట్—
ఎన్ని మాత్త్రర్లు వేసుకొన్నా
చివరికి బ్రతికే ఉంటాం
ప్రాణాన్ని గుటుక్కున మింగలేం

మొగల్సరాయిలో విమానం దిగి రిక్షా ఎక్కి
కాశీ వొచ్చి ఏడుపుగొట్టు వీధులన్నీ తిరిగి
తలంటు పోసుకొన్న జుట్టు డాబామీంచి నేల ముఖానికి తగిలి
చలనం లేని శవాల పక్క కొత్తగిలిన నిద్రముఖాల్నీ
కొబ్బరి ముక్కల్నీ బంతిపూలనీ తింటున్న కుంకం పెట్టుకొన్న ఆవుల్నీ
కాల్వాత్న్న రోడ్డుమీద కాళ్లకు తగిలే గంగ అలల్నీ
దాటుకొంటూ చివరకు గంపెడాశతో
కాంక్షాసుమాలకోసం పచ్చిక రుమాలుకోసం
చప్రాసీ ప్రొఫెసర్‌కోసం లైబ్రరీలో ఏకాంత మనస్సుకోసం
ఊఁ అదే పనిగా తిరుగుతూంటాం
కాకపోతే
నో దెన్ దట్—
ఎన్ని మాత్త్రర్లు వేసుకొన్నా
చివరికి బ్రతికే ఉంటాం.

———



పెద్ద కథ :

# రామారావు చెప్పని కథ

## (చైతన్య స్రవంతిలో రచన)

శ్రీ పి. యస్. శాస్త్రి

(గత సంచిక తరువాయి)

## భాగం 3

అబ్బ! అమ్మ! హాయిహాయిగా వుంది కదా! వేణ్ణీళ్ల స్నానం ఎంత బావుం దెంతబావుంది!...ఏమిటినా లోలోని వేదాంతి? గుడుగుడుమంటా వెందుకు? అల్పసంతోషినా నేను? 'మాయామేయ జగంబె నిత్య మని' అని ఎవరో కవిగారు చెప్పినట్టు దేహానికి కలుగు తున్న అత్యల్ప సుఖములకే ముగ్ధుడనై మౌర్ఖ్యములో నడుచుంటినా? ఆత్మకు ఈ శరీర సుఖదుఃఖాలు అంటవూ? బావుంది నాయనా! ఆత్మ యీ శరీరంలో వుండదూ? వేణ్ణీళ్లు మరీ వేడిగా వుండి వొళ్లు చురుక్కుమంటే ఘొల్లుమని గోల పెడతాం గదా' మరి అప్పుడు? అది ఆత్మ ఘోష కాదూ?...'లేదు మిత్రమా రామం! ఆత్మ సర్వదా సాక్షిరూపియై చిదానందమున సర్వమును తిలకించు చుండును! నీవు మాయలో మునుగుటచే భ్రమలోపడి ఒళు చురుక్కు మన్నట్టు భావించెదవు అంతే!'...ఒహో! అద్వైతం తలకెక్కింది!' అర్థం కానిదల్లా అద్వైతం' అని వో మిత్రుడి నిర్వచనం! నిజమేనా? పోనిద్దూ వేదాంతం అద్వైతాల సంగతి యిప్పుడెందుకు! 'వాన ప్రస్థాశ్రమమున విశ్రాంతిగా కూర్చుండి గంభీర అద్వైత గ్రంథముల పఠింపనోపు!...' అది అదీ మిష్టర్ రామారావ్! అచ్చమైన భారతీయుడవని పించావ్! చేసే వెధవ పన్లు అన్నీచేసి అప్పుడూ పాప ప్రక్షాళనం'...' కాదయ్యా వేదాంతీ! కంగారు పడకు నే చెప్పేది వినిపించుకో! సంసారములోనున్న యువ కులకు వేదాంతం, ప్రత్యేకం అద్వైతం అసలు కుదరదు! 'ఏకమేవా అద్వితీయం బ్రహ్మ' అను కుంటూ సర్వం నీలోని పరమాత్మే అని తెలిసీ తెలి యని వేదాంతంలోకి వెడితే పెళ్లాంతో కాపరం చెయ్య టం కష్టమే, పిల్లల్ని కోప్పడటం కష్టమే!' 'నేస్తం అద్వైతం మనకొద్దు ప్రస్తుతం!'

'ఓయ్ ఓయ్! వస్తున్నానుమణీ! ఒక్కనిముషం!' 'తొందరపడవయ్యా రామారావ్! లేకపోతే దోసెలు చల్లారి పోవటం తథ్యం! దోసెలు చల్లారినా శ్రీమతి వాక్కులు వేడివేడిగా వుండటం సత్యం!'

...అమ్మయ్య! 'దోసెలు పులిహోర దద్దోజ నాలతో ఆరగింపవయ్య రామరాయ!' పద్యంగా రాయ బోయి గేయంగా మార్చాను'గాయంతి గేయం! కనుక పాడుకో గలిగింది గేయమే! నేటి కవుల కెవరికీ తీసిపోను నేను! వెనకాల రాగతాళాలు ఏర్పరిచి అరవై రకాల వాయిద్యాలు పెడితే అమోఘంగా అనిపిస్తుంది. ఏ చెత్త అయినా! ఇప్పటి సినిమాలు చూడరాదూ? దోసె వెనుక ఒక దోసు కాఫీ 'ఓహో అద్భుతంగా వుంది! స్వర్గం కనిపిస్తోంది! 'మాయ! మాయ' అని వేదాంతి గాడెంత ఏడ్చినా సరే! ఈ సుఖాలే నా కిష్టం! ఓహో! జీవితం సంసారం ఎంత సుఖప్రదములు

రైట్ బావుంది! బ్రహ్మాండంగా వుంది! కొద్దిగా వక్కపొడికూడా సేవిద్దాం! 'నైస్ ఫినిషింగ్ ఫర్ నైస్ బ్రేక్‌ఫాస్ట్!' 'కమాన్ ప్రొసీడ్ టు ఆఫీస్!' ఆలస్యం అమృతం విషం! కాస్సేపాగితే శ్రీమతితో యేదేనా పేచీ రావచ్చు. ఏ యూనియన్ వాళ్లో 'బంద్' కాని హర్తాళ్ కాని ఏర్పాటు చెయ్యొచ్చు! అప్పుడు ఛస్తే ఆఫీసుకు వెళ్లలేం, ఆ వెనకాల చచ్చినట్టు ఆఫీసుకు శెలవు పెట్టాలి!...... ...

...'హమ్మయ్య! ఉదయం కార్యక్రమం పూర్తి చేసాం!' 'ఇంక మార్నింగ్ ట్రాన్స్మిషన్' ష్! ఆంధ్రదేశంలో తెలుగు కాలేజీల్లో మాధ్యమం (మీడియంకు తెలుగుట!) కనుక 'ఉదయ ప్రసారం' అందాం ఆకాశవాణి విజయవాడ కేంద్రంలా!... 'రాళ్లూ రప్పలు; గతుకులు; గోతుల రోడ్డు పై మన రాలీ సైకిల్ పోనిద్దాం!...' ఏదో సినిమాలో యస్టీలా నాకూ ఎవరేనా ఆడపిల్లతో సరాగాలాడుతూ సరదాగా ఆఫీసుకు వెళ్దామని వుందిగాని మ్చ్!.. కుదరదు! ఇంపాసిబుల్! యస్టీకైతే బోల్డు డబ్బిచ్చి (నిజమా కాదా? 'రహస్య వీరుని' అడుగుదామా?) బాబూ అల్లా ఏక్టు చెయ్యండి అని కాళ్లు పట్టుకుని బ్రతిమాలుతారట. ఆ తరవాత నాలాంటి వాళ్లంతా బోల్డు డబ్బు తగలేసి ఆ సినిమాల్ని చూస్తాం. అలానే చెయ్యబోతే 'ఇన్నేళ్లొచ్చి పెళ్లాం బిడ్డలూ సంసారం పెట్టుకుని నీ కిదేం వెధవ పని?' అని తిడతారు...కనుక మన ఆశ, అలా 'మదీయ వూహాపథంబున నిత్యమై సత్యమై వెలుగొందవలసినదే!'

ఔనూ, నిజంకాని ఆశలు కలల్లో ఫలిస్తాయట...నిజమేనా? మరి నిత్యజీవితంలో జరగడానికి వీలులేని చాలా విషయాలూ సినిమాల్లో జరిగినట్టు కనిపిస్తాయి! కనుక సినిమాలూ కలలూ ఒకటేనా? అవునవును! ఒకటే! సినిమాలూ యాజ్‌యాక్వల్‌టూ కలలు! ఓహో! 'వాటెఫైన్ పీస్ ఆఫ్ డిస్కవరీ!' ఈ సిద్ధాంతం మన సొంతమేనా?...మేనా? ఎక్కడో నో సినిమా పోస్టర్‌లో' పంచరంగుల కలలుంటాయా? ఉన్నాయి! 'వాటిని మా సినిమాలో చూడండి' అని చదివిన గుర్తే! ఏ సినిమా అబ్బా అది! 'ఇద్దరమ్మాయిలా?' కావచ్చు! కావచ్చు! అయితే యీ విషయం నాకంటే ముందు వాళ్లే కనిపెట్టినట్టున్నారు! సో! చివరకు తేలిందేమిటయ్యా అంటే టెక్నికలర్ సినిమా యాజీక్వల్‌టు టెక్నికలర్ సినిమాలాంటి కల! కనుక కలలు కల్లలైనట్టే సినిమాలూ కల్లలే! ఇలలో ఆ యిమిటేషన్ పనికిరాదు! 'సినిమాల ననుకరించబోకు నేస్తం' ... తప్పుకోవయ్యా బాబూ! ఓ ప్రక్కకి! అరక్షణం లేటయితే నువ్వూ నేనూకూడా ఆ సిటీ బస్సుక్రిందపడి చచ్చేవాళ్లం!' పాపం అతనూ నాలాంటి భావుకుడేమో! అయినా చస్తే చచ్చేవాణ్ణి, ప్రాణంమీద యింత తీపి యెందుకో! 'అబ్బే! నాకేం తీపి లేదు సార్! వెనకాలవున్న భార్యా బిడ్డలకోసమే, నా బాధంతా! వాళ్ళేం కష్టపడతారో అని భయం కొద్దీ బ్రతకటానికి యీ జాగ్రత్త! 'ఓహో! ఏం చెప్పావ్ మై డియర్ రామరామ!' అదేమిటి! 'రామా రావూ' బదులు 'రామరామ' అంటున్నాడు యీ నాలోవాడు! నేను చెప్పిన కారణంలోని అసత్యం గ్రహించి అపహాస్యం చేస్తున్నాడా? ఓ రకంగా చూస్తే యీ పైకి చెప్పేది వొట్టి నాన్‌సెన్స్! చచ్చిన వాడికి బ్రతికివున్నా వాళ్ళ కష్ట సుఖాలు అనవసరం! తన ప్రాణంమీద తనకున్న తీపిని చెప్పకోలేక ఎవళ్ళమీదో తోసేస్తూ వుంటాడు! 'నాకు చావాలని లేదు! నాకోసం నాకు బ్రతకాలని వుంది!' అని ముఖాముఖీ చెప్పే వాళ్ళు ఎంత తక్కువో! పాపం స్వర్గంలోవున్న (స్వర్గంలోనే వుంది అనుకుందాం! నష్టమేం వుంది!) సినిమాతార మధుబాలమాత్రం యీ సంగతిని నిర్మొహమాటంగా చెప్పేసింది! 'నాకు చచ్చిపోవాలని లేదు! నన్నింకో డాక్టరు దగ్గరకు తీసుకు వెళ్ళండి' అని! అదీ ఆఖరి క్షణాల్లో! 'బ్రేహో మధుబాలా!' 'ప్యార్‌కియాతో డర్నాక్యా' అని ధైర్యంగా మొగల్—యి—ఆజమ్ 'సినిమాలో' పాటపాడటం నీకే చెల్లింది! నిజ జీవిత మందుననూ, సినిమాల యందునూ, నొకే విధమైన పాత్రలను నిర్వహించిన మధుబాల ధన్యజీవి! ఇందువల్ల ఆమె కుటుంబమే

కాక భరత వర్షమును, ఆసియా ఖండమును, ధన్య మైనవి! అబ్బ! మళ్లీ యీ చిన్నప్పటి వాక్యాల ధోరణి! 'ఎవ్విధంబుననూ, యీ చిన్నతనము నొది లించుకొనుట, యీ పెద్దతనంబున నాక సాధ్యంబు గాకున్నదే!' హతవిధీ! యింకేమి చేతును!.. ......

పోనీలెద్దూ! ఈ సంతోషపు జ్ఞాపకాలైనా లేకపోతే జీవితమే ఛండాలమై పోయేది! పెద్దవాళ్ళ మైనప్పటినుండి చేసేవన్నీ ఛండాలపు పనులే! ఇవి అస్తమానం జ్ఞాపకంవస్తే ముందుచెయ్యవలసిన పరమ ఛండాలాలను చెయ్యలేముగా! కనుకనే భగవంతుడు పెద్దవారికి చిన్నతనముమాత్రమే గుర్తుండునట్లు వరమిచ్చెను!

హమ్మ! ఆఫీసు గేటొచ్చేసింది! అబ్బో నా టైము పదీ పదిహేను అయినా ఆఫీసరుగారి కారు ఆఫీసు ముందుండే అవ్వడే! నా గడియారమే తప్పో ఆఫీసరుగారు ముందే వచ్చుట నాకు ముప్పో ఎవరి కెరుక? చెమటపట్టు వరకును ఆగి తుడుచుకొనుట శ్రమజీవుల కర్తవ్యము. దాన్ని మెల్లి మెల్లిగా కర్చీ ఫుతో అద్దుకోవాలి! దానిచూసి ఓహో నేనింత శ్రమించి దేశము నుద్ధరించుచుంటినికదా అను కోవాలి! వీలైతే కాసిని కన్నీళ్లుకూడా! ఓహో! ఏం సినిమా టిక్‌గా వుంది! ఇవి సరేగాని అసలు ఎండా కొండా అనక పనిచేసే 'ఉప్పరి' సంగతేవిటి? వాడికి వంటిమీద గోచీతప్ప ఏమీ వుండదే! ఇంక కర్చీపు ఎక్కణ్ణుంచి వస్తుంది తుడుచుకోడానికి! 'ఘర్మ ధారలు సలిల ప్రవాహంబుల భంగి సాగిపోవు!' వాడి చెమట ధారల్ని వర్ణించి కవులు డబ్బు చేసుకోవ డానికి తప్పితే అవి వాడికి ఒందెందుకూ పనికి రావు! లేని చెమటను తుడుచుకొన్నట్లు నటించేందుకు సినిమా తారలకెంత డబ్బిస్తారో! దాన్ని చూడ్డానికి వెళ్లి మనంయెంత తగలెయ్యం! నిజంగా ఉప్పరి పని చేస్తూంటే చూడమే! వాడి స్థితిలో మనం వుంటేనో అన్న భయంతో అరమైలు ముందుకు వెళ్ళేవరకు వెనక్కి తిరిగి చూడం! కనుక మనకు నిజంకంటే నటన అంటేనే ఎక్కువ మోజన్నమాట! నిజాన్ని చూడలేని, భరించలేని, దీనులం! హీనులం! భీరువులం!... సైకిలుకి స్టాండువేసి తాళం వెయ్య డానికే పది నిముషాలైందే! ఆఫీసరు మహా ప్రభువులు ఆఫీసులో కడుగుపెట్టిన మరుక్షణంనుండి క్షణ క్షణం నన్ను పిలవక మానరుగదా! అటువంటప్పుడు యిప్పడి కెన్నిసార్లు పిలిచి వుంటారో! 'హరియప్! రామారావ్! స్కూల్లో వంద గజాల పరుగు పందెంలో ఎన్నిసార్లు ఫస్ట్ రాలేదూ?' 'కమాన్ క్విక్! రామారావ్ కమాన్!' ఎవరివీ మాటలు' సుజాతవా? ఎక్కడుందో పాపం వెర్రిపిల్ల! నేనెప్పుడు స్పోర్ట్సులో పాల్గొన్నా ఎంకరేజ్ చేస్తూ వుండేది! నైస్ గర్ల్! పి. యూ. సీ. అయిపోయాక వాళ్ల నాన్న గారి ట్రాన్స్‌ఫర్ మూలాన్ని విశాఖపట్టణం వెళ్లి పోయింది. పెద్దపెద్ద (అమాయకత్వాన్ని వెల్లడిచేసే) కళ్లు! దట్టమైన నల్లటి జుట్టు! అచ్చం బాపు బొమ్మలా వుండేది! పరుగు పందెం రోజున నాకోసం అరిచి అరిచి గొంతుక పోగొట్టుకుంది! 'సుజాతా ఎక్కడున్నావ్: ఎక్కడున్నా, నువ్వు నీ భర్తా పిల్ల లతో కులాసాగా వుండాలి! మే గాడ్ బ్లెస్ యూ!'...

...'ఓయ్ ఓయ్ వెంకటయ్యా! సంతకం పెట్టకుండానే రిజిష్టరు తీసుకెడతావేం? ఇంకా పదీ వలభై కాలేదుగా! అయ్యగారు పదిన్నరకి ఎంతమంది వచ్చారో చూడ్డానికి తెమ్మన్నారా? సరే తీసుకెళు!' అంటాడు అంటాడు! అనడూ! ఆయన సొమ్మేం పోయింది? ఈయన పదిన్నరకి వచ్చి అయిదు గంటల వరకూ ఎన్నిరోజులు వున్నాడో ఎవరేనా లెక్క అడి గితే బాగుండును! ఊహ! ఎందు కడుగుతారు! వాళ్లూ అలాంటి వాళ్లేగా! 'కంచెయే చేను మేసిన మంచె యేమి చేయును!'

ఓహో! ప్రాసకోసం కాస్త స్వంత కవిత్వం కూడా కలిపేవట్టున్నాను! తప్పు కనిపించటంలేదు కాని మంచె బదులు మంచెమీద వాడు అని వుండా లేమో! అలా ఉంటే అప్పుడు 'కంచెయే, మంచెయే' అనే 'యమకంపు సొంపు' దెబ్బ తింటుందే! పోనిద్దూ! ఎవడేనా అడిగితే 'మంచె' అంటే మంచెమీద వాడు

అని అర్థం చేసుకోవాలి అని డబాయిద్దాం! ఎంతమంది పెద్దపెద్ద కవులే అల్లా చెయ్యటంలేదు!...

...'ఓహో! అయ్యగారు రమ్మంటున్నారా వెంకటయ్యా వస్తున్నా నొస్తున్నాను! ఒస్తునానన్నెప్పు!' వస్తాను సార్! రాక ఛస్తానా! తమ అడుగులకు మడుగులొత్తవలసినవాడిని! తమ పాదార వింద రజాన్ని శిరస్సున ధరించవలసినవాడిని! యువర్స్ మోస్ట్ ఒబీడియంట్లీ!

......'అమ్మయ్య! ఈసారికి అయ్యగారు ప్రసన్నంగానే వున్నారు. దాం తగలెయ్యా! ఆయన గారి ఎదురుగుండా వెళ్ళేసరికి ఆలోచనలన్నీ ఆకాశంలో కెగిరిపోతాయో యేమో! ఒక్కటీ గుర్తుండి చావదు బయటకొచ్చేసరికి! అమ్మ! ఈ పూటకి పిడుగులు, ఉరుములు, కురియింపు లేదు! 'కురియింపు' అన్న ప్రయోగం రైటేనా? అయ్యేవుంటుంది! కాకపోతే యిప్పుడవుతుంది! 'కాదన్న మాదన్న' యెవడు అని మనమూ వో ఛాలెంజి విసిరితే సరి! కాదనబోయే వాడు కూడా నోరుమూసుకు వూరుకొంటాడు. ఎంత మంది ఎన్ని క్రొత్తపదాల్ని తయారించటం లేదు తెలుగులో! ఈ తయారించు అన్న మాటని మూడు వీక్లీల్లో చదవలేదూ!... ..

'ఓయ్ ఓయ్ రామారావ్! అయ్యగారికి ఫైలు అరగంటలో యివ్వకపోతే నీ బుర్ర రామ్ రామ్!' అబ్బ తిట్టేది సరిగ్గా తిట్టవోయ్ నాలోని మనిషీ! 'నీ బుర్ర రామకీర్తన' అనాలి కాని 'రామ్‌రామ్' అవకూడదు! నీకూ నాకూ మాటలు చెల్లు అన్నప్పుడు మాత్రమే మనవాళ్లు రామ్‌రామ్ అంటారు. గుర్తు లేకపోతే సరళని గుర్తుతెచ్చుకోరాదూ! సెకండ్ ఫారమ్‌లో రామ్‌రామ్ అన్నాక మళ్ళీ నాతో యింత వరకూ మాట్లాడిందా సరళ, యీ వూళ్ళోనేవున్నా? ఇంతకీ అసలు యీ ఫైలులో యేముంది? కాయితంలో ఏం వుంది? ఆయనగారేదో పని చెబుతున్నా 'దిగిరాను, దిగిరాను, దివినుండి భువికి!' అన్నట్టు మనం వూహా లోకంలోంచి క్రిందకు దిగకపోతే ఆయనేం చెయ్య మన్నాడో మనకేం గుర్తుంటుంది?......

......'సరే! ఏం చేస్తాం! వచ్చిన కాగితాన్ని బొక్కో నోట్ పెడదాం!'...అమ్మయ్యా! గుర్తులేనన్ని ఆలోచనలమధ్య మొత్తానికి ఫైలు పూర్తిచేసా!' 'కంగ్రాట్స్ రామూ' ఆయనగారిచ్చిన టైముకన్న పదిహేను నిముషములు ఎక్కువ టైములో మాత్రమే పూర్తిచేసి రికార్డు సృష్టించావు! రికార్డ్! రికార్డ్! రికార్డు పద్మాదేవి! ఎక్కడుంటున్నారు మీరు? నేను చేసిన ప్రాక్టికల్స్ అన్నీ నా రికార్డునుంచి చక్కగా ముత్యాల కోవలాంటి అక్షరాల్లో కాపీచేసి, ప్రాక్టికల్స్‌లో నాకంటే ఎక్కువ మార్కులు సంపా దించేవారు! అఫ్‌కోర్స్! మీ సంగతి తెలిసినా ఆ ఏడుపు మొహం లెక్చరర్‌గాడు మీ, నవ్వనే, సమ్మోహ నాస్త్రంలోపడి వొళ్ళు మరిచి నోరు మూసుకు ఊరుకునేవాడు! ఇంకా నయం! పద్మాదేవి రికార్డు నేను కాపీ చేస్తున్నానని నన్నే డబాయించపోయాడు వోసారి! 'డర్టీ స్కాండల్!' దగ్గరనుంచో బెట్టు కుని ప్రాక్టికల్‌చేసి రిజల్టు చూపించాక నోరు మూసుకుపోయాడు! దొంగపీనుగ! ఇంకా ఆ కాలేజీ లోనే లెక్చరర్‌గా 'రాట్' అవుతున్నాడు. నా ఖర్మ బాగోపోయి రిజల్ట్ రాకపోతే అబ్బాయిలు అమ్మాయిల ముందర నా పరువేమయి వుండేది! నాదే సత్యము కనుకనే నా పరువు నిలబడినది! సత్యమే దేవుడు! కనుక దేవుడున్నాడని ప్రూవ్ అయింది! ఓహో ఏం బావుంది రీజనింగ్!' 'తర్కాగ్రేసర, తర్కపంచానన!' ఆగాగు! ఆగవోయ్ రామారావ్! ఆ ఫైలు వెంక టయ్యకిచ్చి, ఆపయిన, టైటిల్స్ యిచ్చుకో!

......'వెంకటయ్య! ఆఫీసరు వెనకటి అయ్యా! ఈ ఫైలు లోపలికి తీసుకెళ్లు!' పాపం మంచి ముండావాడు. వాడికి రావలసింది వాడికి ముడితే, ఎవడిమీదా చాడీలు చెప్పడు! లేదో గోవిందో గోవింద! 'అయ్యయ్యో! అలా అరుస్తా వెందుకయ్యా!' ఆఫీసరు తిట్టాడా! నన్ను పిలుచుకు రమ్మన్నాడా!' బాబోయ్! కొంప మునిగిందిరా దేవుడా! ఆపద మ్రొక్కులవాడా అలిమేలు మంగా పతీ! ఆర్తత్రాణ పరాయణా! నువ్వే నాకు దిక్కు! 'ఒస్తున్నానయ్యా.. పద!'

......'అమ్మయ్య! లోపలికికెళ్లి బయటకొచ్చే సరికి తుఫానులోంచి బయట పడ్డట్టైంది! కాగితంలో తాసిల్దారు రికమెండ్ చేసిన ప్రకారం ఆ పోరంబోకు భూమి రంగయ్యకు యివ్వడానికి నోటు పెట్టాను! ఆయనగారు వాళికి యివ్వకుండా రమణయ్యకి యిచ్చేలా పాయింట్లు 'లాగి' నోటు పుటప్ చెయ్యమన్నాడట! ఆయన చెప్పింది మనం తిన్నగా వినిపించుకోలేదు కదా! చిత్తము పరాయత్తమైనప్పుడు యిటువంటి విపత్తులే సంభవించును! ఇంకో పది నిముషాల్లో అలా నోటు రాసి యివ్వకపోతే కలెక్టరేట్నుండి తాలూకా ఆఫీసుకు ట్రాన్స్ఫర్ తప్పదుట.

......'మై గాడ్!' ఎల్లాగో వోలాగ ఆయన చెప్పినట్టు నోటు పెట్టేద్దాం! ఆ తాసిల్దార్లు నమిలి మింగేస్తారట, క్లర్కుల్ని! అయినా నోటు మార్చటం ఎంతసేపు? ప్రతీ రూలుకూ వెనకా ముందూ ఉంటాయిగా! అందులో ప్రస్తుత ప్రభుత్వంవారి రూల్సు మరీ ప్రత్యేకమైనవి! అన్వయించేవాడి చాతుర్యాన్ని బట్టి అర్థాలు మారుతూ వుంటాయి! వడ్డించేవాడు మనవాడన్నట్టు, ఆయనే మార్చమంటే నాకేం! రెండు నిముషాల్లో మార్చిపారెయ్యనూ! క్విక్, క్విక్, రామారావ్! 'టేకిట్ ఆఫ్!' ఒద్దొద్దులే! డ్రాయరు సొరుగులో పడెయ్యి! ఎందుకేనా మంచిది! 'క్షణ క్షణముల్ ఆఫీసర్ల చిత్తముల్!'

...'పూర్ రంగయ్యా! మై కండూలెన్సెస్ ... 'ఏం వెంకటయ్యా అప్పుడే వచ్చావు అయ్యగారు రమ్మంటున్నారా?...ఏమిటి? ఏవన్నావ్! ఓహోహో! అయ్యగారు ఫోనొచ్చి యింటి కెళ్లారా? ఫైలు తీసుకుని అరగంటలో నన్నింటికి రమ్మన్నారా!......'థాంక్యూ రంగయ్యా థాంక్యూ!' అమ్మయ్య! మనం మళ్లీ యింకో పది . నిముషాలు గాలి ప్లన్ వ్యూహాలు మెయ్యొచ్చు! అయ్యగారికి నేను లోకువ! అయ్యగారు అమ్మగారికి లోకువ! కనుక మనం అమ్మగారికీ లోకువే! 'అమ్మగారికీ' ఏమిటోయ్ వెర్రి రామారావ్! నీకు తప్ప నువ్వెందరికీ లోకువే! ప్రతి వాళ్లు నిన్ను శిక్షించుటకు, భక్షించుటకు ప్రయత్నిస్తారు!

వరండాలో ఎవడా దీనుడు? చినిగీ, చినిగని వస్త్రాలతో, చెమటచే తడిసీ తడియని కండువాతో ఏమా వాలకం! 'ఓయూ దీనుడా! నీవు, 'మేము నీకంటే అధికులమని ఆత్మ సంతృప్తి కలిగించుటకు యేతెంచిన దేవుడవా?...'వెంకటయ్యతో ఏదో మాట్లాడుతున్నాడే వాడు! వాడి చేతిలో వో రూపాయికూడా పెడుతున్నాడు! ఇదేమిటి! నా దగ్గరకే వస్తున్నాడే!...

.....'అవునయ్యా! నేనే రామారావును! ఏం కావాలి?' హతవిధీ! ఏ రంగయ్యకైతే యింతకుముందు మనసులో కండొలెన్సెస్ చెప్పుకున్నానో ఆ రంగయ్యేట యితను! తన పేర ఆ పోరంబోకు భూమి దఖలు పడేలాచూస్తే ఏదో తోచింది యిచ్చుకుంటాట్ట. 'పూర్ఫెలో!' ఆ చినిగిన గుడ్డలు తప్పితే యేమున్నాయ్ వాడి దగ్గర యిచ్చుకోడానికి! వాడి కథ వినీ యింకా మూర్ఛపోకుండా ఎలావున్నా నబ్బా? వీడికే భూమి యిచ్చేలా నోట్పెడితే ఏం చేస్తాడు ఆఫీసరు? 'నన్ను ట్రాన్స్ఫర్ చెయ్యొచ్చు! రమణయ్యకి ఫర్గా వేరేవాడిచేత రాయించొచ్చు'' అలాచేస్తే చెయ్యనీ నా ఆత్మ సంతృప్తైనా మిగులుతుంది! ఆత్మసంతృప్తి చాలదూ ఎవరు సంతోషించకపోయినా? ఔనౌను! అదే రైటు! 'రంగయ్యా! ఎవరు నీకు న్యాయం కలిగించినా, కలిగించకపోయినా, నేను మటుక్కి నీకు న్యాయమే చేస్తాను! వెళ్లిరా! వెళ్ళు!...'హో! వెళ్లిపోయాడు, మెల్లిగా జాలి కలిగించేలా!...ఇతనికి న్యాయం కలిగించకమానను. 'హరిహర బ్రహ్మాదులడ్డము వచ్చినమ రానీ!' అద్గదీ! బ్రేహో రామారావ్! నువ్వినాళ్ళకి మంచి మనిషిగా, మానవతా ప్రతినిధిగా మారావు! కమాన్ డ్రాయరులో కాగితం పైకితీసి, ఫైలు చంకన పెట్టుకెళ్లి ఆఫీసరును ధైర్యంగా ఎదుర్కో! ఎన్ని సినిమాల్లో హీరోలు. విలన్లనెదుతున్నా కొడుతున్నా అరగంట లెక్చర్లివ్వటం చూడలేదు! స్టార్ట్! సైకిలును రథంలా తోలుకుపో! నిరస్త్రీ భూషితుడవై ఆఫీసరు రాక్షసి నెదుర్కో! 'కారేజిపై ఫైలుకట్టి వడివడిగా సైకిలుత్రొక్కి...'

వెదవది ప్రతిపనికి సినిమాలోలా తోడుగా పాటవుంటేనే కాని కుదరదేమో! నా స్వంత పాటల్తో మరీ బోరుకొడుతోంది. అయినా మానవుడు లోపలి కవి గాడు! దుర్విధీ నాకీ పాటల పీడ తప్పదా! త్రొక్కు, త్రొక్కు! త్రొక్కవయ్యా బాబు సైకిలును తొందరగా!

......అమ్మమ్మయ్యా! అయ్యగారి బంగళా వొచ్చేసింది. వొచ్చేసిం దొచ్చేసింది! మెల్లిమెల్లిగా, అల్లనల్లన, దీనుడిలా హీనుడిలా, చెప్పుక్రింద తేలులా, కాలిక్రింద వల్లిలా వెడదాం, వెడదాం, లోపలి కెడదాం! ఛఛ! ఇదేం ఉపవాసం దెబ్బలాట కెడుతూ! భద్రాచలం పెద్దపులిలా, కోస్తాలో తుఫానులా, విరుచుకు పడదాం! ఆఫీసరు నెదిరిద్దాం! అద్గదీ! అలా వుండాలి! నాలోపలి తెలుగు కవిగాడికి మతిపోతోంది. మరుపు పెరుగుతోంది. ఎంతసేపూ జాలి కవిత్వం, ప్రేమ కవిత్వం తప్ప విప్లవ కవిత్వం అంటే చచ్చే భయం! నోరు పెగలదు! పాపం వాడినని ఏం ప్రయోజనం! ఆంధ్రదేశమే అలా అఘోరిస్తోంది! వాడు మాత్రం నలుగురుతో వాడు కాదూ!

## భాగం 4

...అబ్బో! ఇంద్ర భవనమే యిది! ఎన్నిసార్లు చూసినా క్రొత్తగానే వుంటుంది. అయ్యగారు క్రొత్త గాని, మనకి బంగళా పాతదే కదా! అయినా ప్రతిసారి క్రొత్తగానే వుంటుంది! ఇంద్ర భవనమున దేవతలు వసింతురు కదా! కదా ఏమిటి! అయ్యగారు దేవుడు! అమ్మగారు దేవత! పిల్లలు బుల్లిదేవతలు! నేను! నేను మాత్రం నరుణ్ణి! నరాధముణ్ణి! అధమాధమ నరాధముణ్ణి! ... 'ఛ! వచ్చిన పని మరిచిపోతున్నా!' ఈ రాక్షస దేవత నెదుర్కోని, అదేమిటి? రాక్షస దేవత? సర్క్రొత్త పదాన్ని సృష్టించినట్టున్నానే! ఇంద్ర భవనంలో ఉండేవాళ్ళు దేవతలు. కాని మాఆఫీసరు ఇంద్రభవనమున నివసించుచునూ మానవుల పీడించ నెంచుచున్నాడు! కనుక రాక్షసుడు! సో! నా క్రొత్తపదమేర్పైటు 'రాక్షస దేవత'! లేక దేవతా రాక్షసుడైన, అవునవును అంతే! వ్యవసాయశాఖవారి వంకరజాతి విత్తనాలలాగే ఇదీ వో సంకరజాతి! కనక 'ఓరీ రాక్షస దేవతా! ఇదే నే యేతెంచుచుంటిని! కాచుకొనుము! మదీయ 'నోట్'తో నీ ఆశల కూలద్రోసి, నీ రమణయ్య కేసు నగ్గిపాల్గావించి, రంగయ్యకే భూమి నిప్పించెదను!'......

'సుబ్బన్నా! అయ్యగారెక్కడున్నారు? డ్రాయింగ్ రూములోనా, ఆఫీసు రూములోనా? మంచి మూడ్‌లో వుంటే చెబుతావ్!' ఛ! వెధవ అలవాటూ నేనూను! దెబ్బలాడటానికి వెళ్తూ, ఆయన మంచి మూడ్‌లో వుండట మెందుకో!...' ఏమిటి? ఇంట్లో లేరూ? మరి నన్ను రమ్మన్నారే ఫైలు తీసుకుని! ఆఫీసుకే రమ్మన్నారా?...లేదూ?...పోనీలే అక్కడికే వెడతా!... ఆఫీసుకే వస్తారేమో ఆయన! ఒద్దయ్యా మొగుడా! నే చెప్పేది విను! ..నే వొచ్చానని అమ్మగారికి చెప్పకు! ఒద్దయ్యా నాయనా!'

...అబ్బబ్బ! వెర్రి ముండాకొడుకు! నా ప్రాణం తీస్తేనే కాని వదలడులావుంది! వెళ్లిపోయాడు!... ఇప్పుడా అమ్మగారు సవా లక్ష ప్రశ్నల్తో నా ప్రాణం తీస్తుంది. నన్నో పురుగులా చూస్తుంది! తన భర్త పుట్టడమే ఆఫీసరుగా పుట్టినట్టూ, తాను చిన్నప్పటి నుంచీ ఆఫీసరు పెళ్లాంగానే బ్రతికినట్టూ నటిస్తుంది!...ఎలాగెలాగ ఆ చూపు భరించడం?...... ఏం దారేం దారి; నాకేది దారి? 'క్రూర విధీ! నా పరిస్థితి చూసి అపహసించుచుంటివా? అపహసించు, మపహసించుము! నే నిప్పు డెదుర్కొనబోవు దుర్భర పరిస్థితికంటె నీ అపహాస మధికము కాబోదు! హు! పోనిద్దూ! 'కానున్నది కాకమానదు!' 'నీతి చంద్రికలో చదువుకోలా? .....'లేకపోతే యేదో పెద్ద చెయ్యి గలిగిన వాడిలా వెధవ స్టైలూ నేనూను!' చింత చచ్చినా పులుపు చావ దన్నది యిప్పుడు కదా ప్రూవ్ అయింది! నేటికికదా అనుభవంలో కొచ్చింది! ఒచ్చేస్తోంది అమ్మగా రొచ్చేస్తోంది! తుఫానులా కాళికాదేవిలా, విరుచుకు పడుతోంది! శూర్పణఖ చెల్లెల్లా వచ్చేస్తోంది! కళ్లు మూసుకుని, మెల్లి మెల్లిగా తెరిచి, అపాయాన్నెదుర్కొందాం!

...ఏమిటి! 'ఎవరు? నువ్వు రామారావ్!' అని పలకరిస్తోందేమిటి యీవిడ! మతిపోలేదుగదా ఈవిడకి. లేకపోతే సుబ్బన్నగాడు నా పేరు చెబితే వేళాకోళం చేస్తోందా! కాదు కాదు! యీవిడ, యీ విడ యీవిడ కందుకూరి అరుణ కాదూ! అవునవును! నా కాలేజి మేట్ అరుణే! ఆమే! అదుగో ఆ పెద్ద కళ్లు, గుండ్రని మొహం చక్కటి ముక్కు! ఆమె ఆవిడ, యీవిడే! పలకరించనా? 'నువ్వా అరుణా! అనన్నా?...' తప్పు తప్పురోయ్ రామారావ్! ఆవిడ నీ ఆఫీసరుగారి భార్య!...'మీరు...మీరు ..' నా తడ బాటునుచూసి నవ్వుతోంది! ఇప్పటికీ మారని అదే నవ్వు! 'ఛ! ఇప్పటికీ మారని వెధవ కంగారు నేనూను!' వెర్రి వెధవలా నిలబడ్డట్టున్నాను!...

'అయ్! అయ్! ..నేను తమరి క్లాస్‌మేట్ రామారావు నేనండి! ఇక్కడ యు. డి. సి గా అయ్య గారి ఆఫీసులో పనిచేస్తున్నా! అబ్బే వద్దండి! కూల్ డ్రింకువద్దు! నాకు అలవాటు లేదండి. ఒక్క మంచి నీళ్లు చాలండి!'......

......అబ్బో! అరుణ ఏమీ మరిచి పోలేదే! కాలేజీలో వేసంకాలం కూల్‌డ్రింక్సుతప్ప ఏం త్రాగే వాడివి కాదుకదా అంటోంది! ఆడవాళ్ళకు, వాళ్ల స్నేహితుల్ని గురించి యెంత గుర్తో! అందరికీ యిలాగే వుంటుందా? ఉండదేమో! కాని అరుణ! అరుణ వేరు! అరుణకు ఎందుకో ముందునుంచీ నేనంటే యిష్టం! ఎప్పుడూ కాలేజీలో వున్న న్నాళ్లూ ప్రతివిషయానికీ నన్ను ఎంకరేజ్ చేసేది, 'ప్రేమలో' తప్ప! అయినా ఆమెను చూస్తూంటే, ఆమె చుట్టుపట్ల వుంటేనే లవ్వూ, గివ్వూ లాంటి అభిప్రాయాలే వచ్చేవి కావు! తన కూడా, ఆడ స్నేహితులున్నా, నేను నడిచొస్తూ దారిలో కనిపిస్తే, కారెక్కించుకుని, కాలేజీకి తీసుకు వెళ్లేది! అఫ్ కోర్స్! ఆ రోజుల్లో నేనూ వో ఆడపిల్ల లాగే మసిలేవాణ్ణిగా ఆమె దగ్గర! 'నో వాన్ని యిన్ స్టింక్ట్స్ యిన్ మి'! చదువులో ఫైనార్ట్సులో అన్నిం టిలో నన్ను ప్రోత్సహించిన దేవతామూర్తి! అరుణా! నీ సాహచర్యం మరువలేని ఒక చక్కటి కల! అవునూ యీవిడ కాలేజీ చదవగానే వాళ్ల నాన్నగారితో 'స్టేట్స్‌కి' వెళ్లింది కాదూ! మళ్లీ యిప్పుడు యిక్కడ! 'అరుణా! ఎన్ని రోజులు నిన్నూ నీ సాహ చర్యాన్ని గుర్తుకు తెచ్చుకుని బాధపడే వాణ్నో తెలుసా!' 'బాధా' అవును బాధే! ఆప్యాయతా పూర్వక ఆకర్షణవల్ల కలిగిన బాధ! 'దేవుడా! నువ్వు నిజంగా దేవుడివే అయితే ఒక్కసారి అరుణని నా కళ్లపడెయ్యి' అని ప్రార్థించానే! ఇవన్నీ ఆమెకు చెప్పాలని ఉరకలు, పెడుతోంది మనస్సు! కాని అవి బయటపెడితే చుర కలు తగలొచ్చు!' 'మై డియర్ మట్టి బుర్ర రామా రావ్! ఇప్పుడామె నీ ఆఫీసరుగారి భార్య! పదేళ్లనాటి పాత పరిచయాన్ని గుర్తుకు తెచ్చుకో ప్రయత్నించావో జాగ్రత్త! ఆవిడా ఆయన నిన్ను శంకర్‌గిరి మన్యాలు పట్టించొచ్చు!.. ...

'అయ్! అయ్! ఈ వూళ్ళోనే వుంటున్నా నండి! పెళ్ళయింది. ఇద్దరు పిల్లలు! శ్రీమతి పేరు శారదామణి! మా యింటికి వస్తామంటారా? తప్ప కుండారండి! అంతకంటేనా! మీరొస్తే మా యిల్లు పావనంగాదూ!..అలాగేనండి! కూర్చుంటున్నా!... కూర్చుంటున్నా' 'ఎన్నాళ్లకి ఆఫీసరుగారింటి సోఫాలో కూచో గలిగానో!' అది సరేకాని, అమ్మ బాబోయ్! ఇప్పుడీవిడవస్తే మా యింట్లో యీవిణ్ణి సత్క రించటానికి తగిన సాధనాలుకూడా లేవే! అయినా మా యింటి కెందుకు?...నన్నూ నా సంసారాన్ని చూసి గేలిచేయడానికా? 'ఛ! అయుండదు!' మరీ మానవత్వంమీద విశ్వాసం సన్నగిల్లిపోతోంది నాకు! అరుణ కళ్లల్లో కాలేజి రోజులనాటి స్నేహ భావం కనిపిస్తూనే వుందికదా! 'అరుణా! అరుణా! కాలేజి రోజుల్నించీ నా మనసులోవున్న నీ పవిత్ర స్వరూ పాన్ని యిప్పుడు మార్చకేం! నువ్వు నా స్నేహితురాలిగా, నా 'గైడ్'గా ఆరాధ్యమూర్తిగా, చక్కటి కలలకు ప్రతిరూపంలా నిలిచావు! అల్లాగేవుండు అరుణా! నువ్వు మారకు! నువ్వు మారితే నేనా 'షాక్' తట్టు కోలేను! అరుణా! అరుణా!......

'ఆ! ఆ! అహహ! లేదు! మీ పేరు గుర్తుకు తెచ్చుకుంటున్నా! మెల్లిగా నోట్లో అనుకుంటున్నాను మీరు గుర్తులేకేం! చక్కగా గుర్తున్నారు! నా కాలేజి జీవితానికి 'సిల్వర్ లైనింగ్' మీరేకదా! (బాబోయ్! ఇలా అన్నానేమిటి? కోప్పడదుకదా యీవిడ!) అమ్మగారొస్తున్నారంటే ఎంత భయపడ్డానో!'......

......'నన్ను చూసి భయంలేదా?' అని నవ్వుతోందేం యీవిడ! నవ్వుతూనే, నన్నుచూసీ భయపడాలి సుమా' అని హెచ్చరించటం లేదుకదా యీవిడ?' అయ్యుండదు! అయినా ఆడవాళ్ల నెవడు నమ్మమన్నాడు. 'క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్' పద్యం గుర్తులేదూ! ఈవిడా మారి వుండొచ్చు! అయినా పది సంవత్సరాల క్రిందటి పాత పరిచయాన్ని పట్టుకు ప్రాకులాడే వాడిని చూస్తే ఎవరికేనా నవ్వొస్తుంది!...తప్పదు! తప్పదు!...'నా సీనియారిటియాండీ! చచ్చినంత వుంది! రెండుసార్లు డిప్యూటీ తాశీల్దారు యిచ్చి వుండొచ్చు యీ పాటికి! నా సంగతి మీకు తెలుసుగా తల్లీ దండ్రీతప్ప ఎవరూ లేనివాణ్ణి! నా కెవరు రికమెండ్ చేస్తారు? రికమెండేషన్‌లేనిదే ప్రమోషనెవరిస్తారు!'

...'ఏమిటీ! నిజంగానే రెవిన్యూ బోర్డులో వాళ్ళకి, వాళ్ళ నాన్నగారిచేత రికమెండ్ చేయించి ప్రమోషనిప్పిస్తుందా!' 'అరుణా! నిజంగానా! నిజంగా నేనే అరుణా? అప్పటినుండి యిప్పటివరకూ మారనే లేదా నువ్వు! 'అరు...అరు.. అరుణాదేవీ! నీకు నా కృతజ్ఞత ఎలా చెప్పకోను! 'ఎందుకు యింత ఆప్యాయత నేనంటే నీకు, అరుణా దేవీ?'...అరుణా! అందుకో నా మూగ నమస్సులు

'అయ్! అలాగేనండి! నా ఉద్యోగపు 'డిటెయిల్స్' తరువాత యిస్తాను!' థాంక్యూ వెరీమచ్! అయ్యగారు అదే ఆఫీసరుగారు క్రొత్తగా వచ్చారని తెలుసుకాని, మీరు వారి శ్రీమతి అని తెలీదు!... నన్ను ఆఫీసుకు రమ్మన్నారా, ఆయన? ఆఫీసుకే వెడుతున్నానండి! మళ్లీ కలుస్తా మిమ్మల్ని! ఇవాళ నాకు చాలా సంతోషంగా వుంది మిమ్మల్ని చూసినందుకు!...వచ్చే ఆదివారం మా శ్రీమతిని పిల్లల్ని తీసుకొస్తా! వస్తానండి! వెళ్ళొస్తా'...!

...ఏమిటి, ఏమిటి యీ వింత! ఎక్కడి కె. అరుణాదేవి ఎక్కడి నా రాక్షసుడు! హాలాహలము అమృతము. ఛ! ఆయన హాలాహలంకాదు! రాక్షసుడూ కాదు! నేనే మతిమరపుకొద్దీ ఆయన చెప్పినది చెప్పినట్టు చెయ్యను!...ఇదేమిటి సైకిలు ట్యూబ్లో గాలిపోయిందే! వెధవది, వెధవగాలి పోతేనేం!' 'నేనే గాలిలో తేలుతున్నప్పుడు యింక గాలి నా కేల!' గాలిలోన తేలిపోయే...' ఏదో పాట వుండాలి గుర్తొచ్చి చావటం లేదు!...అవునవును. అరుణ! అరుణ! ఇన్నాళ్లకి మళ్లీ అప్పటికన్నా అందంగా అప్పటికన్నా ఆప్యాయంగా మాట్లాడుతూ! 'అరుణా!' అబ్బ! క్రింద చూసుకోకుండా రాతిని తన్నా! గోరు చిట్లింది! వెధవది! ఒక్కగోరే యేమిటి, ప్రాణంపోయినా ఫరవా లేదు! ప్రాణ సమానంగా దాచుకున్న అరుణమూర్తి మనఃఫలకంమీదినుండి ప్రాణం పోసుకుని బయట పడి కళ్ళెదురుగా ప్రత్యక్షం అయ్యాక, నేనే మైతేనేం!

......'తప్పుకో నాయనా! తప్పుకో! నీ సినిమా ఎడ్వర్టైజ్మెంట్ ఏడ్చినట్టే వుంది!' ఛ ఇంక యేదీ యేడ్చినట్టుంది అనకూడదు! ప్రతీదీ అరుణలా నవ్వుతూనే వుండాలి!' అరుణా!' నీతో వున్న వారందరినీ, ప్రత్యేకంగా నన్ను వుత్సాహపరిచే పవిత్ర మూర్తివి నువ్వు! నీ సమక్షంలో కొచ్చాక ఏడుపులూ దుఃఖాలూ వుండవు! ఉండకూడదు! అమ్మయ్య! మూడొంతుల దూరం లాగేశా! ఇంకొంచెం దూరం...! వచ్చేసా వొచ్చేసా! ఆఫీసుకు వచ్చేసా! 'ఓయ్ వెంకటయ్యా! ఆఫీసరు గారొచ్చారా? రాలేదూ మరీ మంచిది! సరేగాని యీ సైకిలు కాస్తగాలి కొట్టించుకురా! ఆగాగు! ఫైలు తీసుకోనీ!'...ఇంక యీ ఫైలు మిగిలింది! దీంతో ఆఫీసరుతో పోట్లాట వేసుకుందామనుకున్నానే! ఎల్లాగెల్లాగ ఇప్పుడెల్లాగ! అతను అహకాదు! ఆయన అరుణ భర్తే! అరుణ భర్త' కనక అతన్ని నొప్పించకూడదు! 'మరి పాపం! ఆ

రంగయ్యో!' 'ష్! 'ఊరుకోవయ్యా లోలోని మనిషీ! కాసేపు ఆ రంగయ్యని నువ్వు మరిచిపో! నన్నూ మరిచిపోనీ! ఇలా పోట్లాట వేసుకున్నానన్న సంగతి ఆఫీసరు అరుణతో చెబితే ఆమె ఎంత బాధపడుతుంది? పైగా నాకు ప్రమోషన్‌కి రికమెండ్ చేయిస్తానంది! డిప్యూటీ తాశీల్దార్ అయితే మహా హాయిగా వుంటుంది. డిప్యూటీ తాశీల్దార్ రామారావ్ బి. యస్. సీ...బ్రహ్మాండం! 'ఏం చేస్తున్నావ్ రామారావ్?...' 'డిప్యూటీ తశీల్దార్‌నండి!' 'డిప్యూటీ తాశీల్దారుగారా! రండి! రండి! ఇక్కడ కూర్చోండి! ఇక్కడ సీటు రిజర్వు చేసివుంది!'.. ఓహో ఏం మర్యాదలు జరుగుతాయి! జీతంకూడా పెరుగుతుంది!... పెరుగుతుంది! రుగుతుంది! పెరుగు పెరుగు అవును! అప్పుడింకా యెక్కువ పెరుగుకొనవచ్చు!......

..శ్రీమతి మణీ రామారావ్ డిప్యూటీ తాశీల్దారుగారి భార్య! తాశీల్దారుగా రబ్బాయిలు! ఓహో ఏం బావుందేం బావుంది!....'కనక మనం యీ రంగయ్యగాడి గురించి ఆ ఆఫీసరుగారితో పోట్లాడ కూడదు!' నేను కాకపోతే మరో మనిషి ఎల్లాగూ చేసేదానికి నా భవిష్యత్తును పాడు చేసుకోవడం దేనికి? 'కమాన్ రామం! కమప్ అండ్ డిసైడ్!' 'క్విక్! 'అరుణా నిన్ను నే, నొప్పించలేను!'...రంగయ్యా నీ తరఫున వకాలతు ప్వకోలేను! 'క్షమించు మంచి రంగయ్యా! నన్ను క్షమించు!'......

...'కమాన్ రామం! కళ్ళు మూసుకుని రాసిన కాగితం చించెయ్యి!' 'రమణయ్యగారికి పొలము దఖలు పరుచుటలో ఏవిధమైన అభ్యంతరమును లేదు!' రాసెయ్యి! రాసేయి తొందరగా! రండి ఆఫీసరుగారూ రండి! మీరు చెప్పినటు తు. చ తప్పకుండా రాస్తాను! మీరు చెప్పినట్టే రాస్తున్నాను సార్! పచ్చి నిజం! 'నన్ను నమ్మండి!'... ..

...'వెంకటయ్యా! ఆఫీసరుగారు రాగానే చెప్పు నాకు! ఈ లోపల వో కప్పు కాఫీ తెచ్చిపెట్టు!' ఈ రోజుకు నాకు భోజనప్రాప్తి లేదు! లంచ్ టైమ్ పూర్తయి గంటన్నరయింది! 'అభోజనం వున్న అభాజనుణ్ణి!' ఓహో ఆకలిమీద, ఏం చక్కని కవిత్వం వెలువడుతోంది! ఎవడా మూల నీళ్ళు నిండిన కళ్ళు తుడుచుకొంటున్నాడు? 'రంగయ్యా?' అవును రంగయ్యే! కాని అతని కన్నీళ్ళని నేను పోగొట్టలేనే! భగ. భగ...'భగవంతుడు చెయ్యాలా పని!' నేను నిమిత్తమాత్రుణ్ణి మాత్రమే! అయినా నే నొక్కణ్ణీ లోకం బాగు చేద్దామనుకోవడం వెర్రి కాదూ! అందులోనూ, అది నా మూలాన్ని ఆగవప్పుడు!...ఏం చెయ్యగలను? నేనూ కాసిని కన్నీళ్ళు విడుస్తాను రంగయ్య కోసం!... ..'అరుణా! అరుణ!' ఎంత చల్లనిమాట చెప్పావ్! డిప్యూటీ తాశీల్దార్ పదవి నాకే? నాకే! నాకేలే! . హబ్బ! కప్పు కాఫీ ఏం వుషారు కలిగిస్తోంది! వుషారా, హుషారా?

...'అల్లాగేలే! వెంకటయ్యా! నేనే అయ్యగారి దగ్గరకు వెళ్తున్నాను'...హమ్మమ్మ! లోపలికెళ్ళి రావడం సుడిగుండంలో దూకి బయటపడ్డట్టే! ఎప్పటికీ ఎప్పటికీ, లోపలకెళ్ళి బయటకు వచ్చేవరకూ, ఆలోచన తోచదుకద! ఆలోచిస్తూనే, ఆలోచనలు గుర్తులేక పోవడం ఎంత దురదృష్టం! అహ! అదృష్టమేనేమో! పోనిద్దూ ఏదయితేనేం! 'ఎంత మంచివాడు ఆఫీసరుగారు!' ఎంత పొగిడాడు నన్ను! తను చెప్పింది చేసానని ఏనుగెక్కినంత సంబరపడ్డాడు! ప్రమోషన్‌కి రికమెండ్ చేస్తున్నానన్నాడు! అరుణ తన క్లాస్‌మేట్‌నని ఫోన్ చేసిందట! అరుణంటే అతనికి ఎంత ప్రేమో! కనకనే అరుణ యిష్టపడిన నన్ను తనూ ఆదరించాడు. ఇన్నాళ్ళూ ఆయనలో మంచితనం ఎందుకు కనబడలేదబ్బా నాకు?

...'ఓరీ రామారావ మాధవా! నీ సంతోషము నకై రంగయ్య జీవితమును బలిపెడితివే!' ఎవడు వాడు? నీతిశాస్త్రంగాడు కాబోలు! కరవబోయినట్టు మీద పడుతున్నాడు!' ఏడిశావు లేవోయ్ బోడీ! ముందే చెప్పానా, యిది 'స్ట్రగుల్ ఫర్ ఎగ్జిస్టెన్స్'! చిన్న చేపని పెద్దచేప, పెద్దచేపని, ఇంకా పెద్దచేప, వాటిని మనుషులు మింగుతూనే వుంటారు! కనుక నా ఉజ్జ్వల భవిష్యత్తునకై, ఒక చిన్న, అతిచిన్న,

మానవునికి కాస్త హాని కలిగించిన తప్పు లేదు! అది యునంగాక '(క్రొత్తవారి వేషభాషలం జూచి మోస పోరాదు!' చదువుకోవలేదా నీతిచంద్రికలో చిన్నప్పుడు? రంగయ్య వేషం మాటలూ అలా వున్నా, వాడు వొట్టి దొంగవెధవే కావచ్చు! నా జాలి సంపాదించడానికి యీ వేషంవేసి వుండవచ్చు! ..'ఔనౌనౌను!' అంతే అంతే! ఈ పొలం పట్టుకుపోయి అమ్మేసుకుంటాడు! సారా త్రాగుతాడు! డబ్బును ముండలకి తగలేస్తాడు! మళ్లీ యిదే వేషంలో తయారవుతాడు! కనుక ముందునుంచీ యిదే వేషంలోనే వుండనీ! ఎవరికీ నష్టంలేదు! ఇంక వాగకు నీతిమిత్రవా! నా కాలేజీ రోజుల్లో క్లాస్సేవు 'లీజరు'గా తల్చుకోనీ! 'అరుణా!' అయ్యో! పైకంటున్నానా? నా కొలీగ్స్‌కి తెలిస్తే నా ప్రాణం తీస్తారు, వాళ్ల పనులు చేయించి పెట్టమని!

...అమ్మయ్య! అమ్మమ్మయ్య! అయ్యయ్యమ్మ! మెల్లిగా అయిదు గంటలు దాటింది. యీ రోజుకు దుకాణం. మూసేద్దాం!...' అయ్యో! 'ఆ రంగయ్య నా దగ్గరకే వస్తున్నాడే!...' నీకు 'ఫర్'గానే నోటు పెట్టాను, రంగయ్యా! ఆర్డర్లు తొందరలోనే వచ్చెయ్యొచ్చు! నీ వూరి కెళ్ళిపో! .. 'అమ్మ! వెళ్లి పోయాడు.' కాని నా లోపల యేదో రగడ జరుగు తోందే! 'రాస్కెల్! అబద్ధం ఎందుకు, నిజం చెప్ప లేక పోయావా? అంటున్నాడా నీతిగాడు! 'ఓయ్ నీతీ! నీమతి మండినట్టేవుంది! ఎల్లాగూ వాడికి ఆర్డర్స్ రాని దానికి, వాడి ఆశాలతను యిప్పటినుండీ త్రుంచట మెందుకు? ఇంటికివెళ్లిన కొన్ని రోజులకి యీ 'అశుభ'వార్తని తెలియవియ్యి! ఈ సంగతి యిప్పుడే చెప్పి అతని సంతోషాన్ని పాడుచేసే హక్కు నాకు లేదు!'...ఎందుకు వికటంగా నవ్వుతావు, నీతీ? ఏవుందోయ్ వెటకారానికి?...గిల్లి, బాధపడుతున్నాడని కొబ్బరినూనె రాయడంలా వుందా? 'ఏడిశావ్!' నీలాంటి వంతలో నీ తోటి మానవుడికి సుఖం కలిగించమని గాంధీగారితోపాటు బోల్డుమంది చెప్పడం చదువు కోలేదూ? 'నేను నా విధిని నిర్వర్తించినందులకే గెలిచేయునంటివికదా!' 'ఓ నీతీ! నువ్విలా అడ్డమైన దానికీ అడ్డంపడి నవ్వుతూంటేనే కలిపురుషుడు నిన్నీకాలంలో వొంటి కాలిపై బ్రతకమని శాసించాడు' నోరు మూసుకుని ఉన్నావో సరేసరి! లేకపోతే ఆ వొక్క కాలూ, కూడా పూడుతుంది! కాళ్ళు విరిగిన, కీళ్లు సడలిన నువ్వేమవుతావో నీకే తెలిసు కనుక నోరు మూసుకుని ఊరుకో!'...ఓహో! కవిత్వం ఉప్పొంగుతోందేమిటి, నాలోంచి! 'డి॥ తా॥ రామారావు, డి॥ తా॥ రామారావు! తాడి చెట్టెక్కాడు రామారావు! డి॥ తా॥ పదవనే తాడి నధిరోహించిన వీరాధివీరుడు రామారావు!' 'ఇంకా ప్రమోషన్ వచ్చి చావలేదు అప్పుడే పద్యాలు!' ఇంకేమీ పనిలేదీ కవిగాళ్లకి! జరగబోయేవాటికి, జరిగినవాటికి అన్ని విషయాలకీ పద్యాలు! ఏదేనా వొక విషయం జరగటం చాలు వీళ్ల 'కవితోద్భవం' జరగటానికి!... అబ్బ! ఎంత పెద్దమాట వాడాను! పద్యాలు. పదాలు... పదాలతో పద్యాలు! ఎవడి పాదాలో పట్టుకొంటూ, పదాలతో పద్యాలు! ష్! చాలు! చాలింక నీ కవితా పాటవం! అసలూ ఎవరూ గద్యాలు రాయరేం పద్యాలు తప్ప! గద్యం వందిమాగధులు పాడేవారనుకుంటూ, పాత కాలంలో రాజులకీ వాళ్లకీ! ఇప్పుడు పద్యాలు, కవులు వందిమాగధుల్లా రాస్తున్నారు! పాడుతున్నారు! ఉన్నారు! ఉన్నారు! అయినా 'మదీయవారు వంటిం'కను రాదేం? మది చింత నొందచున్నదే! మతి, శ్రీమతిపై కేగు చున్నది!......

...'రావయ్యా బాబూ! గాలికి పంపితే గంట కొచ్చావు! 'పేచీ' వేయిస్తున్నానని చెప్పవేమకో!' 'అయినా యింత ఆలస్యమా?'...పేచీ పెట్టుకు కూర్చున్నాడా, కొట్టువాడు ఎవడితోనో!...'బావుంది! బావుంది నీ 'పేచీ' 'పేచీ'!' ఇదిగో! యింకో అర్ధ రూపాయి తీసుకో! ఇకిలింపెందుకు! మిగిలింది యీసారి చూద్దాం!'......

......ఛల్, మోహావరంగా, నీకు నాకూ', వెధవ అలవాటు ప్రతి పనికీ తోడు సినిమాలు పాట వుండిలీరాలి కాబోలు! అయినా ఆఫీసునుంచి ఇంటికి యింత తొందరగా వచ్చేసేసేమిటి? ఆలోచనలలో

ప్రయాణించుచు మనోవేగమున, నేతెంచుచుంటినా? అయినా మనస్సుకు, బాహ్యపరిస్థితులకు హస్తిమశకాంతరము లేదా వేగమున?

'మణీ! ఓ సుగుణాలఖనీ! శారదామణీ! నీ భర్తామణిని చూడుము! ఎట్లుండెనో పరికించుము!'

'అబ్బ! ఎంతకీ వూడిపడదేం! మధ్యాహ్నం యింటికి రాలేదని అలకాగృహ పరిపాలన చెయ్యటం లేదుకదా' గావు కేకలు కావివి, భామామణీ! సంతోషపు భీకర నాదాలు! 'నీ భర్త తొందరలోనే డి॥ తా॥ అయిపోవును!...'ఛ ఛ! నీ యింగ్లీషు పరిజ్ఞానం ఏడిసినట్టే వుంది! డి॥ తా॥ అంటే 'డెత్' కాదు 'డిప్యూటీ తాశీల్దారు! నమ్మవా నా మాట వెలదిరో!'...రామ రామ! ఈ ఆడవాళ్లెప్పుడూ యింతే! భర్తే మనం చెప్పింది వెంటనే నమ్మరు! ప్రక్కవాళ్లు చెబితే అర క్షణంలో నమ్ముతారు! మళ్లీ దాన్ని కాదని ప్రూవ్ చెయ్యటానికి మన తాతలు దిగిరావాలి 'హా! నిజంగానే యీసారి డిప్యూటీ అవుతున్నా! చూసుకో నా తడాఖా! ఏం లేకపోతే ఎందుకు మధ్యాహ్నాలు తిండి గూడా మానేసి పని చేస్తున్నాము? ప్రభుత్వంవారంత కృతఘ్నులనుకొన్నావా? లోపలికి నడు!...

## భాగం 5

...అబ్బబ్బ! ఈ రోజు యెంత శ్రమపడ్డాను. శ్రమ శ్రమ! మశ్రమ! పడ్డాను! పడ్డాను! అదృష్టం కాకపోతే, అవునూ 'వాణిశ్రీ' యెక్కడో జవాబుల్లో శ్రమకితోడు అదృష్టం కూడా కలిసొచ్చి యింత దాన్నయ్యాను అందికదూ! మరి మనం రేపు డిప్యూటీ అయితే ఎవడూ ఆ సంగతి మనని ప్రశ్నించడా? నేను జవాబుల్లో ఆ సంగతి చెప్పే మార్గం లేదే! నేను ఏ సినిమా స్టారునూ కానప్పుడు, నన్నెవడూ ఎందుకడుగుతాడా ప్రశ్న? అయినా వాళ్లకి మన జవాబులు కావాలా?...అప్పులో పేరు చూసుకోవా

లనేనాపిచ్చి! అంతే! అంతే!.. ఇంతకీ గాడితప్పా! ఆ... అదృష్టం కాకపోతే ఆపీసరుగారి నలిమణి నన్నేల ఎరుగ వలెను? ఎరిగెనుబో నాపై అప్యాయత నేల చూప వలెను! చూపెనుబో ప్రమోష నిప్పిస్తానని ప్రామిస్ నేలచేయవలెను?..... హా! అవవయ్యా బాబూ! ఈ 'బో' వాక్యాలతో రోజంతా బోర్‌కొట్టేలా వున్నావు ఈ! అది నా భాగ్యం! అంతే! 'సిరిదావచ్చిన వచ్చును నలలితముగ నారికేళ నలిలము భంగిన్!' అంతే అంతే! 'ఓయ్ మణికుమారీ! నీ ప్రాణేశునకు కొంచెము కాఫీ దాహమిమ్ము!' 'మధ్యాహ్నము యింటికి రాలేదని క్రోపమేలనే భామా! నేను నీ వాడను, కానా? నన్నేరి కోరి నువ్వు చేపట్టలేదా?' 'ఔరా ఎంతమాటంది'' 'చేపట్టేలేను, కాలిపట్టీ లేదు' అందా!' కాలికి క్రొత్త మోడలు పట్టాలు కొనలేదనేకదా ఆ కోపం! 'హా! డిప్యూటీ తాశీల్దారు కాగానే వెదవది! వొక్క కాలికే యేమిటి వంటినిండా పట్టనన్ని పట్టాలు చేయించనా' 'ఒట్టినే కోపపడబోకు మోయింతీ! నీపతి తొందరలోనే డిప్యూటీ తాశీల్దారు కాబోవుచున్నాడు. అప్పుడు పట్టాల తప్పక కొంటాడు'...ఆయ్! అయ్! నీ పతి దేవునే ధిక్కరించుచుంటివా? 'మన మొహా లకు అదొక్కటే తక్కువా' అంటున్నావా? పైగా నవ్వుకూడనా?'...అమ్మ ఎంత మాటందిరా బాబూ! ఈ ఆడవాళ్ళ మాటల యీటెలు, విసరటంలో నిజంగా శక్తి స్వరూపిణిలే! చెలం చెప్పినట్టు మొగవాడు సుఖపడాలన్నా, దుఃఖపడాలన్నా కీలకం స్త్రీలోనే వుంది! అరుణకీ యీమెకీ ఎంత తేడాయో! ఎప్పుడూ నవ్వటం, నవ్వించటం అరుణ సహజ స్వభావ మైతే, ఎప్పుడేనా నవ్వటం యీావిడ సహజ స్వభావం' మొదట్లో యిలా వుండేదికాదు సుమా! నా అడుగు లకు మడుగులొత్తుతూ, అనుక్షణం నా అజ కను క్కుంటూ, క్షణం విడువకుండా వెంట తిరిగేది! పిల్లలు పుట్టినప్పటినుండి 'చిరుబురు లేమనకిగతి! వినరామయ్యా!'......

ఎవడో, ఎక్కడో రాయనే రాసాడు పిల్లలు పుట్టేవరకూ భర్తమీద, ఆ తరవాత పిల్లల మీదకు స్త్రీల ప్రేమ ఆటోమాటిక్‌గా మారిపోతుం దట! అందరి విషయంలోనూ యింతేనా? కాదేమో! అరుణ పిల్లలున్నా భర్తతో ఎంతో ప్రేమగా వుంటుందే! రోజుకి నాలుగుసార్లేనా శ్రీవారికి ఫోన్ చేస్తేనే కాని ఆమెకు తోచదే! 'కనుక అరుణ మామూలు మానిసి కాదు!' 'కాదోయ్! వెర్రి రామా రావ్! మామూలు మనిషే అయితే తన భర్త దగ్గర పని చేస్తున్నందుకు నిన్నో పురుగులా చూసి వుండేది!'...ఆమె దేవత కనకనే, పదేళ్ల క్రిందటి కాలేజీ పరిచయాన్ని, స్నేహాన్ని, మరిచిపోక వాళ్ల నాన్నగారితో చెప్పి నీకు ప్రమోషనుకి రికమెండ్ చేయిస్తానంది!...'నిజం! నిజం! నా మనసా నీవన్నది నిజం నిజం!' అరుణదేవత! అరుణదేవత! దేవత అరుణ 'నా అరుణాదేవి!' 'హా! ఆ నాటకాల డైలా గులు చాలు కానీ నా ఆకలి సంగతి చూస్తావా అంటున్నాడు ఆకలిగాడు' 'వస్తున్నా వొస్తున్నా నయ్యా! నీ సంగతి చూడ్డానికే వస్తున్నా!' 'పాపం ప్రొద్దున్నే కాఫీ పొడుం అయిపోయిందని చెప్పిందా మణి? ఇప్పుడు నేను కాఫీపొడుం లేకపోయినా తను కాఫీ తెచ్చియిచ్చింది!' నా ఆలోచన గ్రహించి నవ్వు తోంది! ఎంత గ్రేస్‌ఫుల్‌గా, నా తప్పుల్ని క్షమిస్తుంది! నవ్వితే మణి ఎంతో బావుంటుంది! కాని యింట్లో నవ్వడం తగ్గించుకుంది...ఎందుకని? 'నారీ లోకం' పత్రిక ఎడిటర్ కదా! మరి గంభీర స్వభావం తెచ్చి పెట్టుకోకపోతే ఎలా? అందుకని 'నవ్వులన్నీ, మేగ జైను చందాదారులకీ, పేట్రన్స్‌కీ!'......'విసుగూ చిరాకూ, మనకి!' 'లేడీ ఎడిటర్'గారు యిలా చేస్తు న్నారు. సరే! పురుష పుంగవులూ యింతేనా? 'ఏమో! ఇది స్త్రీలు చెప్పవలసిన విషయం! మనకు తెలియదు కనుక నోరు మూసుకోవటం మంచిది!' ..

...ఎన్ని కాఫీ ఎడ్వర్‌టైజ్‌మెంట్లు చదివినా వొక కాఫీ పొడానికి యింకోదానికి తేడా తెలీదు నాకు, కాఫీ త్రాగేటప్పుడు! నాకేనా అందరికీ యింతేనా? ఏమో ఎవరి సంగతో ఎవరి కెరుక?

...ఓయ్! ఓయ్! వచ్చే వచ్చే! ఇప్పుడే వస్తున్నా బాత్‌రూములోకి! లైఫ్‌బోయ్ కొనుక్కొస్తే

లైఫ్‌బాయ్‌తో స్నానం మీ ప్రాణానికి యెంతో... 'ఏదో వుండాలి డాక్యుమెంటరీలో బొంగురు గొంతుక పాట! అలా నటించటానికి ఆ కుర్రాడూ. పెద్దతను ఏం తీసుకున్నారో! అది లైఫ్ 'బోయ్'కదా! అంటే ప్రాణాన్ని రక్షించేది కనుక ప్రాణం అపాయంలోవున్న వాళ్ళు వాడాలి దాన్ని! మరయితే నేనెందుకు కొనాలను కున్నానుముందు? ఏమో!......

ఇదిగో, యీ మైసూరు శాండల్‌సోపును చూడండి! చక్కటి, చిక్కటి, చందన సువాసన! ప్రపంచంలోకంతటికీ అతిమంచి చందనం మైసూరులో మాత్రమే లభిస్తుంది. ఆ చందనం నూనెతో చేయబడిన అత్యంత సుందరమైన సబ్బు! దీన్ని నేడే కొనండి! నేడే! నేడే!' ఈ అడ్వర్‌టైజ్‌మెంట్ చూడగానే వట్టుకొచ్చానీ సబ్బును! తీరాచూస్తే మా శ్రీమతీ వో సబ్బు తెచ్చింది! ఈ వొక్క సబ్బు మాత్రం అడ్వర్‌టైజమెంటుకు న్యాయం చేస్తోన్న ట్టుంది! ఒక ప్రభుత్వ ఫాక్టరీ తయారుచేసిన సబ్బు యింత ప్రఖ్యాతి పొందటం, అందులోనూ నిత్యావసర వస్తువుల విషయమున, యీ భారత దేశంలో యెంత వింత! ఇది మిగిలిన ప్రభుత్వ పరిశ్రమలకెల్ల ఆదర్శప్రాయమై వానినికూడ యీ విధముగ నడిపించునుగాక! అందుచే భారతదేశము పరిశ్రమల రంగమున ప్రపంచ ప్రఖ్యాతి పొందునుగాక!

'అల్లాగే! అల్లాగేమణీ! క్షణంలో వచ్చేస్తున్నా!' వెధవటవలు, మరీ గరుకుగా వుంది! మంచి టర్కీటవలొకటి కొనాలి!' 'మెత్తగా వొంటిని హత్తుకుని సేదతీర్చే అచ్చమైన 'బిన్నీటర్కీటవల్స్'నే వాడండి!' వాడదాం! వాడదాం! 'వాడతాను సార్! డి. తా. ని కానివ్వండి. టర్కీ టవల్సు మాత్రమే యేమిటి, టర్కీ దుప్పట్లే వాడుతా! వాడుతా...తా!'

...అమ్మయ్య! అద్దం ముందు అలంకరణ తెమిల్చి యిప్పటికి కదా భోజనానికొచ్చాను! మణి అరగంటనుంచి గంట వాయించినట్టు గొడవ పెడుతున్నా యింత ఆలస్య మెందుకైంది?...ఏవుంది! హావభావాలు ప్రాక్టీసు చేస్తూంటే ఆలస్యమైంది!... 'హహహా!' ఎవరిదీ వికటాట్టహాసము? 'ఎందుకురా రాక్షసాధమా ఆ నవ్వు? నాలోనే వుండి నన్నెదిరించు సాహసమా? 'సాహస విక్రమార్కుడి తమ్ముణ్ణిరా నేను!' 'నీ పీచ మడంచెదను!'.. ఏవిటి! 'ఆలు లేదు చూలు లేదు, కొడుకు పేరు సోమలింగం' అంటున్నావా? 'హహహ!'...వెర్రి వెధవా! అజ్ఞానరావూ! నాకు 'ఆలు' వుందిరా! ఆ ఆలుకు 'చూలూ' వుంది! నాలుగో నెల అని మరిచావురా గాడిదా! పోతే యింక నా కొడుకు పేరు అంటావా? మావాడి పేరు సోమలింగం కాదు! సోమసుందరం! ఇంకోడు పుట్టగానే సోమలింగం' అని పేరుపెట్టి నీ కోరిక తీర్చి, సామెత నాకు వర్తించదని రుజువు చేస్తాను! కనుక యీపాటికి నీ అతితెలివి చాలించి వ్యంగోక్తులు కట్టిపెట్టి, నోరు మూసుకు పడుకో!' 'హహహ' వెధవని దెబ్బతో చిత్తు చేసేసా!...హహహ! 'అబ్బే ఏంలేదు మణీ! వూరికే నవ్వా! పిల్లలు భోంచేసి పడుకున్నారా! మంచిపని చేసారు! నువ్వు కూడా తొందరగా భోంచెయ్యి! కాసేపు సరదాగా కబుర్లు చెప్పుకుందాం! ఎన్నాళ్ళైంది మనిద్దరం యిలా వొంటరిగా కూర్చొని!

...అబ్బో! మణి ఎంత ముద్దుగా వుంది! ఎందుకో ముసి ముసి నవ్వులు నవ్వుతోంది. ఈమె నవ్వు మొహం చూస్తోంటే అరుణ గుర్తొస్తోంది! ప్రియునివద్ద......' మణికి నేనిప్పుడు ప్రియుడిగా కనిపిస్తున్నానా, వొట్టి మొగుడుగా మారిపోయానా? ప్రియుణి కాకపోతే యీ వంటింట్లో సిగ్గుల మొగ్గలు ఎందుకు పెడుతుంది?...అవునూ! అరుణ సంగతి యీమెకి చెప్పనా?...'ఒద్దొద్దురోయ్ రామారావ్! అనవసరంగా ఆమె మూడ్ చెడగొట్టకు! స్త్రీ దగ్గర, ఆమె గురించితప్ప యింకోళ్ల గురించి, ఆమె మంచి మూడ్‌లో వుండగా చెప్పావో, నీ పని గోవిందా! నీకిప్పుడు మూడిందన్న మాటే ప్రస్తుతానికి నోరు మూసుకుని 'సెయిల్ ఎలాంగ్ విత్‌హెర్!' కొంచెం పొగడ్తకానీ!'

'మణీ! నా హృదయరమణీ! పదేండ్లుగా నన్ను పరిపాలిస్తున్న సుగుణాలఖని! నీకీ రోజున యీ దీనుడిపై యింత అకారణ అనుగ్రహము కలుగుటకు, కతంబేమి?'.. 'ఓహో! అల్లాగా! గుడ్ న్యూస్! కంగ్రాచ్యులేషన్స్! 'నేనూ—మావారూ' అన్న నీ వ్యాసానికి పోటీల్లో ఫస్ట్ ప్రైజొచ్చిందా? 'అయిదు వందల రూపాయలే!' అబ్బో! శహభాష్! నీకు పరమ సంతోషంగా వుంది! నేను కవిని; కథకుణ్ణి కాలేక పోయినా, నువ్వు రచనా వ్యాసంగంలో పురోగమించడం నాకు విపరీతమైన గర్వంగా వుంది! (నిజంగా వుందిరా, రామారావ్! జెలసీలేమా 'ఛ నోరు ముయ్యరా లోని మనిషీ! 'ఒట్టి 'సినిక్'గా తయారవుతున్నావీమధ్య! నన్నే నమ్మలేవా?) 'నీవు నా అర్థభాగానివి మణీ! నీకువచ్చిన గౌరవంలో సగం నాదీను! అందులో వ్యాసానికి టైటిల్ కూడా ఏం పెట్టావ్! 'నేనూ—మా వారూ..! ఒహో! అందులోకూడా అర్థభాగం నేను! అందుచేత...'నర్థకు! అబ్బే! అబ్బే! నీ ప్రైజులో అర్థభాగం నా కొద్దులే!' నీ అభీష్టాను సారమే ఆ సొమ్ము ఖర్చు కానిమ్ము!...'కొంచెం కొబ్బరికాయ పచ్చడి వెయ్యనా? నవ్వకు మరి! నీకు సాయం చెయ్యటం భర్తగా నా విధి!'...'ఇన్నాళ్లూ అది మరిచిపోయేరే అంటున్నావా? 'ఊహల గాలి మేడల్లో, ఆకాశపు టంచులపై విహరించే నాకు, నేలపై ఆధారం నువ్వే కదా మణీ!'...'మణీ! నేను చాలా అదృష్టవంతుణ్ణి తెలుసా! ప్రపంచంలో అరుదుగా లభించే (ఒరేయ్ రామారావ్! అరుణ సంగతి చెప్పొద్దన్నానా! చంపేస్తాను!) అబ్బే ఏంలేదు! అల్లాంటి భార్యామణివి లభించావు నాకు! ఈ మధ్య బాగుపడ్డం కూడా నేర్చుకుంటున్నా. ఆపలేని అన్యాయాలకై బాధ పడటం మానేస్తున్నా! 'స్ట్రగుల్ ఫర్ ఎగ్జిస్టెన్స్' అక్షరాలా పాటిస్తున్నా!...'కంచాలన్నా వదిలేద్దూ! రేప్పొద్దున్నే కడుక్కోవచ్చు! కమాన్ డార్లింగ్! ఓ గంట సరదాగా కబుర్లు చెప్పుకుందాం!'

...మణి ఎంత కులాసాగా కబుర్లు చెబుతోంది! నేను వినటంలేదేమో అన్న అనుమానం కూడా లేదే! 'పూర్ మణీ!' 'వెర్రి రామం! మణి యిప్పుడు 'పూర్' కాదోయ్! అయిదు వందల కధిపతి! నీ 'ఫెస్టివల్ అడ్వాన్స్', 'సరెండర్ లీవ్ శాలరీ' కలిసినా అంత రాదు!'...అయినా, 'సంతోషానికి' కారణం యేమిటో! మన కోరికలలో కొన్ని తీరటమేనా?.. ఇంకా చాలా తీరకుండా ఉండిపోతున్నాయిగా? వాటికోసం యేడవటం లేదేం? 'తీరగలిగినవికూడా. తీరకపోతేనే, ఏడుస్తాంలా వుంది!' తీరనివి ఎల్లాగూ తీరవని తెలిసి ఊరుకొంటాంలా వుంది! అంతేనేమో...'ఊ! ఊ! వింటున్నా మణీ! అబ్బ! రాయటానికి చాలా కష్టపడ్డావన్న మాట!'...కష్టం! కష్టం! రంగయ్యకి నేను కలిగించిన కష్టం, నష్టం ఎలా తీరతాయి? రంగయ్యకి అలా చెయ్యకపోతే నాకు కలిగే నష్టాలు, కష్టాలు ఎవడు తీరుస్తాడు?.. అవునూ, కష్టాలు మన పరిస్థితుల్నిబట్టి మారుతాయా? ప్రమోషన్ వొస్తుందన్నాక రాకపోతే కష్టం! అసలు ప్రమోషనే లేదంటే కష్టమే లేదుగదా అప్పుడు...' అయితే మన చుట్టూవున్న పరిస్థితుల్నిబట్టీ, మన అనుభవాల్నిబట్టీ మన మనసులో భావాలు మారుతూ వుంటాయా?' అయితే కష్టానికి సుఖానికీ కొలత బద్దయేది? వాటిని నిర్వచించటానికి సూత్రం యేది? ఏమో! ఏదేనా పత్రికకు రాసి కనుక్కోవాలి. ఎవరో వొక మహిళా మణి జవాబీయకపోదు... రంగయ్యా.. ప్చ్! పాపం రంగయ్య!...' నన్ను క్షమించు రంగయ్యా! నీ బ్రతుకు బాగుచెయ్యబోయి నా బ్రతుకు పాడు చేసుకోలేను!'.. ...

'అహహా! బాగా చెప్పావ్ మణీ! వండర్‌ఫుల్.

(అయిపోయింది)

---

# సంశోధిత మహాభారతము - శాంతి పర్వము

శ్రీ నిడుదవోలు వేంకటరావు

'ఒరులేవియు నొనరించిన
నరవర యప్రియము దన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మ పథముల కెల్లన్.'

ఇప్పటి కరువదియారేండ్ల క్రిందట (1908) కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రపత్రిక వార పత్రికగా ప్రారంభించుచు పై పద్యమును సూచీ వాక్యముగా గ్రహించినారు. ఆంధ్ర పత్రిక దిన పత్రికయైన నాటనుండి నేటికిని, యీ పద్యము- ఆంధ్రపత్రిక నలంకరించుచునే యున్నది

ఈ పద్యము మహాభారతము, శాంతిపర్వమున పంచమాశ్వాసమున 220 పద్యముగా నున్నది.

శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు పై పద్యమును తెలుగు భారతమునుండి గ్రహించుటలో నెంతయో గంభీరార్థ మున్నది. ఆంధ్రపత్రిక, కేవలము, రాజకీయ వార్తలకే సంబంధించిన పత్రిక కావని, అది ఆంధ్రభాషా సారస్వతములకు, సాంఘిక వ్యవస్థకు కూడ సంబంధించిన పత్రిక యని లోకమునకు వెల్లడించుటకే సూచీ పద్యముగా దీనిని గ్రహించినారు. అంతే కాదు. భారతమునుండి గ్రహించుటలో—ఆంధ్ర పత్రిక ఆంధ్రుల కొఱకు ప్రత్యేక పత్రికయైనను— అది యావద్భారత మత సాహిత్య సంస్కృతులతో నవినాభావ సంబంధము గలదియన్న జాతీయ సమైక్యతా భావమును వ్యక్తమగుచున్నది.

పై పద్యము—ఆంధ్ర మహాభారతము శాంతి పర్వము-5 వ ఆశ్వాసమున 220 పద్యముగా నున్నది. అట్టి శాంతిపర్వ—సంశోధిత ముద్రణమునకు సంబంధించినదే యీ సమీక్ష—

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ప్రకటించుచున్న సంశోధిత మహాభారత ముద్రణమున[I] –6 వదియగు నీ శాంతిపర్వము. తాళపత్ర మాతృకలనుండి, పాఠ భేదములతో—పూర్వ సంపుటములవలె ముద్రితమైనది. పాఠభేద ప్రదర్శనమే కాక సంస్కృత మూలముతో పాఠములు నప్పటచ్చట చర్చింపబడినది. విషయ సూచికయందును, మూలమున అధ్యాయ శ్లోక సంఖ్య యీయబడి యుండుటచేత—శాంతిపర్వము సంప్రదాయ రీతిని వ్యాసంగము చేయుట కెంతయు నివి యుపయుక్తము లగుచున్నవి.

ఈ సంపుటమునకు—సంపాదకులగు శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు వ్రాసిన 33 పుటల పీఠిక గలదు. దీనితో శ్రీ వైష్ణవమతము—మహాభారతము— అను 35 పుటల విషయము శ్రీ చెలమచెర్ల రంగా

---

I ఆదిసభా పర్వములు—ఆరణ్యపర్వము – అను మొదటి రెండు సంపుటములు భారతిలో సమీక్షితములైనవి.

1. భారతి జూలై—ఆగస్టు—1972. వేదము వేంకటరాయశాస్త్రి.

2. ,, నవంబరు 1972. నిడుదవోలు వేంకటరావు.

చార్యులుగారిది గలదు. రంగాచార్యులుగారు దీనిని 12- 2—51 నాడు రచించినట్లిందు గలదు. ఈ గ్రంథము 1972 వ సంవత్సరమున వెలువడినది. శ్రీ రంగాచార్యులుగారు ఇరువదేండ్ల క్రిందట వ్రాసిన యీ వ్యాసము. బహుశః ఇందు ప్రకటితమై యుండును. వీ రిటీవల కీర్తిశేషులు.

మహాభారతము ఒక్క వైష్ణవ మతమునే గాక, శైవ మతమునుగూర్చి—ప్రపంచించినదని ప్రాచీన సంప్రదాయ పండితుల యభిప్రాయము. శైవ మతమును గూర్చియే హెచ్చుగా నున్నదని శైవ పండితుల యభిప్రాయము.II

శాంతిపర్వము మూలమును పరిశీలించిన శివ ప్రాధాన్యము కన్పట్టును. తిక్కన హరిహర తత్త్వమును ప్రపంచించినవాడు గావున—నీ గ్రంథ పీఠికలలో 'శైవము—మహాభారతము' అన్న విషయము కూడ నుండిన నెంతయో సమీచీనముగా నుండెడిది.

మూలకథావస్తు విషయమునవే గాక, శాంతి పర్వమున తిక్కన ప్రదర్శించిన కవితారీతి గాని, భాషా వ్యాకరణ ఛందోవిశేషములు గాని—ఈ గ్రంథ పీఠికలలో లేకుండుట—వింత చక్కటి సంశోధిత ముద్రణమున కొక కొఱత నాపాదించిన దనుటకు చింతిల్లుచున్నాను. అంతేకాక, శాంతిపర్వమున తిక్కన వ్యక్తిత్వమెట్టిదో నిరూపితము కాలేదు—మహాభారతము.

విరాట పర్వమున—కవి తిక్కన
ఉద్యోగ పర్వమున—మంత్రి తిక్కన
యుద్ధ పంచకమున—దండనాథుడు తిక్కన
శాంతిత్రయమున
స్త్రీ పర్వ, శాంతి పర్వ, అను శాసన పర్వములకు శాంతిత్రయము—అని పేరు } కర్మయోగి తిక్కన
అంత్య పంచకమున జ్ఞానయోగి తిక్కన

అని తిక్కనమూర్తి మత్త్వము, పంచ ముఖములుగా భాసిల్లినది. ఈ దృష్టితో తిక్కన కవితా విమర్శన గావించుట యావశ్యకము.[3]

సంపాదకు లెంతయో శ్రద్ధతో నీ శాంతి పర్వమును పరిష్కరించి, ప్రకటించినారన్నచో, నందు సందేహమున కవకాశము లేదు. అయినను—గ్రంథమున గణయతిప్రాస ముద్రాస్ఖాలిత్యములు కూడ కన్పట్టుచున్నవి. ఇది కర్తవ్యమైన సమీక్షగాన వానిని చూపుచున్నాను.

## యతిభంగములు

| | సంశోధిత ముద్రణము | పూర్వ ముద్రణము (ఆనంద) |
|---|---|---|
| 2—223 | ఉ. 'దుర్మాన విదూరుఁడై వరఁగఁ బావ్రుఁడు | వరఁగఁ బ్రావ్రుఁడు |
| 3—167 | చ. వడఁబడి యీనివాని నెడ నుల్లమునందు | ఒడఁబడి యీనివానినెడ నుల్లమునందు |
| 3—222 | చ. సంకులముగ నేగుదెంచి పరిఘుండురి నుగ్గగు | సంకులముగ నేగుదెంచి పరిఘుండురి నుగ్గగు. |
| 4—345 | క. ప్రయమగు టెఱుఁగడు వితత జనా వ్యాధులచేన్ | ప్రయమగు టెఱుఁగడు వితత జరా వ్యాధులచేన్ |

II శివతత్త్వ ప్రకాశిక—సంపుటము—4, 5, 6 సంపుటములు 1954-55, 56.

3. నా తెలుగు కవుల చరిత్ర—ద్వితీయ సంపుటము—తిక్కన ఎఱ్ఱనల యుగము—అను గ్రంథమున పై విషయము విపులముగా చర్చింపబడినది. అది అముద్రితము—హరిహర తత్త్వమును గూర్చి అందు నూతన విషయము లెన్నోగలవు.

5—525 ఆ. అరయు మేలవంగ మంచిత జ్ఞానంబు — అరయుమేలవంగ నంచిత జ్ఞానంబు

6—602 క. వరుఁ డంతటికంటె గలదె యుగ్రిమవర్ణా — వరుడంతటికంటె గలదె యుగ్రిమవర్ణా

ఈ క్రింది పద్యమున యతిభంగము, గణభంగము రెండును గలవు.

6—426 క. ... కా — క. ... కా

వునఁ గేశవాభిధానం గొనియాడు — వునఁ గేశవాభిధానంబువఁ గొనియాడు

దురు వనుఁ ప్రబుద్ధజనంబుల్ — దురు నమఁ ప్రబుద్ధజనంబుల్.

## వ—బ యతి

3-182 గీ. బాధగావించి కుడిచి శవంబు దొలుచు

తిక్కనలో వ—బ యతి లేదు.

బాధ గావించి కుడిచి సబంబు దొలుచు

అని తిక్కన ప్రయోగముండును.

## ప్రాసభంగములు

క. ఈ తెరువునఁ జరియించుచు
నే తెఱఁగున్నైనఁ దప్పనేనియుఁ బురుషుం
డాతత నాక సుఖమునఁ
దోఁతెంచును మగుడ సద్బుధుల వంశమునన్.
5.627

ఈ పద్యమున ఖండా ఖండ ప్రాసగలదు. తిక్కన ఖండా ఖండ ప్రాసవేయలేదు—'తోఁతెంచు'లో అరసున్నలేదు.

తిక్కన కర్ణపర్వమున 'తోతెంచు' నిర్బిందుకముగా వాడియున్నాడు—

క. కేతన కపి భయదంబై
తోతేరఁగఁ జక్రధర చతురసారథ్య
ద్యోతిత వల్గనచారు
శ్వేతహరులు మెఱయ— వచ్చు పీరుని గంటే.
(3.174)

ఇతర కవులును తోతెంచు నిర్బిందుకముగానే వాడినారు.

ద్వి. సీత నీపురికిఁ దెచ్చిన నాఁటనుండి
తోతెంచు చున్నవి దుర్నిమిత్తములు.
రం. యు. 480.పా.
రంగనాథ రామాయణము

క. చూతమది యేమి క్రొత్తయొ
కో తామిట యువతి సమితి కోలాహలముల్
తోతెంచె నంచు భూపతి
చూత లతా గృహము వెడలి చూడం జూడన్.
రాజ. చ. 2.168.
రాజవాహన చరిత్ర

## ఖండా ఖండ ప్రాస

### అగు—ఎనఁగు

క. బిగువెడలక విడిచి పడున్
పగములు వే తన చయంబు వ్రమంబై పె
ల్లగు మా వేగము గడపి యె
నఁగుఁబూర్వస్థితిన బ్రదుకు సమకూరంగన్
3—88

పుట యడుగున. ఎనగొను పురాస్థితి. సీ. స. అనికలదు.

ఇచట తిక్కన ఖండా ఖండప్రాస ప్రయోగము చేసినటు చూపబడి యున్నదిగాని—అది సరికాదు. 'ఎనఁగు' శబ్దములో అరసున్నలేదు—

'ఎనఁగు'నకు, ఎనవి అని రూపాంతరమ్మున్నది గాన, ఎనఁగులో అరసున్నలేదు—

'ద్వి. భువి 'శివనిర్మాల భూత' యనంగ నె
నవి సుధా కరకరా సార ప్రసార—''

అని పండితా. దీక్షా 75 పుటలో గలదు.

పై పాఠమువలన-ఏనుగులో అరసున్నలేదు.

రాఘవ పాండవీయమున నీక్రింది ప్రయోగము 'ఏనఁగు'లో అరసున్నలేదని నిర్ధారణ చేయును.

ఒప్పెనగ రూఢానక్తి ఆ. 26 వ.

ఇచ్చట—ఒప్పెనగ—అని భారతార్థమున పదచ్ఛేదము.

ఒప్పెనగ రూఢాసక్తి=రామాయణార్థము.

రామాయణార్థమున నగరుడు—గలడు—అది సంస్కృత పదము—అరసున్నలేదు—[4]

## సంయుక్తాక్షర ప్రాస 'త్ర్త' ప్రాస

ఈ గ్రంథ పరిష్కరణమున — పై ప్రాస యస్తవ్యస్తముగా నున్నది—కొన్ని శబ్దములు ద్విత్వ త కారముతో నొకచోటను, ఆ శబ్దములే తిరిగి ఏక త కారముతోడను ముద్రింపబడినవి.

పుత్ర శబ్దము—

| | |
|---|---|
| 2–45– | క్షత్ర— |
| | పుత్రు |
| | శత్రు |
| | మాత్ర— |
| 6–427 | క్షత్ర |
| | కళత్త్రాణ |
| | పుత్త్రా |
| | చిత్త్ర |
| మిత్ర శబ్దము— | మిత్రు |
| | పుత్రు |
| | మైత్రి |
| | పాత్ర— |
| 5–526 | మిత్త్రుం—ఆ |
| | ముత్త్రిక |
| | మిత్త్ర— |
| | మిత్త్రు. |

క్షత్ర. పుత్త్ర, మిత్త్ర — శబ్దములలో సంస్కృత భాషా వ్యుత్పత్తుల ననుసరించి. ద్విత్వ తకారమున్నను, తెలుగున—ప్రాస— ఏకాక్షరముగా నున్న వలయునన్న సంప్రదాయముననుసరించి నన్నయాది మహాకవులు — వానిని తెనుగున-ద్విత్వ'త్త్ర'ప్రాసను, 'త్ర'యని ఏక తకారముగా వాడియున్నారు. తెలుగు నిఘంటువులలో శబ్దరత్నాకరమున — నీ శబ్దములు ఏకతకారముతోనే యున్నవి-ప్రాస శబ్దాలంకార మైన ప్పుడు—ఒక్కచో ద్విత్వ తకారమునకు — మఱియొకచో ఏక తకారమునకు ప్రాసకుదురనే కుదురదు—మహాభారత సంశోధిత ముద్రణమున-నన్నయ భారత భాగమున 'త్ర' ప్రాసలన్నియు విశేషించి 'త్త్ర'గా, విలక్షణముగా ముద్రితమైనవి-ఈ ప్రాసలన్నింటిని గూర్చి నేను కూలంకషముగా చర్చించి ఏక 'త్ర' కార ప్రాస నిర్ధారణ చేసియున్నాను.[5]

ఈ సందర్భమున నీ'త్త్ర' ప్రాస 1–207, 2–45, 3–485. 4–374, 5-102, 5–207, 5–526, 6–427 అను 8 చోట్ల గలదు—అన్నియెడల ప్రాస భంగమైనది— ముఖ్యముగా పై 6–427 లో చూడుడు.

క్షత్త్ర,
కళత్త్రాణ
పుత్త్రా—
చిత్త్ర—

ఇచట 'చిత్ర' శబ్దము 'చిత్త్ర'గా ద్విత్వ తకారముతో ముద్రితమగుట చిత్రము! చిత్ర శబ్దములో ద్విత్వతకారము లేనేలేదు— "చిత్రయతీతి చిత్రం— చిత్ర చిత్ర కరణే ఆశ్చర్యమును జేయునది—విస్మయోఽద్భుత మాశ్చర్యం చిత్రమపి" అమరః —త్రాణ శబ్దములో ద్విత్వ తకారములేదు.

"త్రాయతేస్మత్రాతం—త్రాణం—రక్షించునది" అమరము.

---

4. చూ. శబ్దరత్నాకరము—సవరణలు, వివరణలు—826 పుట—

5. అక్షరార్చన— డాక్టరు పాటిబండ మాధవ శర్మగారి షష్టిపూర్తి మహోత్సవ సంచిక—"నన్నయ యతి ప్రాసలు" అను వ్యాసము. ఇందు శబ్ద వ్యుత్పత్తులే గాక—సంస్కృత వ్యాకరణ సూత్రములును ప్రదర్శింప బడినవి.

## త్త్య ప్రాస

ఇట్లే—ఏక తకార యకారములతో నుండవలసిన శబ్దములను ప్రాసలో, ఏక తకార, యకారములు ద్విత్వ తకార యకారములతో ముద్రింపబడిన కతన ప్రాస భంగమైనది—

3–448 దైత్త్యుల......సౌ
గత్త్యము ఔ
దాత్త్యము సు
ప్రీత్త్యభి—

అని ప్రాస భంగముగా ముద్రితము—సాంగత్య—ఔదాత్య—ప్రీత్య, శబ్దములలో ద్విత్వ తకారములేదు—తిక్కనయే సాంగత్య శబ్దమును, ఏకతకారముతోడ ప్రాసలో వాడినాడు—

'జాత్యనుగామి యొప్పు యువ సంస్కృత
మెయ్యెడఁ జొప్పవాక్య సాం
గత్యము—సేయుచోనయిన గద్యము
తోడుతఁ జెప్పెపెట్టవొ
ర్గత్యముఁదోవ—.. ......
శ్రుత్యను రూపమంచునిడ'.. ...
(నిర్వ 1-26)

'ప్రీతి' శబ్దములో ద్విత్వతకారములేదు—'ప్రీణాతీతి ప్రీతిః ప్రీఞ్ తర్పణే - తృప్తిఁ జేయునది—' అమరకోశము.

త్త్వ ప్రాస

| | | | |
|---|---|---|---|
| 6–13 | సత్త్వ—సం | 6–101 | సత్త్వ—కా |
| | గిత్త్వ—ది | | రిత్త్వ—సే |
| | వ్యత్త్వ—జం | | విత్వ – – |
| | తుత్త్వ— | | తత్త్వ– – |

సంగిత్వ, దివ్యత్వ, కారిత్వ—సేవిత్వ—జంతుత్వ—వీనిలో ద్విత్వ తకారములేదు –

శబ్దరత్నాకరమున పైతెనుగు భాషా సంప్రదాయము ననుసరించి– సత్త్వ. తత్త్వ—శబ్దములు ఏక తకారముతోనే యున్నవి—ఈవిషయమింతకంటె వివరించుటకు వీలులేకపోయినది.[6]

---

## గణభంగములు

| సంశోధిత ముద్రణము | పూర్వ ముద్రణము (ఆనంద) |
|---|---|
| ద్వితీయాశ్వాసము | |
| (1) 2–192 క. అవధీయాను .....చూవె సంరక్షా కల్పన హీనుండైన | సంరక్షా కల్పన హీనుండైన. |
| (2) 2–230 మ. గురు శుశ్రూష...నాల్గవపాదము భవ్యబ్రహ్మచరోక్తముల్ | భవ్యబ్రహ్మ చర్యోక్తముల్ |
| (3) 339 క. ధరణీశ్వర పటెనొక్క దానవుఁ డతనిన్ | ధరణీశ్వరపట్టె నొక్క దానవుఁ డతనిన్ |
| (4) 342 చ. నినుఁగని రక్షణము నిర్మల చిత్తతఁజేయు | నినుగని వర్ణరక్షణముః నిర్మల చిత్తతఁజేయు |
| (5) 395 క. దమియింపఁ దగినవార | దమియింపఁ దగినవారల |

---

6 ఇట్టి సంయుక్తాక్షర ప్రాసల నన్నింటినిగూర్చి— నా అప్పకవీయ, తృతీయాశ్వాస వ్యాఖ్యానమున విపులముగా చర్చించి యున్నాను. అది అముద్రితము.

| సంశోధితముద్రణము | పూర్వ ముద్రణము (ఆనంద) |
|---|---|
| 6) 434 మహాస్రగ్ధర—రెండవ పాదము. ......... ...పిడ్కొనివి యాతం దేగి తా నప్పు దనుజ తతి యాటోపమున్ | డ్కొని యాతండేగి తానప్పు దనుజతతి యాటోపమున్. |

# తృతీయాశ్వాసము

| సంశోధితముద్రణము | పూర్వ ముద్రణము (ఆనంద) |
|---|---|
| (7) 5. ఆ. నిదురవోవు చోట నీరుదవ్వై వడఁ | నిదురవోవుచోట నీరు దవ్వై వడఁ |
| (8) 38. క. కార్య నిపుణమానసులు నాయుధజీవులు | ర్యనిపుణమానసులు నాయుధాజీవులు. |
| (9) 133 క. తోన మరేంద్రుండు మేలుదొరను విధమె | తోనమరేంద్రుండు మేలు దొరకొను విధమె |
| (10) 190 క. జనితామయమగు పథమున | జనితామయమగు పథమున |
| (11) 193 క. కరమూహించి మదిం బ్రాకాలవ్యజ్ఞాండున్ | మదిం బ్రాప్తకాలజ్ఞాండున్ |
| (12) 321 తే. ఖగములకు జీవనం బనఁగలదె సంగ | ఖగములకు జీవనంబన గలదె సంగ |
| (13) 422 క. బాయఁగ జడియ నోపిన | బాయఁగ జడియనోపిన |
| (14) 423 క. ఇవి దోఁడేళుల భంగి | ఇవి దోఁడేళుల భంగిం |
| (15) 424 తే. అధిపయిని దార్తరాష్ట్రుల యందుఁజాల | అధిప! యిని ధార్తరాష్ట్రుల యందుఁజాల |
| (16) 427 క. ఆలోకింపగ గుజనుఁడదియు నృశంసా | ఆలోకింపఁగ గుజనుఁడదియునృశంసా |
| (17) 430 క. ............... .... ...... దు తిఁ గొఱఁత వడిన ధరణీ | క . ........ దుర్గతి గొఱఁత వడిన ధరణీ |
| (18) 456 గీ. జగము వోకలఁ బుమ్పనంభృతాత్మ | జగము వోకలఁబుమ్ప వసంభృతాత్మ |
| (19) 479 క. ఎందుండి యెమి పనికై | ఎందుండి యేమిపనికై |

# చతుర్థాశ్వాసము

| సంశోధితముద్రణము | పూర్వ ముద్రణము (ఆనంద) |
|---|---|
| (20) 1 క. సంప త్క్రాంతనమాలలితన | సంప త్క్రాంత తమాల లితన |
| (21) 63 ...బరగునంత రంగ నిర్భారవ | భంగి బరగువంత రంగ నిర్భారవ |
| 2 పా. 2 వ దళము | |
| (22) 258 సీ. పా. తెల్లంబుగావది యెల నీకు | తెల్లంబుగావది యెల్ల నీకు |
| (23) 309 క. తోవ పొరఁగవలయు విషయ దురాత్మకుఁడై | విషయదూరాత్మకుఁడై |

| సంశోధిత ముద్రణము | పూర్వముద్రణము ( వంద) |
|---|---|
| (24) 330 తే.......... .......... గు హ్రశయము మోక్షంబగు నాగ ములు | గు హ్రశయము మోక్షంబగు నాగమములు |
| (25) 338 తే. అపగసూమతో మిథిలాది నాథు | అపగాసూమతో మిథిలాధి నాథు. |

## చతుర్థాశ్వాసము

| | |
|---|---|
| (26) 412 గీ. వేనింత యెఱుఁగుదు వగవ చేమిటికి | ఈ పాద మంతయు తప్పినది—ఇంతయెఱుఁగుదు వగవ నేనేమిటికిని |
| (27) 439 క. అకట భవచ్చిత్తని | అకట భవచ్చిత్తము వని |

## పంచమాశ్వాసము

| | |
|---|---|
| (28) 5–8 సీ. గీ. మెచ్చనైతివి దానవులనీ మెచ్చు చొప్ప | మెచ్చనైతి దానవులనీ మెచ్చు చొప్ప |
| (29) 80 సీ. పా. 2. రెండవదళము సేసి తా నాతనిచే నను | సేసితా నాతనిచే ననుమతి |
| (30) 158 తే. ద్రచ్చిపుచ్చి నవనీత మిచ్చితినిన | ద్రచ్చిపుచ్చిన నవనీత మిచ్చితి నిన |
| (31) 242 తే. నాశనమునఁజేసి నరుఁడువినష్ట భావ | నాశనము జేసినరుఁడు వినష్ట భావ– |
| (32) 288 క. 4 వ పాదము ఆర్యులుసేయుదురు నిశ్చయము జిరముగన్ | నిశ్చయంబు జిరముగన్ |
| (33) 303 క. 3 పా. వేదిగతంబుగ నడిగితో | వేదిగతంబు నడిగితో |
| (34) 308 క. 1 పా. విను మజ్ఞానకు బ్రాజ్ఞన | వినుమజ్ఞానకును బ్రాజ్ఞన |
| 1 పా. (35) 320 క. ఏ విధముగ కాంత నైనం | ఏ విధము కాంత నైనం |
| (36) క. 2 పా. బుననాలవు న్నాశమంబుఁ బొందురు మహా | న్నాశమంబు బొందుదురు మహా |
| (37) సీ. 4 పా. ప్రభవంబనఁగ నివ్వ యమున శాంతినా. | ప్రభవంబనంగ నవ్యయ మన శాంతినా |
| (38) 371 గీ. 3 పా. వగుడన నపాయమగు నుపాయంబనఁగ | మగుడన నపాయమగు నుపాయంబనంగ |
| (39) 375 సీ. గీ. 3 మానివాసంబులనమి మమతత్వ మెదఁది | మానివాసంబులన మమతత్వ మెదఁధి |

| సంశోధిత ముద్రణము | పూర్వ ముద్రణము (ఆనంద) |
|---|---|
| (40) 445 క. 4 వ పాదము<br>వినవలతనవుడు నంతకడు వినయానతుండై | వినవల తనవుడు నతండు వినయానతుండై |
| (41) 471 క. 2 వ పాదము<br>త్త్వోర్వమీఁదల్లంబు దనికన గడునే | త్త్వోర్వమీఁదల్లడంబుదనికిన గడున్ |
| (4.) 530 క. 1 వ పాదము.<br>అరయఁగదళీ గర్భ | అరయఁగదళీ గర్భ |
| (43) 546 క. 1 వ పా.<br>పరమ ధర్మభేదులును నయ | పరమర్మ భేదులును నయ<br>ఇచట—మర్మ అను పాఠము. (ఆనంద) చూపబడలేదు. |
| (44) 576 క 3 వ పాదము— వూగమము<br>గ్రోధము గుణా | వూగమము గ్రోధమును గుణ |

# షష్ఠాశ్వాసము

| | |
|---|---|
| (45) 35 సీ. 3 పాదము 2 వ దళము—సాంఖ్య<br>యోగంబుల చందనములును | సాంఖ్యయోగంబుల చందములను |
| (46) 53 క 1 వ పాదము మమతంగాదె<br>బహుజ | మమతంగాదే బహుజ |
| (47) 134 సీ. 3 పాదము 2 వ దళము<br>గోరెదననిన నవ్వారిఁ జావు | గోరెదననిన నవ్వారి జావు |
| (48) 179 క. 2 వ పాదము అగునని లింగ<br>ములు దాల్తు రమ్మెయి లేదే | దాల్తు రమ్మెయి లేదె |
| (49) 306 క. 3 వ పాదము పూరితము జేసె<br>నమ్మని | పూరితముజేసి నమ్మని |
| (50) 331 గీ: మొదటి పాదము నగ్నలై<br>యప్సర స్త్రీ జనంబులు సలిల | నగ్నలై యప్సర స్త్రీ జనంబు సలిల |
| (51) 355 ఆ. 3 వ పాదము భర్తయును<br>నయంబు బలిమియుఁ గ్రతుకుతూ | భర్తయును నయంబు బలిమియుఁ గ్రతుకుతూ |
| (52) 362 గీ. 1 వ పాదము — అన్నరేంద్రుండ<br>హింసకు కడగుటఁ జేసి | అన్నరేంద్రుండ హింసకుఁ<br>డగుటఁ జేసి |
| (53) 370 క. 3 వ పాదము లోకింపంగా<br>ధారకొమఁ | లోకింపంగా ధారకొము— |

| సంశోధిత ముద్రణము | పూర్వ ముద్రణము (ఆనంద) |
|---|---|
| (54) 377 సీ. గీ 3 వ పాదము ఆనంద నభృతముల | ఆనంద సంభృతముల |
| (55) 417 సీ. పా 1 వ పాదము సర్వజ్ఞుడగు ప ॰ శర నదంనుని చేత | సర్వజ్ఞుడగు పరాశర నందనుని చేత— |
| (56) నాల్గవ పాదము— కన్యసస్వరకర గ్రహణ బు వడయుఁగ | కన్యసస్వరకర గ్రహణంబు వడయుఁగ |
| (57) 518 సీ: తే. 1 వ పాదము భక్తిఁ జేసి నారయణ ప్రభువుఁడంద్రు | నారాయణ ప్రభువుఁడంద్రు |
| (58) 543 తే. 3 వ పాదము దాత్తాకృప నెఱింగించి తత్యుత్తమంపు | దాత్తకృప నెఱింగించి తత్యుత్తమంపు |
| (59) 591 క. 2 వ పాదము జని భృగునిఁ గాంచె వినయ సంభ్రమములతో | జని భృగునిం గాంచె వినయ సంభ్రమములతో |
| (60) 596 క. 1 వ పాదము నా కోర్కి పిదపఁ జెప్పెద | నా కోర్కి పిదపఁ జెప్పెద |
| (61) 610 సీ. రెండవ పాదము 2 వ దళము నియముండు ఫలమూల నిరమూరు | నియముండు ఫలమూల నిరతమూరు |
| (62) 623 క. మొదటి పాదము బుభు విభు లోచనాంబుజ | బుభు విభువిలోచనాంబుజ |

## పాద విభజన — సంబోధనలు

పాద విభజన కొన్ని పట్టుల సరిగా లేదు—

1–346 సీ. దేవ భూదేవ పూజావిశేషము లాచరించి యక్కురు కులశ్రేష్ఠుఁడుర్వి—అని ముద్రణ

"విశేషము లాచరించి
యక్కురు కులశ్రేష్ఠుఁడుర్వి—"

అని యుండవలెను.

5.394 తే. అనినవారు కృతార్థులై యతనిఁ బ్రస్తుతించిరని చెప్పె విని నరదేవరుఁడు అని ముద్రణ

"అనినవారు కృతార్థులై
యతునిఁ బ్రస్తు
తించిరని చెప్పె విని నరదేవవరుఁడు"
అని యుండవలెను

ఈ పరిష్కరణమున [7]సంబోధన చిహ్నములు లేకపోవుట వలన నీ క్రింది పట్టున— పాఠము తప్పినది.

6–134 సీ పా. అశ్నేని వాగ్దేవి నావహించెద విశ్వతంబుగాఁ జేయువాన్యంబు విప్రు

7 నవీన పరిష్కరణమున, ఆశ్చర్యార్థక, సంబోధనార్థక, ప్రశ్నార్థకాది చిహ్నము లన్నియు పాటించిన — పాఠకులకు గ్రంథము సులభగ్రాహ్యమగును.

గీ. యనిన నవ్వచనము విని యాదవమ్ము—

ఇచట— 'విప్రుఁయనిన' — అనుచో నర్థము లేదు. ఇచట 'విప్రు'కాదు 'విప్ర!' అని సంబో

ధన—' ఓ విప్రా ఓ బ్రాహ్మణుడా, నీ ముఖము తెలుపుము—కన క, 'విప్ర'యని ముద్రితము కావలెను—స్త్రీ వాచక తత్సమ సంబోధనాంతములకు సంధి యుండదు గాన విప్ర! యనియె'—అని యుండును—

## అర్ధానుస్వారములు

ఈ ముద్రణమున — అరసున్న లుండవలసినచోట్ల లేవు, ఉండకూడనిచోట్ల యున్నవి.

1–16 — పెరిఁగి — పెరుగు శబ్దములో అరసున్నలేదు—
5–185 — తృప్తుఁడ— అరసున్నలేదు—
5–354 — ఎఱుఁగు— ,, 5—384 (6–384)
5–540 — పసిఁడి — ,,
6–174 — బరఁగు — ,,

పరగు శబ్దములో అరసున్న లేదు—

6-185 — తెఱఁగి — ఉండవలసిన అరసున్న లేదు—
202 — గబాఱి — ,,
293 — అతఁడు — ,,
450 — మృదుఁడు— ,,
494 — ఆర్ద్రుఁడై ,,
496 — దకుఁడు — ,,
520 — నారాయణుఁడు— ,,

అనవసరమైన చోటు —

1–266 — వాఁిభుడు—
4–13 — అనుఁన్మాత్రః

వకారమునకు ముందర్ధానుస్వారముండుట వింత !

5–375 — గోవుఁతో

## శకట రేఫములు

3–194 — వెఱవు — వెరవు —
203 — ఎరకు — ఎఱకు
5–417 — ఉరున్ — ఉఱున్ —

## అ చ్చు త ప్పు లు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3-480 | 17,7 | ధర్మే | ధర్మే ఁ్య |
| 4–526 | 9,22 | మార్గా | మార్గ |
| 47 | 9 | ఢక | డిక |
| 124 | 19 | నిర్మ | నిర్మ |
| 176 | 5 | పరిఘ | పరిఖ |

పరిఘ శబ్దము ఆయుధార్థమున 'ఘ' కారము, కాని—అగడ్త అను నర్థమున ఘ కారము కాదు. 'ఖ' కారము 'ఖేయంతు పరిఖా' అని అమరము.
ఇచట కోట వర్ణన కాన పరిఖ.

| | | | |
|---|---|---|---|
| 178 | 7 | పుల | పులి |
| 243 | 10 | అడి | అది |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 262 | 8 | విర | విరి | 547 | 10 | కాంత | కాంతి |
| 264 | 12 | నకు | నను | 555 | 13 | మన | ముని |
| 284 | 3 | లాలు | ల్ణాలు | 559 | 15 | యొడు | యొడ |
| 304 | 21 | పాజ్ఞ | ప్రాజ్ఞ | 564 | 6 | యుని | యును |
| 325 | 1 | మూర్ధా | మూర్ధ్లా | 574 | 25 | హ్లాతు | హితు |
| 329 | 5 | మగ్జజ్ఞ | మృగ్జజ్ఞ | 584 | 13 | బౌన | మౌన |
| 336 | 17 | వే | తే | 593 | 9 | కృష్ణ | కృష్ణ్ణ |
| 424 | 19 | దర్మ | ధర్మ | | 15 | ద్రౌ | దౌ |
| 425 | 11 | త్రైవ్యకి | త్రైవ్యక | 607 | 8 | కుడ | కుడు |
| 446 | 11 | యుంప | యుద్ధప | 615 | 17 | న్పిశ | నిశ్చ |
| 472 | 18 | పద | పథ | | | | |
| 491 | 15 | సోబ | సోప | | | | |
| 495 | 5 | ధుంధు | ధుండు | | | | |
| 513 | 16 | నిరు | విర | | | | |
| 544 | 13 | అశ్మ | ఆశ్మ | | | | |

ఇక మూల గ్రంథ విమర్శన — ఇందు శాంతి పర్వముమగూర్చి తెలియదగిన కొన్ని విషయములను సంగ్రహముగా దెలుపుచున్నాను. విపులముగా దెలిపిన గ్రంథ విస్తరభీతి యగుటచే విరమించవలసి వచ్చినది.

(సశేషము)



# నీడలు

## శ్రీమతి ఆర్. వసుంధరాదేవి

ఎటువైపు చూచినా ఎంత మేరకు చూచినా ఒకటే వరసన ఎర్రని గట్టిపర్రనేల. అక్కడక్కడా ఎర్రటి గుట్టలూ కొండలూనూ. ఒక గుట్టప్రక్కన చిన్న సైన్‌బోర్డు. నల్లని బోర్డు మీద చిన్న తెల్లని గుండ్రని అక్షరాలతో 'డొక్కా సీతమ్మ సత్రం' అని వ్రాసి వున్నది. ఆ గుట్టనాలున చాలమంది మనుష్యులు తిరుగుతూ ఆడుతూ వున్నారు—ఆడుతూ తిరుగుతూ వున్నారు వాళ్లు చేస్తున్న పని—వాళ్ల ఆట—ఏమిటంటే ఒకరి నొకరు పీక్కొని తినటం. అందరికంటే చురుకుగా తిరుగుతున్న మనిషి బక్కపలచగా నల్లగా వున్నాడు. నల్లపాంటూ ముదురు నీలంరంగు షర్టూ తొడుక్కున్నాడు. వూరికే నోరంతా తెరిచి నవ్వుతున్నాడు. నవ్వినప్పుడు తెల్లని గట్టి పలువరుసా ఎర్రని చిగుళ్లూ వాని సన్నని నల్లని పొడుగాటి మొహంలో సగం మేర ఆక్రమిస్తున్నాయి. ఆ నవ్వు నవ్వుతూ ఎడంచేత్తో ఎడమప్రక్కనువ్వ వాడి చెయ్యి పీకి నమిలేస్తున్నాడు. కుడిచేత్తో కుడి వైపు అందినవాడి పొట్ట చీలుస్తున్నాడు. అటూ యిటూ చకచకా తిరుగుతూ అందర్నీ గబగబా తినేస్తున్నాడు. వాని కదలికలు ఖచ్చితంగా వున్నాయి. వాటిలో తడబాటూ పొరపాటూ లేదు. చెయ్యి చాచాడంటే అనుకున్నది అందిందన్న మాటే. ఈ విపరీతపు గుంపుకి ఒక చివరగా చిన్న టేబిల్‌మీద చందనపు చెక్కతో చెక్కినట్లున్న ఒక చిన్నపాప కూర్చుని వున్నది ఆ పాప మంచికళ గలిగి, లోపల్నుంచి ఉబికివస్తున్న కాంతితో మెరుస్తున్నది. నల్లని కళ్లతో అందర్నీ చూస్తూ వున్నది. ఉన్నట్లుండి ఆ గుంపులో కొందరు ఆ పాపను గమనించారు. ఆ పాపను తినడానికి నవ్వుకొంటూ ఆడుకొంటూ వస్తున్నారు. అందరికంటె ముందుగా ఆ నల్లనివాడు వస్తున్నాడు. ఇహ వాడు చెయ్యి చాచితే పాప అందుతుంది. వాడు చెయ్యి చాచాడు.. ...

నిర్మల లేచి కూర్చుంది మంచంమీద. గుండె దడదడ లాడిపోతున్నది. తాను వాడి చేతికి చిక్కిపోతానేమోనన్న విపరీతమైన భయం. ఇదంతా ఉత్త కలేనని స్థిమితపడటానికి నిర్మలకు పది నిముషాలు పట్టింది కలలోని చిన్న పాపకీ నిర్మలకీ ఏ విషయంలోనూ పోలికల్లేవు. కాని ఆ పాప తానేనని నిర్మలకి తెలుసు. అందువలననే ఆ భయం, దడ. ఒకరి నొకరు పీక్కుతినే స్వార్థపూరితుల ప్రపంచంలోని నిర్మల ఆ పాప.

ఇహ ఆ కలలోని నల్లనివాడు పోలికల్నిబట్టి చూస్తే నిర్మలకు ఇంట్లో పనిచేసే భాస్కరం అవడంలో సందేహంలేదు. వాడు నిర్మల భర్తయొక్క ఆఫీసులో స్వీపరు. ఏ పని చెప్పినా చాల శుభ్రంగా చేస్తాడు గనుకనూ ఇదివరలో ఎన్నోమార్లు ఉద్యోగం పోగొట్టుకున్నవాడు గనుక ఈసారైనా నిలుపుకుందామన్న భయం గలవాడు గనుకనూ ఇంటిపనికి వేశారు. నిర్మలకు నచ్చేటంత శుభ్రంగా పనిచెయ్యగలవాళ్లు అరుదు. వాడు ప్రతి పనినీ పూర్తిగా, శుభ్రంగా, అక్కఱగా, నిదానంగా చేసుకుపోతుంటాడు. వాడి పని నిర్మలకు నచ్చింది. కాని ఎందుకో వాడంటే నిర్మలకు ఏమాత్రం సరిపడటంలేదు- నిష్కారణంగా, పొట్టకూటికోసం పలుయాతనలు పడుతూ ఏదో ఒక విధంగా బ్రతికేసెయ్యడమే పరమార్థంగా ఎన్నో తరాల నుండి బ్రతుకుతూ వస్తున్న జాతినుంచీ వచ్చాడు భాస్కరం. మిషనులో ఆయిలు తుడిచి పారేసినట్లుగా కన్పించే మురికి బనీనూ, అలాంటిదే చిన్న లాగూ; వాటిపైన శుభ్రంగా కన్పించే షర్టూ పాంటూ వాడి

దున్నాలు. ముగ్గురు బిడ్డలకు తండ్రి అయిన పాతి కేళ్ల మనిషి. బక్కగా వున్నా చాల చురుగ్గా పని చేస్తాడు. అవతలివాళ్లు చెప్తున్నదాని గురించి 'అవును' అనడం తప్పించి, వాడి సొంతంగా ఏ విషయాన్ని గురించి గాని మాట్లాడడు. నిశ్శబ్దంగా వుండటం వాడి స్వభావం. సులువుగా చాపక్రింది నీళ్లలాగా ఎదుటి మనిషి అంతర్యంలోనికి ప్రవేశించగల నేర్పు వుంది. ప్రతి మనిషినీ నడిపించేది స్వార్థజన్యమైన అవసరం అన్న జ్ఞానం కలవాడు గనుక అవతలి మనిషికి ఏది అవసరమో, ఏంచేస్తే ఆ మనిషిని మెప్పించవచ్చునో, ఏంచేస్తే కోపం వస్తుందో అన్నీ గుర్తించగలడు. వీలు చిక్కినప్పుడు తనకు తెలిసిన 'పెద్దవాళ్ల'కు వాళ్లు చెప్పనవీ చెప్పనివీ చిన్న పను లేవో చురుగ్గా చేసిపెడుతూనే వుంటాడు. ప్రతి కొద్ది పరిచయమూ త్వరలోనే మూడు పువ్వులు ఆరు కాయ లుగా విస్తరించుకుపోతుంది. పాత షర్టులు, పాంట్లు, పాత పచ్చళ్లు, పిల్లల బట్టలు, మిగిలిపోయిన అన్నం, కూరగాయలు, కూరలు, చీరలు, డబ్బులు—ఒక టేమిటి, ఎప్పుడు ఏ పరిచయంనుంచీ ప్రతికడానికి పనికొచ్చే ఏ వస్తు వొచ్చిపడుతుందో భాస్కరానికే తెలియదు. ఎన్ని వచ్చినా, వాడు ఇతర్ల మెప్పుకు చేస్తున్న పనికి తగినట్లుగా మాత్రం రావు. ఎందుకో గాని చాలమంది వాడు తమ జీవితంలోకి అలా చొరబడి రావడం, తమ అవసరాల్ని ఆంతర్యాన్ని గ్రహించడం సహించలేరు. వాడి తెలివితేటల్ని గమనించబోయి ఆగి పోతారు. తమ పట్ల వాడు చూపించే అక్కరను హర్షించరు.

ఇంట్లో వారెవ్వరూ లేనప్పుడు, నిర్మల బాత్ రూమ్‌లో వున్నప్పుడు భాస్కరం ఆ దగ్గర్లోనే బయట కూర్చుని అప్పుడప్పుడు దగ్గటం, గొంతు సవరించు కోడం, కాండ్రించడంవంటి శబ్దాలు చేస్తుంటాడు. 'ఎవరూ లేరని మీ యింట్లోకి పోయి సామాన్లేవీ ఎత్తుకోడం లేదమ్మోయ్' అన్నట్లు వినబడతాయా శబ్దాలు నిర్మలకి. ఆమె వంటగదిలో, భోజనాల గదిలో, బాత్ రూమ్‌లో.... ఎక్కడుంటే, అక్కడి తూముల బయటినుండీ పుల్లలతో పొడిచి గీకి శుభ్రం చేస్తాడు. 'నేను మీకోసం యీ పని చేస్తున్నాను. గమనించుకోవమ్మా' అన్నట్లుంటుంది నిర్మలకు. ఒక్కోసారి నిర్మల ఏ పనిలోనో గబు క్కున వెనక్కి తిరిగేసరికి అక్కడ నీడలాగా నిలబడి వుంటాడు భాస్కరం—ఏదో అడగటానికి, పని చెయ్య టానికి, ప్రతికెయ్యడానికి అనుకొని యీ దర్శనానికి నిర్మలకు భయం కంపరం కలుగుతాయి. వాడి నిశ్శబ్దం పెద్ద శబ్దంగా ఆమె మనసులో హోరెత్తు తుంది.

'వాడు బ్రతకడంకోసమే యిలా చేస్తున్నాడు. వాడు బ్రతకడానికి అవసరమైతే నా తల బ్రద్దలు కొట్టెయ్యగలడు. నన్నూ, యీ ప్రపంచాన్నీ నామ రూపాలు లేకుండా చెయ్యగలడు. బ్రతుకు...నేను! నేను...బ్రతుకు!.. అదీ! అదే అసలు సంగతి' వినుగ్గా, కోపంగా, భయంగా భారంగా—అనుకోకుండా అను కుంటుంది. అనుకుంటూ అనుకోకుండా వుంటుంది నిర్మల. దానితో భాస్కరంమీద అనుమానం మరింత జాస్తి అయిపోతుంది.

నిజానికి ఆవిడ అనుమానానికి ఆస్కారం కలి గించే పని ఏదీ చెయ్యలేదువాడు, ఇంతవరకూ. కొన్ని అబద్ధాలు చెప్పినా అది అందరూ చేసే పనే. వాడు దొంగతనం చెయ్యలేదు. ఏ దుర్మార్గమూ చెయ్యలేదు. కనీసం 'కాద'న్న సమాధానం కూడా చెప్పలేదు! అయినా కూడా మిగతా ఎవరి పట్లా లేని అనుమానం వాడిమీద నిలిచింది నిర్మలకు.

భాస్కరమంటే నిర్మలకు సరిపడక పోవడానికి మరో కారణం వాడి నీడ. నిర్మలకి ఏ నీడలన్నా సరి పడవు. అవంటే భయం, ద్వేషం. నీడలకో చిత్ర మైన గుణం వున్నది. అవి ఒకదాన్లోకి మరొకటి పాకి పోతాయి. వస్తువుయొక్క ప్రత్యేకతను కుదించి వేస్తాయి. మలినం చేస్తాయి. ఏ వస్తువులోనూ నిజం లేనట్లూ, ఎక్కడో వుండే సూర్యుడొక్కడే నిజమై లోకంలో వుండే చంచర వస్తువు లన్నిటినీ నీడలుగా మార్చి అబద్ధం చేస్తున్నట్లూ తోపింప జేస్తాయి. నిర్మలకు నీడలంటే యిష్టం లేకపోవడానికి మరో

కారణం కూడా వున్నది. తాను ఏదైనా పనిలో వున్నప్పుడు యింట్లో వుండే పనివాళ్లు నీడల్లాగా కుడివైపుకి వెళ్లినప్పుడు ఎడమకి వెళ్లినట్లూ, ఎడమ వైపుకి వెళ్లినప్పుడు కుడివైపుగా వెళ్లినట్లూ భ్రమ కలుగుతుం దావిడకు. ఎదుటి మనిషిని సూటిగా చూడటం నిర్మలకు అలవాటు లేదు. వాళ్ల నీడలే ఆమెకు కన్పించేవి. ఇంట్లోకి వెళ్లిన మనిషి ఏంచేస్తున్నాడోనని తిరిగి చూస్తే బయట ప్రక్కన కన్పిస్తాడు. బయటకు వెళ్లిపోయాడులే, ఎక్కడో దొడ్లో వున్నాడు అనుకుని తన పనిలో తానున్నప్పుడు ఆ మనిషే ఇంట్లోంచీ బయటకు వస్తాడు. అందు వలన నిర్మల చాల గొడవ పడిపోతూ వుంటుంది. భాస్కరం నీడ ఆవిణ్ణి మరీ తికమక పెడుతుంది. తనని అలా తికమక చెయ్యడానికే ఉద్దేశ పూర్వకంగా అలా చేస్తున్నాడా అనీ, పిల్లిలాగా ప్రక్కకి నడిచే అలవాటుం దేమోననీ, యింకా చాలా సందేహాలు కలిగాయి నిర్మలకు యీమధ్యలో. అట్లాగని ఆమెకు పనివాళ్లందరూ దొంగ లనుకునే సంస్కారం లేదు. అనవసరంగా, ఋజువు లేకుండా యితర్లను అనుమానించి నింద దియ్యడం ఆవిడకు సరిపడదు. పైగా మనుష్యు లందరూ సమానమేననీ, వాళ్లకు ఆత్మ గౌరవం వుంటుందనీ, ప్రపంచమంతా పవిత్రమైనదనీ భావి స్తుంది.

నిర్మల చిన్న పిల్లగా వున్నప్పుడు వాళ్ల నాన్నగా రొకసారి అన్నారు 'మా నిర్మలకు పేరు తగినట్లుగా కుదిరిండి. నిర్మల నిర్మలే' అని.

ఆ మాటలు నిర్మల ఎప్పుడూ మరచిపోదు. ఆమెకు తండ్రి దేవుడితో సమానం.

బాహ్యంగా నిర్మలది తల్లి పోలిక. ఇద్దరు బిడ్డల తల్లి అయిన నిర్మల కొంచెం పొట్టిగా లావుగా గుమ్మటంలా వుంటుంది. తల పెద్దది పెద్ద మొహంలో కళ్లూ ముక్కూ నోరూ ఆ పెద్ద తలకీ శరీరానికీ చెందినవి కానట్లు నాజూగ్గా వుంటాయి. పనిచేసుకుంటున్నప్పుడు నిండుదనం నిబ్బరం లేనట్లుగా ఎవరో తరుముకొస్తున్నట్లు పరుగెత్తుతూ పనులు చేసు కుంటుంది. అందువలన ఆమెకున్న ముప్ఫైఏళ్ల వయసుకంటే చిన్నదిగా కన్పిస్తుంది. బట్టలు శుభ్రంగా వుంటాయి గాని అశ్రద్ధగా నాజూకు లేకుండా కట్టు కుంటుంది.

పై పోలిక తల్లిదే అయినా ఇద్దరి స్వభావాలూ పూర్తిగా భిన్నంగా వుంటాయి. చిన్నప్పణ్ణుంచీ నిర్మ లకు తల్లి గురించి సదభిప్రాయంలేదు. ఆవిడ చదు వుకోలేదు. నాగరకత లేదు. దేని గురించీ సరైన 'దృక్పథం' లేదు. తన సంసారం, దాని బాగోగులూ తప్పించి ప్రపంచంలో ముఖ్యమైనదేదీ లేదావిడకు. ఎదుటివాళ్లూ మనుష్యులేనన్న గుర్తింపు ఏమాత్రం లేదు ఇతరులపట్ల ముఖ్యంగా క్రింద పనిచేసేవాళ్ల పట్ల చాల అన్యాయంగా ప్రవర్తిస్తుందని నిర్మల ఉద్దేశ్యం. పని సరిగ్గా చెయ్యలేదని ఎప్పుడూ వాళ్లని కేక లేస్తూనే వుండేది. ఏదైనా వస్తువు కన్పించ నప్పుడు ఏ ఋజువూ లేకుండానే వాళ్లని దొంగలైనట్లు నిలదీసేది. ఒక్కోసారి ఆ వస్తువు ఇంట్లోనే ఏ మూలనో దర్శన మిచ్చేది. అప్పటికి నిజంగా ఏమీ ఎరగనివాళ్లని దొంగలని ఆరోపించినట్లే. ఆ వస్తువు నిజంగా పోయినప్పుడు కూడా ప్రశ్నించబడ్డ నలుగురు మనుష్యుల్లోనూ నిజానికి దొంగ ఒకడే వుంటాడు. మిగతా ముగ్గురూ నిర్దోషులే కదా. ఋజువు లేకుం డానే ఎవర్నైనా ఏమైనా అనడం తగని పని. అన్యాయం, మహాపాపం. ఒక చిన్నవస్తువుకోసం ఇత ర్లను దొంగలుగా నిలబెట్టడం నిర్మలకు సరిపడదు, వెధవ వస్తువు మనిషికంటే ఎక్కువా? అనుకుంటుంది. అటువంటి సమయాల్లో తల్లిమీద విరుచుకుపడేది. తండ్రి ఎప్పుడూ పూర్తిగా నిర్మలని సమర్థించే వారు. ఇటువంటి ఋజువర్తనం, సాంఘికన్యాయం, ఉన్నతాదర్శాలూ తండ్రీ కూతుళ్ల మధ్యన గట్టి బంధంగా వుండేవి. దేవుడు వచ్చి 'ఇది నీ ఆఖరి క్షణం. వచ్చే జన్మకు నీకేం కావాలో కోరుకో' అని అడిగితే, తక్షణం చెప్పినా ఏడాది ఆలోచించుకొని అడిగినా నిర్మల ఒకటే అడుగుతుంది. 'మలినం అంటని మనసు, నిర్మలమైన జీవితం గల నిర్మలగానె

పుటించు' అని. కాని సంసార బాధ్యతలు పైన పడ్డాక నిర్మలకు పరీక్ష ప్రారంభమైంది.

జీవితం ఆదర్శాల మేరకు నడవడం కష్టమవుతోంది. తన యింట్లో వస్తువు పోయినప్పుడు ఏంచెయ్యాలి? అన్నది కొరుకుడు పడటంలేదు. ఇతర్లని ఋజువు లేకుండా అనుమానించడం ఆవిడకిష్టంలేదు. కాని వస్తువులు పోగొట్టుకోవడమూ యిష్టంలేదు. ఇదివరకు పుట్టింట్లో వున్నప్పటి వస్తువుల్లాగా కాకుండా ఇక్కడివన్నీ ముఖ్యమైన వస్తువులు. ఏ వస్తువుగాని పోతే పోతుందిలే అనుకోడానికి వీల్లేకుండా వున్నది. వాటిని కాపాడుకోడానికి అవతలి మనుషుల్ని వూరికే అనుమానించడం తప్ప. ఏం చెయ్యాలో తోచక ఆవిడ ప్రపంచాన్ని 'చూడకుండా' వుండటం నేర్చుకున్నది. చూడని విషయాలకు బాధ పడాల్సిన అవసరం లేదు!

ఈ పరిస్థితుల్లో ఆవిడలో మరో మనసు రూపు కట్టి వేరుగా వ్యక్తిత్వాన్ని ఏర్పరచుకున్నది. ఆవిడ గమనించనివెన్నో అది గమనిస్తుంది. అర్థం చేసుకుంటుంది. ఆ రెండో మనసుతో తన కేమీ సంబంధం లేదని నిర్మల అనుకున్నా, దాని అభిప్రాయాలు ఆవిణ్ణి కలవరపరుస్తాయి. అందువలన ఎన్నో విషయాలు ఆమె మనసులో నీడల్లాగా నిజం కాకుండా అబద్ధం కాకుండా వుంటాయి.

ఆ క్రితం రోజు బాత్‌రూమ్‌లో వుండే స్టీలు చెంబు మాయమైపోయింది. ఎట్లా పోయిందీ ఎవరు తీసిందీ ఆచూకీ తెలియలేదు. ఆమె ఆలోచనల్లోంచి ఆవిడ మనసులో ఒక నీడ మెదిలింది. వస్తువు పోయిన రోజు మధ్యాహ్నం కొత్త పనిమనిషి చంద్ర బాత్‌రూమ్‌లో తచ్చాడుతూండటం అటు వెళ్తూ నిర్మల చూచింది. నిర్మలను చూడగానే తడబడి, బకెట్‌లోంచీ నీళ్లు తీసి తూము దగ్గర శుభ్రం చెయ్యనారంభించింది. 'ఈ సమయంలో అది తూములు కడగదే. ఇప్పుడు ఇక్కడ ఎందుకున్నది?' అని నిర్మల ప్రశ్నించుకోలేదు. దాన్ని అడగలేదు. ఆ విషయమే 'చూడకుండా' వెళ్లిపోయింది. అందువలన ఆ సమయంలో చంద్ర అక్కడున్న విషయం ఆవిడకు ఖచ్చితంగా జ్ఞాపకం లేదు. జ్ఞాపకపు నీడలాగా వున్నది. చంద్ర అప్పుడు అక్కడ కన్పించిందా అంటే కన్పించినట్లే వున్నది. లేదా అంటే ఏమో గుర్తు లేదు. చెంబు ఏమైంది? చంద్ర తీసిందా? భాస్కరం తీశాడా? వేరెవరూ అక్కడకి వెళ్లరే. చెంబు కన్పించలేదని గుర్తించినా దాని విషయం ఇంతవరకూ ఎవర్నీ అడగలేదు. ఎవర్ని అడగటం?

దాని విషయమై క్రితం రోజు మనసులో చాల యాతన పడింది స్టీలుచెంబు విలువ ఇరవై రూపాయిలే గదా. ఇరవై రూపాయిలకోసం ఎందు కింత బాధ పడాలి? పుట్టింట్లో వున్నప్పుడు ఇటువంటి వాటి కోసం—వస్తువులకోసం—యింత బాధ కలగలేదు. ఆ వస్తువులు ఎలా వచ్చాయి; ఎంత ఖర్చుతో వచ్చాయి; ఎందుకు వచ్చాయి అన్న ఆలోచనే రాలేదు అప్పుడు. వెధవ స్టీలుచెంబు, ఇరవై రూపాయిల వస్తువు, దాని బదులు రూపాయిన్నర ప్లాస్టిక్‌మగ్ పెట్టుకున్నా పని జరిగిపోతుంది అని యిప్పుడూ తెలుసు. కాని నిర్మల ఆ చెంబును కావాలని కోరి కొనుక్కున్నది. తన చెల్లెలి యింట్లో అన్నీ స్టీలు సామానులు మెరిసిపోతూ వుంటే చూచి, కోరి, తానూ అన్నీ అలాంటివే సంపాదించింది. ఆ చెంబుకోసం రెండు సగం పాతబడ్డ పట్టుజరీ చీరెలు యిచ్చింది సామాన్లవాడికి. మళ్లీ అలాంటి చీరెలు కొనాలంటే ఎంత ఖర్చు! అదీ గాకుండా యివాళ చెంబు పోయినట్లే రేపు బకెట్, ఎల్లుండి పాత్రలు, ఆ మర్నాడు సొమ్ములు...ఎంతకైనా వూరుకోవాలా? ఇతర్ల దొంగబుద్ధి వ్యాపించి వ్యాపించి ఆఖరికి తనని మింగెయ్యబోతున్నట్లుగా అనిపించింది నిర్మలకు...అందువలననే ఆ కల వచ్చి వుండొచ్చును.

ఇంట్లో మామగారు వచ్చి వున్నారు. పని త్వరగా కావాలి. చెంబు సంగతి ఏదో ఒకటి చెయ్యాలనుకున్నది గనుక భాస్కరం, చంద్రవున్న చోటికి వెళ్లి 'బాత్‌రూమ్‌లో స్టీలు చెంబు పోయింది. మీ యిద్దరూ తప్పించి ఎవరూ అక్కడికి రారు. ఎవరూ తీశారో మీరే తేల్చుకుని తెచ్చివ్వండి' అన్నది.

'ఆ చెంబు సంగతి నాకేమీ తెలవదు' అనేసింది చంద్ర.

భాస్కరం నిశ్శబ్దంగా నిలబడ్డాడు.

చంద్ర పనయిపోయిందని చెప్పి ఇంటికి వెళ్లడానికి బయల్దేరింది. చాలా ఆలోచనలో మునిగిపోయినట్లు నిలుచున్న భాస్కరం గబగబా వచ్చి 'పెద్దయ్యగారి చొక్కా బయట తగిలించారు అందులో డబ్బేమైనా పోయిందేమో చూడమనండి' అన్నాడు.

యాభై రూపాయలు పోయింది.

'నేనుపోయి చంద్రను పట్టుకొస్తాను'అంటూనే పరుగెత్తాడు భాస్కరం.

వరుసగా జరుగుతున్న దొంగతనాలకు నిర్మలకు మతిపోయింది.

సగందారిలో పోతున్న చంద్రను వెనక్కు పిల్చుకొచ్చాడు భాస్కరం. 'ఆ డబ్బు నాకేం తెల్సు'అంటూ మూలకుపోయి బట్టలువిప్పి విదలించి చూపించింది చంద్ర. దాని డబ్బు జుట్టులో దాచేసుకొనివుండదా?' అన్న అనుమానం తీవ్రంగా మెదిలింది నిర్మల మనసులో, కాని 'నీ జుట్టు ముడివిప్పి చూపించు' అని అడగలేక చంద్ర వెళ్లిపోతుంటే చూస్తూ వూరుకుంది.

తరువాత అయిదు నిముషాల్లో మడతగా పెట్టిన అయిదు పది రూపాయల నోట్లు తెచ్చి చేతిలో పెట్టాడు భాస్కరం. చంద్రను పిలుచుకొని వస్తూండగా దారిలో ఒకచోట ఆగిందట చంద్ర. అది యిక్కడ బట్టలువిప్పి చూపించేలోగా భాస్కరం తిరిగి వెళ్లి ఆ చోటులో చూస్తే యీ మడుపు దొరికింది. 'ఇటువంటి దొంగముండవల్లనే మా వుద్యోగాలు పొయ్యేది' అని తిరిగి వెళ్తున్న దాని మొహంమీద వూసివచ్చాడట.

మరో పదిహేను నిముషాల్లో చంద్ర వచ్చింది బంధు బలగంతో సహా, 'మీ చెంబులూ మీ డబ్బులూ నాకేం తెల్సు. మీ యింట్లో తిరిగేది నేనొక్కదాన్నే కాదుగా. ఎవరు తీశారో. మీ యింట్లో నేను పని చెయ్యను' అన్నది.

భాస్కరం నిశ్శబ్దంగా చూస్తూ నిలబడ్డాడు.

ఇంతకుముందే దాన్ని తిట్టి మొహంమీద వూసిన మనిషేనా ! అనుకుంది నిర్మల

ఇంటివెనక నిల్చున్న భాస్కరంతో కాసేపు మాట్లాడి వెళ్లిపోయింది చంద్ర.

'అది జీతంకోసమే వచ్చిందమ్మగారూ' అన్నాడు భాస్కరం.

చంద్రను వెనక్కుపిలిచి డబ్బిచ్చి పంపింది. వెళ్తున్న చంద్ర భాస్కరంతో మాట్లాడ్డంగాని. వాడు దానికి జీతం యిప్పించడంగాని నిర్మలకు అర్థం కాలేదు, జరిగినదాని దృష్ట్యా. వాడిమీద అనుమానం; అన్నింటికీ వాడే కారణమన్న అనుమానం, పెద్దదై పోయింది.

ఆవిడలోని మరో మనసు 'కోటుజేబులోంచీ డబ్బు పోయిందని వాడికెట్లా తెలిసిందీ?' అంటూ ప్రశ్నలేసింది.

'ఋజువు లేకపోయినా వాడూ దొంగే. దొంగతనంలో భాగస్తుడే.'

'దొంగని పట్టడానికి దొంగేకావాలి.'

'దాని దొంగబుద్ధి వాడిలోనూ వున్నది కనుకనే దాన్ని కనిపెట్టాడు.'

అన్నీ అనేస్తోంది ఆ మరో మనసు.

అప్పుడు నిర్మలకో భయంకరమైన సందేహం వచ్చింది.

'ఈ దొంగతనం ! చంద్ర చేసిందని ఋజువైంది. వాడు దొంగతనం చెయ్యలేదు. అయినా వాడిది దొంగబుద్ధి అని నేను ఎలా కనిపెట్టాను? దేనితో కనిపెట్టాను?' అని.

'ఛీ. అటువంటి క్షుద్రునితో నాకేం పోలిక ! వెధవ సీలు చెంబుకోసం ఏమిటీ గొడవంతా?' అని మనసును శాంతపరచుకోబోయింది.

మనిషికి ఆలోచన అనేవి ఎక్కణ్ణుంచీ వస్తున్నవి?

ఈ ప్రపంచంలో బ్రతికే మనిషి 'మనసా' నిర్మలంగా వుండటం సాధ్యమా ?

ఆ మనసులోనికి ప్రసరించే నీడలకు కారణం ఏమిటి ?

అల్పమైన వస్తువులకు విలువ ఎక్కణ్ణుంచి వస్తోంది ?

మనిషికీ ప్రపంచానికీ వుండే సంబంధం ఎలాంటిది ?

ఎన్నో ప్రశ్నలతో సతమతమైన నిర్మల జీవానికి మూలం ఎక్కడుందో అక్కడివరకూ వెళ్లి, దాన్ని అందుకోలేకపోయింది !

# శ్రీదేవి లాలిత్యము-సౌందర్యము

శ్రీ దోర్బల విశ్వనాథ శర్మ

శ్రీమద్బ్రహ్మాండ పురాణమున హయగ్రీవాగస్త్య సంవాదమునందు శ్రీ లలితా దివ్యసహస్రనామ స్తోత్రమున శ్రీ దేవి సౌందర్య మతిరమణీయముగ ప్రతిపాదింపబడినది.

సౌందర్యము అంత స్సౌందర్యము బహిస్సౌందర్యము అని రెండు విధములుగ నుండును. అంతస్సౌందర్యము సచ్చిదానంద స్వరూపము. బహిస్సౌందర్యము నామరూపాత్మకము. బ్రహ్మము సచ్చిదానంద రూపము. జగత్తు నామరూపాత్మకము. ఈ యుభయమును సౌందర్యమే. సౌందర్యమునకు పర్యాయమే లాలిత్యము. లలితయొక్క ధర్మము లాలిత్యము. సుందరియొక్క ధర్మము సౌందర్యము. సచ్చిదానందమయ బ్రహ్మము శ్రీ లలితా సుందరియొక్క అంతర్గత స్వరూపము. నామరూపాత్మక జగమామె బాహ్యరూపము.

నామరూపము లన్నియు నా శ్రీ దేవియొక్క బాహ్య సౌందర్యమునకు చెందినవేయైనను ప్రారంభమున కొన్ని నామములు రూపములు మాత్రమే యా భగవతీ సౌందర్యమునకు చెందినవిగా భావించి యుపాసించుట సనాతనాచారము. నామ రూపములు రెండును ఉపాసనా ప్రతీకములేయైనను నామావృత్తి రూపమైన జపమున రూపధ్యానము విగ్రహారాధన సమయమున సహస్ర శత చతుర్వింశత్యాది సంఖ్యక నామావళీ పఠనమును ఆధారము లగుటచే రుచి భేదమున వాని యంగాంగి భావము కల్పింపబడుచుండును. నామరూపములలో నామము నుండియే రూపము జనించినదను సిద్ధాంతము ననుసరించి నామమునకు ప్రాధాన్య ముండుటచే రూప ప్రతీకమునకన్న నామ ప్రతీకము శ్రేష్ఠమగును. ఉపనిషత్తులలోని ఓంకార ప్రతీకోపాసనా ప్రాధాన్య మీ యంశమునకు సమర్థకము 'తస్య వాచకః ప్రణవః' అను పాతంజలయోగ సూత్రమె ఓంకారమును భగవద్వాచకముగాఁ జెప్పెను. సన్న్యాసులకును విడువరానిదగుటచే దానికన్న మించిన మంత్రము లేదనుటయు ప్రసిద్ధమే. కాని ఏ నామమైనను భగవద్వాచకముగా భావించినప్పుడు మంత్రమగుచుండుటచే శ్రీ లలితా సహస్ర దివ్యనామ స్తోత్రము బహునామఘటిత మగుటచే మాలామంత్రముగ పేర్కొనఁబడుచున్నది.

శ్రీ దేవి మంత్రమగు షోడశాక్షరి శ్రీ షోడశాక్షరీ విద్యగా శ్రీ విద్యగా శ్రీ లలితా సహస్రనామ స్తోత్రమున పేర్కొనఁబడినది. ఈ స్తోత్రము శ్రీ చక్ర విజ్ఞానమును గూడ చక్కగా వివరించును. శ్రీ చక్రము శ్రీ దేవియొక్క బ్రహ్మాండాత్మక రూపమునకు పిండాండాత్మక రూపమునకు షోడశాక్షర విద్యకును సంకేత మగుటచేత శ్రీ చక్ర విజ్ఞానము గూడ శ్రీ విద్యయని వ్యవహరింపఁబడును.

శ్రీ విద్యా ప్రతిపాదక గ్రంథములు పెక్కులున్నను శ్రీ శంకర భగవత్పాదులవారి సౌందర్యలహరి సంగ్రహముగను రమణీయముగను శ్రీ విద్యను వివరించును. ల. స. నా. స్తోత్రమువలె నీ సౌందర్యలహరియు శ్రీ దేవియొక్క కేశాది పాదాంత రూప సౌందర్యమును అతిమనోజ్ఞముగ వర్ణించును. సచ్చిదానందాత్మకమగు అంతస్సౌందర్యమును గూడ ప్రతిపాదించును. అందుచేత శ్రీ శంకరులు తమ సౌందర్యలహరిని శ్రీ లలితా సహస్ర దివ్యనామ స్తోత్ర సారముగా సమకూర్చినట్లు భావించుట కవకాశము కలిగినది. ఈ రెండు గ్రంథములను తులనాత్మకముగ పరిశీలించినప్పుడు శ్రీ శంకరులు ల. స. నా. స్తోత్రమును నిరంతరము పఠించి జపించి భావించి రచించినట్లు స్పష్టమగును.

సౌందర్యలహరిలో మొదటి నలుబదియొక శ్లోకములు ప్రధానముగ శ్రీవిద్యను వివరించును. మిగిలిన శ్లోకములు ప్రధానముగ శ్రీదేవి రూప సౌందర్యమును వర్ణించును. శ్రీవిద్యను వివరించు మొదటి నలుబదియొక శ్లోకములు శంకరులచే కైలాసమునుండి పంచలింగములతోఁబాటు తేఁబడినవని అవి శంకర రచితములు కావని వాని కానందలహరి యను వ్యవహారము కలదనియు సంప్రదాయజ్ఞులు చెప్పెదరు. కాని మొత్తము శ్లోకములకును సౌందర్య లహరీ వ్యవహారమే రూఢమై యున్నది. తొలుత చెప్పిన విధముగ సచ్చిదానంద స్వరూపము గాని శ్రీవిద్య గాని రూపముగాని సౌందర్యాంతర్గతములే యగుటచేత రూఢమైన వ్యవహారము సమంజసమనియే భావింప వచ్చును.

లలితా సుందరీ, లాలిత్య సౌందర్య శబ్దముల యేకార్థరూప సంబంధమును గమనించినప్పుడు సహస్రనామ స్తోత్రమందలి శ్రీ లలితా లాలిత్యమే శ్రీ సౌందర్యలహరిగా శంకరులచే ప్రవహింపఁ జేయఁ బడినదని స్ఫురింపకమానదు.

ల. స. నా. స్తోత్రమందలి యనేక శబ్దములు యథాతథములుగను స్వల్పమైన మార్పుతో కూడియును సౌందర్యలహరియందు గోచరించును. అనేక శబ్దము లకు పర్యాయ పదములు కనఁబడును. కొన్ని నామముల యర్థము విస్తరింపఁబడుటయో సంగ్రహింపబడుటయో భాసించును.

శ్రీ శంకరులు ల. స. నామ పారాయణమును ముగించిన వెంటనే సౌందర్యలహరిని రచించుట కారంభించినాడేమో యనిపించును. ల. స నా. స్తోత్ర మందలి చివరి నామము శివశక్త్యైక్య రూపిణీ (1000) అనునది. సౌందర్యలహరిలోని ప్రథమ శ్లోకము "శివః శక్త్యాయుక్తో" యని ఆరంభింప బడినది. శివశక్తుల యోగము భేదరూపముకాదు, ఐక్యరూపమే. ఒకవేళ యోగమెప్పుడును భిన్నవస్తువు లకే యని భావించినచో శివశక్తులకు ఆ యోగమే కలదు కాని యోగము లేదు. శివశక్తుల యోగము వియుక్తులకు కలుగు యోగము కాదని అకార ప్రశ్లేషావకాశము. ఈ శివశక్తుల యోగము నిత్య యోగమే యని ఆకారప్రశ్లేషావకాశము సూచించును. భేదమునే యంగీకరింపని శంకరులు శివశక్తులు భిన్నములని వాని యోగము భేదరూపమని యంగీక రించెద రనుకొనుట యసంభావ్యమగుటచే ఆ నిత్య యోగము భేదరూపము కాదని ఐక్యరూపమే యనియు నీ ప్రశ్లేషావకాశములు వ్యంజింపఁ జేయుచున్నవి.

పారమార్థికమైన ఆ శివశక్త్యైక్యమే శివ శక్తులు ప్రకాశవిమర్శములు. ధర్మి ధర్మములుగ వ్యవహరింపఁబడుచు శివుడు శక్తియుక్తుఁడగుట చేతనే సృష్టించుటకు శక్తుఁడగుచున్నాడు లేనిచో కదలుటకును సమర్థుఁడు కాజాలడు ఇత్యాది సృష్ట్యాది సమస్త వ్యవహారములకును హేతువగుటచే అభిన్ను లైన శివశక్తులయొక్క భేదరూపయోగ వ్యవహా రమునకును హేతువని భావించుట శాంకర సిద్ధాం తాను గుణము.

ఇట్లు శివుడు శక్తిభిన్నుడు గాక శక్తిస్వరూపు డగుటచేతనే సృష్టి యాతనినుండి యేర్పడును. కానిచో కదలికయు కలుగదు. సర్వశక్తి నిలయమైన శివ స్వరూపమగు నా యాదిశక్తినే బ్రహ్మ విష్ణు మహేశ్వరులును ఆరాధించెదరు. అట్టి యాదిశక్తి తనకు గల శక్తు లన్నింటికిని మూలమని గుర్తించి నమస్కరించుటకు గాని స్తుతించుటకు గాని అనేక జన్మార్జిత పుణ్యమువలన గలిగిన చరమ జన్మమునగాని అవకాశము లభింపదు. అను నీ ప్రథమ శ్లోకార్థమునకు శివశక్త్యైక్య రూపిణీ (1000) బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవ సంస్తుత వైభవా (83) శివా రాధ్యా (406) పుణ్యలభ్యా (544) పుణ్యశ్రవణ కీర్తనా (545) నామములు మూలము లనుట స్పష్టము.

శ్రీ శంకరులు నిరంతర మీ స్తోత్రమును పఠించుచుండువారనుటకు నిదర్శనము. ఈ స్తోత్రము నందలి నామములు యథాతథముగ సౌందర్యలహరి యందు కనఁబడుట కాదనరాదు.

తొంబదియొనిమిదవ శ్లోకమున నిస్సీమ మహిమా (429) మహామాయా (215) నామ ములు యథాతథముగ కన్పడును.

గిరామా హుర్దేవీం ద్రుహిణ గృహిణీ మాగమవిదో
హరేః పత్నీం పద్మాం హర సహచరీ మద్రి
తనయామ్

తురీయా కాపిత్వం దురధిగమ నిస్సీమ మహిమా
మహామాయా విశ్వంభ్రమయసి పరబ్రహ్మ మహిషి.

మహామాయయొక్క నిస్సీమ మహిమ దురధిగమముగా విశేషింపబడినది. విశ్వంభ్రమయసి అను పదములు విశ్వభ్రమణకారిణీ (890) నామము యొక్క వ్యాసీకరణములు తురీయా శబ్దము తుర్యా (262) నామముయొక్క పర్యాయము ద్రుహిణ గృహిణీ శబ్దము బ్రహ్మాణీ (822) నామార్థకము హరేః పత్నీం శబ్దములు నారాయణీ (298) నామార్థకములు హరసహచరీమ్ అను పదము మృడానీ (565) నామార్థకము 'గిరామ్' అను బహువచనాంత శబ్దముతో కూడిన దేవీమ్ అను శబ్దమున పరా (366) పశ్యంతీ (368) మధ్యమా (370) వైఖరీరూపా (371) నామార్థములైన చతుర్విధ వాక్కులకు ప్రకాశకము అగు సరస్వతీ (705) వాగ్వాదినీ (350) వాగధీశ్వరీ (641) మహాదేవీ (209) ప్రతిపాద్యయగు మహాసరస్వతీదేవియే ప్రతిపాదింపబడినది. పద్మాశబ్దము మహాలక్ష్మీ (210) నామము నకు అద్రితనయా శబ్దము గౌరీ (636) నామము నకు పర్యాయములు.

ఇట్లీ శ్లోకమునందలి పెక్కు పదములు విడి విడిగా ఆయా నామములను ప్రతిపాదించుట గమనింపబడినది ముక్తముగా కూడ నీ శ్లోకము శారదారాధ్యా (124) కటాక్షకింకరీభూత కమలా కోటి సేవితా (591) శివారాధ్యా (406) నామములచే సూచింపబడిన ముగురమ్మల పూజలనందు మూలపుటమ్మ యగు మహాకామేశ మహిషిని ప్రతిపాదించుట గూడ గమనింపదగినది. ఇట్టివే మరికొన్ని శ్లోకములును.

విశాలా కల్యాణీ స్ఫుటరుచిరయోధ్యా కువలయైః
కృపాధారాధారా కిమపి మధురా భోగవతికా
అవన్తీ దృష్టిస్తే బహునగర విస్తార విజయా
ధ్రువంతత్తన్నామ వ్యవహరణ యోగ్యావిజయతే.

ఈ శ్లోకమునందును కల్యాణీ (324) యోగ్యా (656) విజయా (346) నామములు యథాతథ

ముగ కన్పడును. కాని అమ్మవారికి గాక అవి అమ్మ వారి దృష్టికి విశేషణములుగా కూర్చబడినవి. విశాలా శబ్దము విశాలాక్షీ (937) నామైకదేశమే యని దృష్టి విశేషణత్వమున నిర్ణయించుకొనవచ్చును. ఇంతే గాక స్ఫుటరుచి శబ్దము తేజోవతీ (452) ద్యుతి ధరా (769) నామములను అయోధ్యా శబ్దము సర్వానుల్లంఘ్య శాసనా (996) నామమును కృపా శబ్దము రాజత్కృపా (688) నామమును ధారా శబ్దము ధారాశబ్ద ఘటితములైన సర్వాధారా (660) ధర్మాధారా (885) నామములను మధురా శబ్దము స్వభావ మధురా (916) నామమును భోగవతీ శబ్దము భోగినీ (292) నామమును అవన్తీ శబ్దము రక్షాకరీ (317) నామమును నగర శబ్దము బహు నగర విస్తార విజయా నవాస మధ్యగతమై శ్రీమన్నగర నాయకా (56) నామమును స్పష్టముగ స్ఫురింపజేయును.

క్వణత్కాంచీదామా కరికలభ కుంభస్తననతా
పరిక్షీణామధ్యే పరిణత శరచ్చంద్ర వదనా
ధనుర్బాణాన్ పాశం సృణిమపి దధానాకరతలైః
పురస్తాదాస్తాంనః పురమథితురాహో పురుషికా

ఈ శ్లోకమున రత్నకింకిణికారమ్య రశనాదామ భూషితా (38) రణత్కింకిణిమేఖలా (312) నామములు క్వణత్కాంచీదామగా స్తనభారదల న్మధ్యపట్ట బంధవలిత్రయా (36) నామమందలి ప్రథమార్థము కరికలభ కుంభస్తననతగా తలోదరీ (848) శాతోదరీ (130) నామములు మధ్యేపరిక్షీణగా శరచ్చంద్ర నిభాననా (129) రాకేందువదనా (314) నామములు పరిణత శరచ్చంద్రవదనగా సంగ్రహింపబడి నవి. మూడవ పాదమున రాగస్వరూప పాశాఢ్యా (8) క్రోధాకారాం కుశోజ్వలా (9) మనోరూపేక్షుకోదండా (10) పంచతన్మాత్ర సాయకా (11) నామములు సంగ్రహింపబడినవి. ధనుర్బాణ పాశాం కుశముల యొక్క మనః పంచతన్మాత్రరాగ క్రోధరూపత్వము వ్యాత్రము భావుకుల భావనకు విడువబడినవి. నాల్గవ పాదమున శివదూతీః (405) అతిగర్వితా (509) గర్వితా (857) నామార్థము వివరింపబడినది.

సుధా సింధోర్మధ్యేసుర విటపివాటీ పరివృతే
మణిద్వీపే నీపోపవనవతి చింతామణి గృహే
శివాకారే మంచే పరమశివ పర్యంక నిలయామ్
భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీమ్.

ఈ శ్లోకమున సుధాసాగర మధ్యస్థా (61) అను సమస్తనామము సుధాసింధో ర్మధ్యే అని వ్యస్త భావము భజించినది. చింతామణి గృహాంతస్థా (57) అనునామము చింతామణి గృహే అనురూపు ధరించి నది. కదంబవనవాసినీ (60) అనునామము నీపోపవ నవతి అను విశేషణముగా నవతరించినది. శివకామేశ్వ రాంకస్థా (57) నామము పరమశివపర్యంక నిలయగా పరిణతమైనది. పంచప్రేతమంచాధిశాయినీ (948) నామము శివాకారే (శవాకారే) మంచే అనుపదములుగా మారినది. అంతర్ముఖ సమారాధ్యా (871) నామా ర్థము ధన్యాః కతిచన భజంతి అనుపదములచే ప్రస్తు తింపబడినది.

సృష్టికర్త్రీ (264) బ్రహ్మరూపా (265) గోప్త్రీ (266) గోవిందరూపిణీ (267) సంహా రిణీ (268) రుద్రరూపా (269) తిరోధానకరీ (270) ఈశ్వరీ (271) సదాశివా (272) అనుగ్రహదా (273) పంచకృత్య పరాయణా (274) అను పదునొకండు నామార్థములను క్రమముగ

జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేతత్ స్వమపివ పురీశస్తిరయతి
సదాపూర్వః సర్వంత దిదమను గృహ్ణాతి సశివ
స్తవాజ్ఞా మాలంబ్యక్షణ చలితయో ర్భ్రూలతి కయోః

అను శ్లోకము సూచించుచు పంచబ్రహ్మ స్వరూపిణీ (250) నామార్థమును సమర్థించు చున్నదనుట నిస్సందేహము.

సౌందర్యలహరిలోని సంబోధనాంత పదములకు లలితా సహస్ర నామస్తోత్రమందలి నామములు నామార్థములు ఆధారములనుట పై పరిశీలనమువలన స్పష్టపడును.

ఈ క్రింది నామములు ఈ క్రింది శ్లోకము లలో యథాతథముగ గోచరించును. నిస్సీమ మహిమా (429) మహామాయా (215) : గిరామాహుర్దేవీం (98) (నిస్సీమమహిమ దురధిగమము) కల్యాణీ

(324) యోగ్యా (656) విజయా (346) :
విశాలా కల్యాణీ (49) (దృష్టి విశేషణములు)

ఈ క్రింది నామములు శ్రీదేవి సంబోధనములుగా ఈ క్రింది సంఖ్యలుగల శ్లోకములలో కూర్చబడినట్లు గోచరించును:

జననీ (824) : 39, 17, 28, 32, 51, 64, 76, 77, 87, 103
భవానీ (112) 22.
శివా (53) : 25, 43, 57, 77.
సతీ (821) : 26, 97.
నిత్యా (136) : 30, 33, 102
భగవతీ (279) : 34
పార్వతీ (246) : 81.
అపర్ణా (755) : 56.
శర్వాణీ (125) : 60.
ఉమా (634) : 47, 71, 99.
అంబా (986) 74.
మాతా (458) : 65, 84, 100.

సౌందర్యలహరియందు కూర్చబడిన పై నామముల సంబోధనములు ల. స. నా స్తోత్రమందలి పెక్కునామములను సమాహరించుట ఈ క్రింది విధముగ నూహించుకొనవచ్చును. పది పర్యాయములా వృత్తమైన జనని యను సంబోధనము.

---

జనన్యుత్తర పదములైన మూడు నామములను : ఆబ్రహ్మ కీట జననీ (285) అనేక కోటి బ్రహ్మాండ జననీ (621) వేదజననీ (338)

జగజ్జననీత్వ ప్రతిపాదకములైన మూడు నామములను : వియదాది జగత్ప్రసూః (551) జగతీ కందా (325) విశ్వగర్భా (638)

జగదాది వియజ్జననీత్వ ప్రతిపాదకమైన యొక నామమును : వియత్ప్రసూః (838)

కేవల జననీత్వ ప్రతిపాదకములైన మూడు నామములను మొత్తము పది నామములను : విధాత్రీ (337) సావిత్రీ (700) ప్రసవిత్రీ (825)

త్రిరావృత్తమైన మాతః అను సంబోధనము మాతృ శబ్దోత్తరపద నామములను : శ్రీ మాతా (1) సిద్ధమాతా (474) గోమాతా (606) వీరమాతా (837) విశ్వమాతా (935)

చతురావృత్తమైన శివే యను సంబోధనము శివా శబ్దోత్తర పదనామము నొకదానిని శివార్థక నామములు మూడింటిని మొత్తము నాలుగు నామములను : శ్రీ శివా (999) సర్వ మంగళా (200) మంగళాకృతిః (934) శోభనా (463)

త్రిరావృత్తమైన నిత్యే అను సంబోధనము నిత్యార్థక నిత్యాశబ్దారబ్ధ నిత్యా పర్యాయ రూప త్రివిధ నామములను: నిర్నాశా (180) నిరపాయా (186) నిరత్యయా (187) మృత్యుమథనీ (181) అనాదినిధనా (296) నిత్యాషోడశికారూపా (391) శాశ్వతీ (952)

త్రిరావృత్తమైన త్రివర్ణఘటితమై ఓంకార ప్రతిరూపమైన ఉపమానామముయొక్క ఉమేయము సంబోధనము క్రమముగ త్రిపురాది త్ర్యక్షర్యంత త్రిశబ్దఘటిత సన్నిహిత నామములను, అంబ యను సంబోధనము అంబా పద సంబంధ నామములను :

త్రిపురా (627) త్రిజగద్వంద్యా (628) త్రిమూర్తి (629) త్రిదశేశ్వరీ (630) త్ర్యక్షరీ (631) అంబికా (295) త్రిపురాంబికా (977) డాకిన్యంబా స్వరూపిణి (495) లాకిన్యంబా స్వరూపిణీ (504) సాకిన్యంబా స్వరూపిణీ (521) యాకిన్యంబా స్వరూపిణి (535)

భగవతి అను సంబోధనము భగశబ్దార్థ ఘటితమైన నామము నొకదానిని :

సుభగా (762)

భగశబ్దార్థ వివరణరూపమైన నామము నొక దానిని సమాహరించును :

షాడ్గుణ్య పరిపూరితా (387)

సౌందర్యలహరిలోని 102 వ శ్లోకములోని పెక్కు సంబోధనములు పెక్కుమూల నామములను వర్ణసాదృశ్యమున స్మరింపజేయును.

| | | | |
|---|---|---|---|
| సిదే | : | భక్తనిధిః | (568) |
| నిత్యప్మేరే | : | నిత్యపుష్టా | (567) |
| నిరవధిగుణే | : | గుణనిధిః | (605) |
| నీతివిప్రణే | : | దండనీతిస్థా | (609) |
| నిరాఘాటజ్ఞానే | : | విజ్ఞానఘన రూపిణీ | (253) |

నియమ పరచిత్తైక నిలయే:

| | | |
|---|---|---|
| | సర్వాంతర్యామినీ | (820) |
| | నియంత్రీ | (569) |
| నియత్యానిర్ముక్తే : | విశృంఖలా | (835) |

నిఖిలనిగమాంతస్తుత పదే :

వర్వోపనిష దుద్ఘుష్టా (553)

నిరాతంకే : నిర్వికల్పా (176)

ల. స. నా స్తోత్రములోని ధరసుతా (957) నామమున కెన్ని వేషములు శంకరులచే వేయబడినవో ఈ క్రింది సౌందర్యలహరీ శ్లోక సంబోధనముల వలన తెలియును.

గిరిసుతే (67,78,82,83) హిమగిరి సుతే (6,42) అచల తనయే (76) తుహినగిరికన్యే (12) గోత్రాధరపతికులోత్తంసకలికే (52) తుహిన గిరివంగధ్వజపటే (61) నగపతి పతాకే (73) ధరణి ధరకన్యే (75) ధరణి ధరరాజన్య తనయే (55) అగరాజన్యతనయే (58)

మఱికొన్ని సంబోధనములు మఱికొన్ని నామములు సౌందర్యలహరీ లలితాసహస్రనామ స్తోత్రములకు గల సన్నిహిత సంబంధమును తెలియజేయును.

| | | |
|---|---|---|
| (53) ఈశానదయితే | : | శివప్రియా (409) మృడప్రియా (211) |
| (54) పశుపతి పరాధీన హృదయే | : | శివపరా (410) |
| (19) హరమహిషి, (98) పరబ్రహ్మ మహిషి | : | మహాకామేశ మహిషీ (233) |
| (35) శివయువతి | : | శాంభవీ (122) శాంకరీ (126) |
| (72, 80) దేవి | : | మహాదేవి (209) |
| (89) చండి | : | చండికా (756) |
| (97) సతిసతీనామచరమే | : | సదాశివ పతివ్రతా (710) సాధ్వీ (128) |
| (91) చారు చరితే | : | దురాచార శమనీ (194) సదాచార ప్రవర్తికా (356) |
| (62) సుదతి | : | శుద్ధవిద్యాంకురాకార ద్విజపంక్తిద్వయోజ్జ్వలా (25) |

ఈ క్రింది 32 వ శ్లోకము లోపాముద్రోపాసిత పంచదశాక్షరహాది విద్యను బోధించుటద్వారా లోపా ముద్రార్చితా (648) నామమును వ్యంజింపఁజేయుటయేకాక బీజసంకేతములద్వారా ఈ క్రింది నామములను సైతము స్ఫురింపఁజేయును.

| | | | |
|---|---|---|---|
| శివః | (హ) | శివా | (53) |
| శక్తిః | (స) | పరాశక్తిః | (573) |
| కామః | (క) | కామకోటికా | (590) |
| క్షితిః | (ల) | ధరా | (956) |

అథ శబ్దము వాగ్భవకూట సమాప్తి పూర్వకముగా మధ్యకూటారంభమును బోధించుటచే శ్రీ మద్వాగ్భవకూటైక స్వరూప ముఖ పంకజా (85) కంఠాధః కటి పర్యంత మధ్యకూట స్వరూపిణీ (86) నామార్థములను వ్యంజింపఁజేయును.

| | | | |
|---|---|---|---|
| రవిః | (హ) | రవిప్రఖ్యా | (597) |
| శీతకిరణః | (స) | రాజ్ఞీ | (306) |
| స్మరః | (క) | కామసేవితా | (588) |
| హంసః | (హ) | మిత్రరూపిణీ | (506) |
| శక్రః | (ల) | సహస్రాక్షీ | (283) |

తదను శబ్దము శక్తి కూటారంభమును సూచించుటచే శక్తికూటైకతా పన్న కట్యధో భాగ ధారిణీ (87) నామమును వ్యంజింపఁజేయును.

| | | | |
|---|---|---|---|
| పరా | (స) | పరా | (366) |
| మార | (క) | రతిప్రియా | (316) |
| హరయః | (ల) | వజ్రిణీ | (945) |

అమీహృల్లేఖాభిస్తిస్రుభిరవసానేషు ఘటితాః అను నాల్గవపాదము ఈమూడు కూటములు హ్రీంకారముతో ముగియునని బోధించుచు హ్రీంకారీ (301) త్రికూటా (589) నామములను స్ఫురింపఁజేయును. మొత్తము మీద నీ శ్లోకము మూలమంత్రాత్మికా (88) మూలకూటత్రయ కళేబరా (89) నామార్థమును వివరించును. ఈ శ్లోకము మొదటి శివశక్తి కామపదములు క, ఏ, ఈ అను కాదివిద్యా ప్రథమాక్షర త్రయమునకు బోధకములను సంప్రదాయము కూడ కలదు ఈ సంప్రదాయము ననుసరించినచో ల. స. నా స్తోత్రమునందలి త్రికూటములను బోధించు పై నాల్గు నామములలో వాగ్భవకూటము మాత్రమే శ్రీమత్ అని విశేషింపబడుటచే గుప్తషోడశియగు ఈకాదము గూడ గుప్తముగ ప్రశ్లేషింపఁబడినదని భావింపఁబడవచ్చును. హాది విద్యకన్న కాది విద్య శ్రేష్ఠమని 'శ్రీ విద్యైవతు మంత్రాణాం తత్రకాదిర్యథాపరా' అని ల. స. నా స్తోత్ర పూర్వపీఠిక తెలియఁ జేయుచున్నది.

ఈ క్రింది 33 వ శ్లోకము అగస్త్యోపాసితమైన యీ కాది విద్య నుద్ధరించు చున్నది.

స్మరం యోనిం లక్ష్మీం త్రితయమిదమాదౌ తవ మనో
ర్నిధాయైకే నిత్యేనిరవధి మహా భోగ రసికాః
భజంతి త్వాం చింతామణి గుణనిబద్ధాక్షవలయాః
శివాగ్నౌజుహ్వంతః సురభి ఘృతధారాహుతి శతైః

ఇందలి స్మరయోనిలక్ష్మీ పదములు క, ఏ, ఈ అక్షరములకు సంకేతములు మిగిలిన అక్షరముల విషయమున హాది కాది విద్యలలో భేదములేదు. కావున నవి యిందుద్ధరింపఁ బడలేదు. కాది విద్యను జపించు ఫలమిందు చెప్పఁబడుటచే హాది విద్యాఫలము చెప్పఁబడకపోవుటచే కాది విద్యయొక్క పరత్వము శంకరులకును అభిప్రేతమని స్పష్టమగుచున్నది.

సంప్రదాయాంతరము ననుసరించి 32 వ శ్లోకమే కాది విద్యోద్ధారకమగుటచే నీ శ్లోకమున స్మరలక్ష్మీయోని పదములు క్లీం హ్రీం శ్రీం అను బీజాక్షరములను బోధించునని వానిని కాది విద్యాది యందుజేర్చి జపించుట ఫలప్రదమన్నట్లుగా కూడ వ్యాఖ్యానింప వచ్చును.

ఈ పంచ దశాక్షర మంత్రమునకే చివఱ శ్రీం అను బీజమును జేర్చి షోడశాక్షర మంత్రముగా మార్చుట లక్ష్మీధర పండిత సమ్మతము. కాని పూజ్యులు శ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మగారు వాగ్భవ కూటమందే నాలవ ఈం కారము కలదని అదియే పదునాఱవ యక్షరముగా నీ మంత్రము షోడశయైనదనియు భావించిరి.

ల సి నా. స్తోత్రమున వాగ్భవకూటమే శ్రీమత్ అని విశేషింపఁబడుట చేతను 'పద్మినీ మీం శరణ మహం ప్రపద్యే' అను శ్రీ సూక్త శ్రుతిమంత్రము నీం ప్రాధాన్యమును బోధించుట చేతను పై భావనకు ప్రామాణికత చేకూర్చుచున్నది.

ఎట్లైనను ఈ శ్లోకము శ్రీ విద్యా (576, షోడశాక్షరీ విద్య (577) నామార్థములను వివరించు ననుటలో విప్రతి పత్తిలేదు. ల. స. నా స్తోత్ర మందల్లి సంప్రదాయేశ్వరీ సాధ్వీ గురుమండలి రూపిణి అనుశ్లోకార్థమున సామాన్యముగా స్ఫురింపనట్టి 'ఈ' గూఢముగా కలదని సాధు (712) ఈ (713) నామద్వయపరముగా సాధ్వీశబ్దమును వ్యాఖ్యాకారులు వ్యాఖ్యానించినారు అందుచేతనే కాబోలు ఈ గుప్త షోడశి ఈ శ్లోకమునను గుప్తముగానే యుంచఁబడిన దని ఒకే ఒక ఈం కారము తప్ప రెండుమూడు ఈం కారములు లేకపోవుటచేత నిశ్చయించుకొనవచ్చును.

—(సశేషము)



కలగూరగంప :

# "అవంతి" సమీక్ష అన్యాయంగా వుందా?

(విరసం ప్రస్తుత కార్యదర్శి శ్రీ త్రిపురనేని మధుసూదనరావుగారు 'కవిత్వం—చైతన్యం' అనే గ్రంథం వ్రాసేరు. ఈ ఏడాది మార్చినెల భారతి సంచికలో ఆ గ్రంథంమీద శ్రీ 'అవంతి' సమీక్ష వ్రాసేరు. జూన్ నెల భారతి సంచికలో శ్రీ త్రిపురనేనివారు 'అవంతిగారి అన్యాయమైన సమీక్ష' అని వ్యాసం వ్రాసేరు.

దీనిలో ఆ వ్యాసాన్ని పర్యాలోచిస్తున్నాం.)

'కవిత్వం—చైతన్యం' పుస్తకం మొదటి పుటలోనే 'విప్లవకవికి స్పష్టమైన వర్గ చైతన్యం అవసరం' అని శ్రీ త్రిపురనేని మధుసూదనరావుగారు వ్రాసేరు. దానినిచూసి, ఆ వర్గం కార్మికవర్గం అని వూహకు వదిలేకన్న స్పష్టంగా చెప్పడం మంచిది—అని శ్రీ 'అవంతి' సూచించారు.

దానిని ఆరోపణగా తీసుకొని శ్రీ మధుసూదన రావుగారు 'శ్రామికవర్గమనీ, పీడితులనీ, నగరంలో కార్మికులు, పల్లెల్లో రైతుకూలీలనీ అనేక సందర్భాలలో 'వర్గం' అంటే ఎవరో స్పష్టంగా వ్రాశాను'—అన్నారు. దాని తర్వాత 'రైతు కూలీలు, విద్యార్థులు, యువకులు, చివరకు బూర్జువాల్లో ఒక భాగం కూడా విప్లవవర్గం కావచ్చు' నన్నారు.

మార్క్సిస్టు తత్వశాస్త్ర దృష్టిలో వర్గానికి ఒక ప్రత్యేకమైన నిర్వచనం వుంది. యువకులు, విద్యార్థులు, పీడితులు అనబడే జనసందోహాలకు 'వర్గం' అనే పదం చెల్లదు. అదొకటి.

రెండోది—నగరంలోని కార్మికులు (పరిశ్రమలలో పనిచేసేవారు అనే వుద్దేశంతో), రైతు కూలీలను మార్క్సిజం ఒకే శబ్దంక్రింద చేర్చదు. కార్మికవర్గానికి విప్లవ నాయకత్వం వుండాలని మార్క్సిస్టులు చెప్పడానికి కారణం వుంది.

ఆ వర్గానికి ప్రవృద్ధ ఆర్థిక వ్యవస్థతో, పెద్దయెత్తున యంత్రాలతో జరిగే వుత్పత్తితో సంబంధం వుంది. దానికే వుత్పత్తి సాధనాలమీద అణుమాత్రం యాజమాన్యం లేదు. అందుచేత వ్యక్తిగత ఆస్తిని నిలబెట్టాలనే ఆసక్తి దానికే మాత్రం వుండదు. దాని పని స్వభావంలోనే సమైక్యతకు, నిర్మాణానికి, క్రమశిక్షణకు అలవాటుపడి వుంటుంది. అందుకే 'పెద్దతరహా వుత్పత్తి విధానంలో నిర్వహించే ఆర్థిక పాత్రదృష్ట్యా ఒక్క కార్మికవర్గమే దోపిడికి గురి అవుతున్న శ్రమజీవి ప్రజలందరికీ నాయకత్వం వహించగలదు'—అన్నారు, లెనిన్.

రైతు కూలీలది క్షీణమాన గ్రామీణ ఆర్థిక విధానంతో సంబంధం. వారికి ఉత్పత్తి సాధనాలమీద యాజమాన్యంలేదు. వున్నా స్వల్పం. కాని, వారివునికి, పని యావత్తూ చిన్న చిన్న పరికరాలతో జరిగే వుత్పత్తి విధానం మధ్య. అందుచేత వ్యక్తిగత ఆస్తి మమకారం అక్కడ రద్దుకాదు. వారి పని పద్ధతులే ఐక్యత, నిర్మాణం, క్రమ శిక్షణ అలవాటు కావడానికి ఆటంకాలు.

ఈ రెండు వర్గాల కలయిక, మైత్రి సోషలిస్టు విప్లవ విజయానికి ఆవశ్యకం అని గుర్తిస్తూ మార్క్సిజం కార్మిక వర్గానికి విప్లవ నాయకత్వం వుండాలంది. అది కూడా శ్రీ మధుసూదన రావుగారు చెప్పినట్లు 'అంతిమంగా' కాదు. 'అంతిమంగా' అయితే ఈవేళ మనదేశంలో వున్న పరిస్థితులే ఫలితం!

అందుచేత 'అవంతి' గారి సూచనను నేను తప్పుపట్టను.

రెండో అంశంమీద శ్రీ త్రిపురనేని వారి ధోరణివాల అభ్యంతర కరంగా వుంది.

"సాహిత్య దృష్టితో రచన ఎంత కళాఖండమైనా సాంఘిక దృక్పథం లేనప్పుడు అది అధమ రచనే అవుతుంది" (పుట 6) అన్న శ్రీ మధుగారి అభిప్రాయాన్ని స్వీకరించేరు, 'అవంతి'. అయితే సూత్రీకరణలో మధుగారు వుపయోగించిన 'విప్లవ ప్రభావం', 'విప్లవరచన' మాటలలోని 'విప్లవ' పదం విశేషార్థం ఇవ్వదన్నారు.

దానిని వ్యతిరేకిస్తూ "సామాజిక దృష్టి కలిగి కళాత్మకంగా వుండాలనే వాదానికీ, విప్లవ దృష్టి కలిగి కళాత్మకంగా వుండాలనే వాదానికీ తేడా లేదా?"—అని కామ్రేడ్ త్రిపురనేని ముదలకిస్తున్నారు.

అంటే గ్రంథంలో "సాంఘిక దృక్పథం" కావాలన్నమాటను వారే సమాధానంతో 'విప్లవ దృష్టి'గా మారుస్తున్నారు. "సాంఘిక దృక్పథం" అంటే అర్థం 'విప్లవ దృష్టి'యా? శ్రీ మధుగారు తమ వ్యాసంలోనే కొంచెం ముందుకెళ్లాక (జూన్ భారతి—పుట 63, కాలం 2) "నా వ్యాసాలు ఇంతకు పూర్వం ఆధునిక సాహిత్యంలో ప్రచారమై వున్న సామాజిక దృష్టికి భిన్నమైన విప్లవదృష్టిని, శాస్త్రీయ సామాజిక దృష్టిని ప్రతిపాదించినవే"—అన్నారు. సాంఘిక దృక్పథానికి విప్లవదృష్టి అనే అర్థం దానిలో భాగనే అయితే చాలా కష్టం! ఇటువంటి అవగాహన లేని వాబోటిగాళ్లు— 'అసలు పుస్తకం, దానిమీద 'అవంతి' గారి విమర్శ దగ్గర పెట్టుకు ఎవరు చదువుతార'నే ధైర్యంతో శ్రీ మధుసూదనరావుగారు చిత్తం వచ్చినట్లు వ్రాసేరనే భయపడే అవకాశం వుంది. రచయిత లెవరికీ అటువంటి పరిస్థితి ప్రతిష్ఠాకరంకాదు.

ఇంక 'శ్రామిక సంస్కృతి' గురించి శ్రీ మధుగారిచ్చిన సమాధానం, వివరణ సరికాదు. సంస్కృతి అంటే ఏమిటి?

'All the material and spiritual values and the means of creating, utilising and passing them on, created by society in course of history.'

ఇది Dictionary of philosophy లో culture అనే పదానికిచ్చిన నిర్వచనం. మనం 'సంస్కృతి' పదాన్ని culture అనే అర్థంలో వాడుతున్నాం. అనువదిస్తున్నాం. అందుకే 'అవంతి' గారు ఆ పదాన్ని పుస్తకంలో వుపయోగించిన పద్ధతికి అభ్యంతరం చెప్పేరు.

శ్రీ మధుసూదనరావుగారు ఈ సమస్యమీద ఇచ్చిన వివరణ ['శ్రామికుల భౌతిక జీవితం వాళ్ల మనస్సులో Reflect అవుతుంది అదేవాళ్ల సంస్కృతి... భాష సంస్కృతిలో ప్రధానాంగం"] చూస్తేవారు Consciousness అనేదాన్ని సంస్కృతిగా అనువదించేరా అనిపిస్తోంది.

'Consciousness takes its origin in the labour, socio productive activity of people and is closely connected with the appearence of language which is as old as conciouness.'

(Dictionary of Philosophy)

చైతన్యం అనేపదంతో వ్యవహరిస్తున్న ఈ భావాన్ని, రూఢార్థం గల మరోపదంతో వుపయోగించి ఇదేమిటని అడిగిన వారిమీద దాడి చెయ్యడం విజ్ఞతకాదు.

ప్రజలు అనేమాటను రెండు సామాన్యార్థంలో విశేషార్థంలో రెండు విధాలుగా వుపయోగిస్తారు. శ్రీ మధుగారు ఈ రెండర్థాలలోనూ విచక్షణా రహితంగా ఆపదాన్ని తమ వ్యాసంలో వుపయోగించేరు. ఇక్కడ 'అవంతి' గారి అభ్యంతరం 'చైతన్యం, విద్యాబోధన' గురించికాదు. "శ్రామిక సందోహమే ప్రజలు"—అన్న సూత్రీకరణకి గాని.

"చారిత్రక దశనుపట్టి వ్యవస్థను మార్చడానికి విభిన్నవర్గాల ప్రజలు కలిసి పోరాటం చేయడం వుంది."—అని శ్రీ మధుసూదనరావుగారు తమ సమాధానంలో వ్రాసిన వాక్యం గ్రంథంలోని పై సూత్రీ

కరణను ప్రత్యాఖ్యానం చేస్తూన్నా. "నా సూత్రీకరణ సరియైందే కదా"—అని ప్రశ్నిస్తున్నారు. ఏమనుకోవాలి? వారు తమ వ్యాఖ్యానం, వివరణలో తమ సూత్రీకరణను వమలుకొన్నారు. దిద్దుకొన్నారు.

అలాగే 'విప్లవ కవిత్వం—సాంస్కృతిక పోరాటం' అన్న తమ వ్యాసంలో "విప్లవ కవికి సాంస్కృతిక పోరాటమే ఆచరణ" అనే కీలకవాక్యాన్ని అవంతి వదిలేరంటున్నారు. ఆ ప్రత్యేక వాక్యం ఇవ్వకపోయినా, అంతకన్న నిర్దిష్టంగా చెప్తున్న వాక్యాల్ని "విప్లవ సిద్ధాంత దృక్పథం లేకుండా విప్లవ కవిత్వం వుండదు. 'విప్లవ కవికి ఆచరణ సిద్ధాంతం కలిసేవుంటాయి"— అంటూ వుదాహరించేరు, ఆయన.

శ్రీ మధు...కీలకం అనుకొన్న వాక్యంలోని భావం శ్రీ అవంతి వుదాహరించిన పై వాక్యాలకు విరుద్ధం. ఆ వాక్యభావాన్ని ఇంకా విశదంగా చెప్తున్న వాక్యాల వుదాహరణ నివ్వేక ఆ వైరుధ్యం ఎటువంటిదో, అది ఎందుకు వచ్చిందో స్పష్టం చేసేరు.

మార్క్సిస్టు ప్రవక్తలు ప్రచార ప్రబోధాలలో సాహిత్యానికి తక్కువ స్థానం ఇవ్వలేదు. అయితే దైనందిన పోరాటాలు, ప్రజా సమీకరణ, నాయక వర్గ నిర్మాణం, వుద్యమ సమైక్యతలకూ చైతన్య స్ఫూర్తికి దానిని సాధనంగా వుపయోగించుకొన్నారు.

కాని, శ్రీ త్రిపురనేని వారు "కేవల ఆర్థిక పోరాటాలా, ఢిల్లీ ప్రదర్శన" వంటివి అని ఒక చోటా, "ఎన్నికల ద్వారానో, రాజ్యాంగం బద్ధంగానో, సమ్మెల ద్వారానో" అని వేరొకచోటా సాయుధ విప్లవ ఇతర పోరాట రూపాల్ని నిరసించేరు. ఇతరేతర పద్ధతుల ద్వారా మాత్రమే విప్లవం వస్తుందని ఏ కమ్యూనిస్టులో అంటున్నట్లు అవ వ్యాఖ్యానం చేస్తూ సాయుధ పోరాట రూపానికే మార్క్సిస్టులు ప్రాముఖ్యం ఇవ్వాలంటున్నారు.

అసలా వాదం తప్పు అనేది అల్లా వుండగా ఒక ప్రశ్న.

సాయుధ పోరాట రూపానికి ప్రాముఖ్యం ఇవ్వడం అంటే—

ఆ పోరాటంలో పాల్గొడమా?

లేక పాల్గొమని చెప్పడం చాలా?

శ్రీ త్రిపురనేని వారు 'విప్లవ కవికి విప్లవ కారుని వేషం "అనవసరం" అని వాగ్దానం చేసేసేరు. అంటే వస్తే బాతాఖానీగాళ్లు విశుద్ధ విప్లవకారు లన్నమాట.

"కవిత్వం విప్లవాన్ని సృష్టిస్తుందనే భ్రమలు ఎవరికీ వుండవలసిన అవసరంలేదు" (జూన్ భారతి—పుట 65–కాలం 1) అంటున్న శ్రీ మధుగారు పై అభిప్రాయాలను ఎల్లా తెలుప గలుగుతున్నారు? ఎందుకు తెలుపుతున్నారు.?

కార్మికోద్యమంలో, కమ్యూనిస్టు పార్టీ వుద్యమంలో, తెలంగాణా రైతు పోరాటాల వుద్యమంలో కార్యకర్తనుగా నా కనుభవం వుంది. మాకెప్పుడూ కవుల లోపం పెద్దగా కనిపించలేదు. నిరక్షరాస్యులయినా, వుద్యమాలలో పాల్గొంటున్న జనమే పాటలు కట్టేవారు. సృజన పత్రికవారు వేసిన 'తెలంగాణా పోరాట పాటలు' వానికో చిన్న వుదాహరణ. అందుచేత సాయుధ విప్లవానికీ సాహిత్యానికీ మధ్యవుండే సంబంధం తెలుసుకోక పోవడం శ్రీ మధుగారి ఆలోచనలకు మూలం అన్న రెండో కారణం సహేతుకం గాని కృతక వాదంకాదు.

విప్లవ కవులు తరుచు లెనిన్ వ్రాసిన గెరిల్లా పోరాటం వ్యాసాన్ని వ్యవహరిస్తారు. కాని దానిలో ఆయన సాయుధ, సాయుధేతర పోరాట రూపాలు వేటినీ నిరాకరించరాదనీ, పోరాటమే దాని రూపాన్ని ఎప్పటి కప్పుడు, ఎక్కడికక్కడ నిర్ధారణ చేస్తుందనీ చెప్పిన దానిని పట్టించుకోరు. సాయుధ పోరాట రూపమే అనుసరణీయ మంటారు. పోనీ అంగీకరిద్దాం. మళ్లీ పై ప్రశ్నే మరోరూపంలో వస్తుంది.

ఆ సాయుధ విప్లవంలో విప్లవ కవుల పాత్ర ఏమిటి? విప్లవకారుని వేషం అనవసరం అవడం

సరైనదా? "మేయబోతే ఎడ్లలోకీ, దున్నబోతే దూడల్లోకీ" అన్నట్లులేదా ఇది? అందుకే "అజ్ఞాతంగా అంకురించిన ఆత్మరక్షణాధ్యవసాయం" మరో కారణం అన్న అవంతి వాక్యం సాధికారంగానే కనిపిస్తొంది.

ఇంకా చాలా వ్రాయవలసినవి వున్నాయి. వ్యాస విస్తర భీతితో ఇక్కడికే ఆపుతున్నా.

**ఇంతకీ తేలిందేమిటి?**

1 వర్గం గురించి మధు...గారికి సరియైన మార్క్సిస్టు అవగాహనలేదు.

2 గ్రంథంలో వున్న పదాన్ని వొదిలి, ప్రతి సమాధానంలో వేరు పదం వుపయోగించి తమ వాదం సరిగ్గానే వుందని డబాయిస్తున్నారు.

3 తమ స్వాతీకరణకు ప్రత్యక్ష విరుద్ధమైన వివరణ నిస్తూ ఆ స్వాతీకరణ సరిగ్గానే వుందనే వ్యాఖ్య చేస్తున్నారు.

4 ప్రాచుర్యంలో వున్న పదాలనూ, అర్థాలనూ తామే తారు మారుచేసి, గంద్రగోళంగా వ్రాసి వానిపై విమర్శలకు అన్యాయం ఆరోపిస్తున్నారు.

5 అన్నింటికన్నా ముఖ్యమైనది—మార్క్సిస్టు సిద్ధాంతానికి సర్వ విధాలా నష్టకరమైన ఆలోచనా విధానాన్ని సమర్థిస్తూ; దానికి గల భౌతిక కారణాలను కప్పి పెట్టుకుంటున్నారు.

తాము చెప్పదలచుకొన్నదీ, చెప్పవలసిందీ చెప్ప లేక విమర్శకులు తమ భావాన్ని గ్రహించలేకనడం, తప్పుగా సాగలాగే రనడం, "ఆధునిక విమర్శతో తగినంత పరిచయం లేద"నడం పరిపాటే. కాని విమర్శ వచ్చేక ఒక్కమారు తిరిగి చూసుకోవడం మంచిది.

—శ్రీ టి. ఎల్. నరసింహారావు



# గ్రంథ విమర్శలు

## శ్రీమద్భగవద్గీతా ఆంధ్రానువాదము

[వ్యాఖ్యాత మహాస్వామి ఆదివరాహాచార్యులు—ప్రతులకు: డిటో c/o వైద్య శ్రీ గ్రంధే రఘురామ గుప్త, పి. బి. నెం, 26 మార్కాపురం (ఒంగోలు జిల్లా) క్రౌను $\frac{1}{4}$ పే. 304 లు, వెల రు 8—00 లు.]

ఇది భగవద్గీతకు మఱియొక తాత్పర్యము, వ్యాఖ్యము. గ్రంథములో ప్రతి శ్లోకమునకు తాత్పర్యమునేగాక తరుచుగా స్వీయ సమీక్షను గూడ ఇచ్చుచు వచ్చినారు. ఆస్వీయ సమీక్షలు చర్విత చర్వణముగా గాక తరుచుగా స్వతంత్రములై యుండుట విశేషము. కాని ఆ సమీక్షలు ఆదరణ యోగ్యమైన స్ఫూర్తిని కలిగింపక పాఠకులకు వేడుక మాత్రము కలిగించునవిగా ఉన్నవి. ప్రథమాధ్యాయము నుండియే ఉదాహరింతుము.

ఆ అధ్యాయములో దుర్యోధనుడు ద్రోణాచార్యులతో చెప్పిన వాక్యములు ప్రసిద్ధములే ఐనను చివరి రెండు శ్లోకములు ఉదాహరించుచున్నాము.

'అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభి రక్షితమ్
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభి రక్షితమ్.
అయనేషుచ సర్వేషు యథా భాగ మవస్థితాః
భీష్మమేవాభి రక్షంతు భవంత స్సర్వ ఏవహి.'

వీనిలో మొదటి శ్లోకములోని 'అపర్యాప్తం' అను శబ్దమునకు పూర్వాచార్యులు 'విస్తారమై యున్నది—చాలకున్నది' అని విరుద్ధార్థము లిచ్చివర్లె 'పర్యాప్తం' అను శబ్దమునకు అందుల కనుకూలముగా 'సర్వసమర్థమై యున్నది — చాలియున్నది' అని రెండర్థము లిచ్చి ఆయా యర్థముల కనుకూలముగా వ్యాఖ్యానించియున్నారు. ఆ శబ్దములకున్న అర్థభేదమునుబట్టి వ్యాఖ్యాతలు భిన్నార్థములు గ్రహించినారు కాని ఈ గ్రంథకర్త అనువాదములో 'అపర్యాప్తం' అను దానికి 'యుద్ధమునకు సంసిద్ధమై యుండలేదు' అనియు 'పర్యాప్తం' అను దానికి 'యుద్ధమునకు సంసిద్ధమై యున్నది' చేసిన స్వతంత్రానువాదము బుద్ధిమంతుల కాశ్చర్యము కలిగింపక మానదు. మొదటి శ్లోకములోనే రెండు సైన్యములు యుద్ధమునకు కూడియున్నవని కలదు. రెండు పక్షములందును సర్వసేనాధిపతులు ఉపసేనాధిపతులు నిర్ణయింపబడి వ్యూహ రచనతో ఎదురెదురుగా యుద్ధము చేయుటకు నిలిచి యున్నారు. కావున ఒక పక్షము సిద్ధముగా నుండుటయు ఒకటి సిద్ధముగా లేకుండుటయు అసంభావ్యము.

పై శ్లోకములో రెండవ దాని తర్వాత గ్రంథకర్త స్వీయ సమీక్షలో నిట్లు వ్రాసినారు.

'వీరందరు భీష్ముని రక్షింపుడని చెప్పినందున భీష్ముడు కర్ణుడర్ధరథుడని పేర్కొనినాడను సమాయుతో, శాపముచేత కర్ణుడెట్లు వ్యర్థవిక్రముడై యర్ధరథుడుగా జేయబడినాడో, శిఖండితో పోరాడజాలని భీష్ముడును సంతతదేయని భీష్మునది క్షేపించినట్లు, పై విషయముల బరామర్శించిన స్పష్టమగుచున్నది!'

ఆ తర్వాతి శ్లోకమైన 'తస్య సంజనయన్ హర్షం ప్రతాపవాన్' అనుశ్లోక సమీక్షలో 'ఇందు భీష్ముని విశేషణములచేత నన్ను వీరారు రక్షింపగల్గుదురా యను భీష్ముని ధీరత్వమును...కర్ణుడు యుద్ధమునందులేని కొఱత కనుబడునట్లు పోరు నడిపెదనను నభిప్రాయములు సూచితము లగుచున్నవి.' అని కలదు

ఆ పిమ్మట కౌరవవీరులు పాండవ వీరులు శంఖములను పూరించిరను భాగము చివర సమీక్షలో

'శిఖండి ద్రుపదుడును మొదలగు పాంచాలురు కురు పాంచాల ద్వేషముచేత భీష్ముని ద్వేషించువారైనను భీష్ముని గౌరవార్థముగా శంఖముల పూరించిరి' అని వ్రాసిరి.

గ్రంథకర్త స్వతంత్ర సమీక్ష ఈ విధముగా సాగినది. అప్పుడు కురుపక్షముననున్న యోధులలో అప్రతిమానుడు భీష్ముడు కనుకనే అతనికి సైన్యాధిపత్య మీయబడినది. అతడు శిఖండితో పోరాడలేని వాడుకాడు, పోరాడనివాడు. ఇక్కడ శిఖండి ప్రస్తావమే లేనందున దుర్యోధనునికి అసూయగాని అధిక్షేపించు నుద్దేశముకాని ఆరోపించుట సమంజసము కాదు. కురుపాంచాలద్వేష మున్నదనుట వాస్తవము కాదు. పాంచాలురతో ద్వేషమున్నది ద్రోణునికి ద్రోణపుత్రునికి. ఒకవేళ ద్వేషమున్నచో పాంచాలురు భీష్ముని గౌరవార్థముగా శంఖములు పూరించిరనుట యుక్తిసహముకాదు. ముందు భీష్ముడు సింహనాదము చేసి శంఖము పూరింపగా తక్కిన కౌరవవీరులు శంఖములు పూరించిరి. అది విని పాండవపక్ష వీరు లందరును - పాంచాలురందరును మాత్రమే కాదు— శంఖములు పూరించిరి. శంఖములు పూరించుట ఉత్సాహ సూచకముగాని గౌరవ సూచకము కాదు.

ఈ విధముగానే గ్రంథమంతయు విచిత్రమైన స్వీయ సమీక్షలతో సాగినది.

25 వ శ్లోకము సమీక్షలో గుడాకేశ హృషీకేశ శబ్దముల ప్రయోగౌచిత్యమును చక్కగా వివరించి 'ఇందు దేవుడు ఇంజను నందుండు దీపము వంటివాడు. జీవుడు డ్రైవరు వంటివాడు' అని ఉపసంహారము చేయుట జనాకర్షణమునకు ఉద్దేశించియుండవచ్చును గాని హృద్యముగా లేదు.

ఇట్లు భగవద్గీతను గతానుగతికముగా వ్యాఖ్యానింపక స్వతంత్రముగా సమీక్షలు చేయుచు పోవుట ఈ గ్రంథమం దంతటను కానవచ్చు విశేషము. ఈ స్వతంత్ర సమీక్షలు తర్కసహముగా ఉన్నవా లేవా అను నది వేరు విషయమగు గాక! అయినను గ్రంథకర్త స్వాతంత్ర్యమును ధైర్య సాహసములను అభినందింపక తీరదు.

గ్రంథాంతమందు 18 పద్యములలో 18 అధ్యాయముల అర్థ సంగ్రహము నిచ్చినారు. గ్రంథాదిలో ఈ గ్రంథమును 8 కంద పద్యములలో శ్రీనివాసునకు కృతిసమర్పణము చేసినారు. మొదటి పద్యము నాల్గవ పాదము 'ఆశ్రితార్థ' అనియు, 3 వ పద్యము 2 వ పాదము 'వాసవాధి' ఇత్యాదిగా ప్రారంభమై గణభంగములతో నున్నది. తక్కిన పద్యములుగూడ ఛందో దోషములతో కూడియున్నవి. గ్రంథాంతమందలి సమవృత్తములలో అన్ని ఛందో భంగములు పడలేదు. ఇట్టి పద్యరచన గ్రంథ గౌరవమునకు దోహదము చేయజాలదు.

గ్రంథాదియందు శ్రీ కుమార ఆదివరాహాచార్యులుగారు 69, పేజీలలో ఉపోద్ఘాతము వ్రాసినారు. అందులో మన దేశములో ప్రబలిన షణ్మతములను శంకర రామానుజ మాధ్వాచార్యుల మతము లనేకాక అధునాతనములైన ఆర్యసమాజ బ్రహ్మసమాజములను గూడ సమీక్ష చేసినారు. మొత్తము మీద అందులో శ్రీ మద్రామానుజ వైష్ణవమందు అభిమానము కనబడుచున్నను వారి సిద్ధాంతములు కూడ అక్కడక్కడ ఖండింపబడినవి. మొత్తముమీద దేని సమీక్షయు ప్రామాణికముగా కనబడలేదు. అందులో ఎంత సరసమైన భాష ప్రయోగింపబడినదో తెలుపుటకు చివరినుండి 4 వ పేరాలోని ఈ క్రింది వాక్య భాగము చాలును.

'నిరాకారము నిర్గుణము నగు అంతర్యామి స్వరూపముతో ప్రపంచమునందు వ్యాపించియున్నాడని తెలియజాలని దుష్టుల మాయావాదముల నాక్షేపించి యున్నారు.'

ఈ గ్రంథాదిలో 'శ్రీనివాస ప్రసాదము' అను శీర్షిక క్రింద గ్రంథ ముద్రణమునకు రాజకీయ సహాయము పొందలేక పోయినందుకు బాధ వెల్లడిచేసి శ్రీమంతుల సహాయముచేత ముద్రించితిమని సెలవిచ్చిరి. శ్రీ తిరుపతి దేవస్థానం ఎక్స్పర్ట్ కమిటీ వారు దీనిని ముద్రించుటకు అంగీకరింపలేదట. ఆ కమిటీవారి నిర్ణయము మొత్తముమీద—వారు పైకి

చెప్పిన కారణ మెట్లున్నను—న్యాయ సమ్మతమనియే మాకును తోచినది.

— శ్రీ నోరి నరసింహశాస్త్రి

## నృత్త రత్నావళి

(సంస్కృతము—తెనుగులిపి — జాయసేనాపతి విరచితము. శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి ఆంధ్రీకరణముతోను, డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావుగారి పీఠికతోను, ప్రాచీన దేవాలయ శిల్ప చిత్రములతోను, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక 'అకాడమీ వారి ప్రచురణ, రాయలసైజు, ఐదునూరుల పుటలు, క్యాలికోజైండు రు 25—00 కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు 4.)

సంస్కృతము మన భారతీయ భాషలకు తల్లి వంటిది. సకల శాస్త్రములకుగని, సకల భారతదేశమునకును కొన్నివేల యేండ్లుగా ఉమ్మడి భాష. మన పూర్వులు సకల శాస్త్రములను, కళలను, విద్యలనుగూర్చి గ్రంథరాజములను అందులో వ్రాసియుంచిరి. పైగా జ్ఞాపకముంచుకొనుటకును, పాఠము చేసికొనుటకును తగినట్లు శ్లోకములలో వ్రాసియుంచిపోయిరి ఆ మహనీయుల బోధనా పద్ధతివలన పుస్తకములు అలభ్యములుగానో, కొద్దిగానో ఉండినను గురుశిష్య పరంపరలో పాఠములు జరుగుచుండి విద్యకు అంతరాయము కలుగనందువలన మొన్నటిదాక క్రమప్రాప్తముగా కళలను విద్యలును, శాస్త్రములును ఎడతెంపులేక వర్ధిల్లినవి. ఇటీవల దేశకాల పాత్రాదుల వ్యత్యాసమువలన సందేహములు కలుగుట, ముద్రణము సులభమగుట, సంస్కృత మెరిగి చెప్పగలిగినవారు తక్కువయగుట మున్నగు కారణములచేత పుస్తకాపేక్ష కలిగినది. మన ప్రాచీన గ్రంథములన్నియు ముద్రణ భాగ్యమును పొందనారంభించినవి. ఈ యక్కర నృత్యకళకు ఎంతో ఆవశ్యకమైనది దీనిని ముద్రించి ఈ యక్కరను తీర్చిన ఆంధ్రప్రదేశ సంగీత నాటక అకాడమీ వారును, ఆంధ్రకర్త శ్రీ శర్మగారును, పీఠికా రచయిత శ్రీ అప్పారావుగారును ఆంధ్రుల కృతజ్ఞతకు ఎంతయు పాత్రులు.

### ఇందలి విషయము

నృత్తరత్నావళి కేవలము నృత్య శాస్త్రమునకు సంబంధించినది. ఎనిమిది అధ్యాయములు, మొదటి నాలుగింటిలో భరతమతాను సారమైన మార్గ నృత్యమును, తర్వాతి నాలుగధ్యాయములలో దేశినాట్య సంప్రదాయమును వివరింపబడినవి, మార్గపద్ధతి వివరణము చాలవరకు గతాను గతికమేయైనను జాయన మౌలికత కలదు దేశివిధానమున లెక్కలేని విషయములు చెప్పబడినవి. దేశిస్థానకములు, ఉత్ప్లుతి కరణములు, భ్రమరులు, దేశిపాదములు, పాటవములు, చారులు, లాస్యాంగములు, గతిభేదములు, పేరణిమున్నగు 15 నృత్యభేదములు శిక్షాపద్ధతి, వాద్యపద్ధతి, నర్తకీ నర్తక ముఖరి— ప్రతిముఖరి—వాద్యబృంద బృంద-ముఖ్యగాయక సంప్రదాయాది లక్షణములు, నృత్త నృత్యమండప లక్షణములు ప్రేక్షాగరము, సభాపతి, సభ్యుల లక్షణములు నేపథ్య విధానము, బృంద విన్యాసము, వాద్యముల మేళవింపు, నృత్య ప్రారంభము, తెరలు, నర్తకీ నర్తక బహూకరణము— అతి వివరముగా కలదు.

గ్రంథము పూర్తిగా నృత్యమునకే సమర్పితమనుట స్పష్టము. ఇది సర్వవిధముల విశిష్టమైన ముద్రణము. అనువాదకులు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు ఎంతటి గానకళా ప్రపూర్ణులో అంతటి సాహిత్య విద్యాప్రపూర్ణులు, సరసరచనాధురీణులు, ప్రియవాక్కులు. వారి యనువాదమును గురించి ఎంతయైనను మెచ్చుకొనవలసినదే గాని రెండవ మాటకు అవకాశము ఉండదు. ముద్రణ విధానము కూడ ముచ్చటగా నున్నది. పుటలలో ఎడమవైపు సంస్కృత మూలమును కుడివైపు పుటలలో సరిగా ఆయా శ్లోకములకు వచనాంధ్రీకరణమును ముద్రించినారు. సందేహములను ఎక్కడి కక్కడ మూలముతో పోల్చి తీర్చుకొనుట కనుకూలము ఈ పద్ధతి. మూలము ఇన్నాళ్లవరకు సరియైన పాఠ పరిష్కారము లేకయుండినది. మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథ భాండాగారమువారు, (O M S Library)డాక్టర్ వి. రాఘవన్ గారి పరిష్కరణముతో రెండేండ్ల క్రింద ముద్రించి

మేలొనరించిరి. సరియైన ప్రామాణిక లిఖిత ప్రతి లేనందువలనను గ్రంథపాతములు, సందిగ్ధములును మెండుగాని యుండినందువలనను, సంగీత నాటక అకాడమీవారు పదేండ్ల క్రితమే దీనిని ముద్రింపదలచి యుండినను, శ్రీ అనంతకృష్ణ శర్మగారి సలహాపై రాఘవన్‌గారి సంస్కరణమునకు కాచుకొనియుండి తర్వాతనే తమ కృషికి పూనుకొనుట వీరి సౌజన్యమును వేనోళ్ల చాటుచున్నది. శ్రీ రాఘవన్‌గారు శ్రీ శర్మగారన్నట్లు 'సుగృహీత నామధేయులు,' తాళపత్రాదికములను కూలంకషముగా పరిశోధించి, వాఙ్మయ సంగీత నాట్య విషయములందలి తమ దీర్ఘకాలానుభవముతో సుదీర్ఘమైన చారిత్రక విషయములతోడి ఉపోద్ఘాతముతో, పాఠభేదముల సూచికలతో ప్రామాణికమైన ముద్రణమును వెలువరచిరి. విశేషజ్ఞులును పరకీయ గుణగ్రాహియునైన శ్రీ శర్మగారు రాఘవన్‌గారి సంస్కరణమును చక్కగా పరిశీలించి మెచ్చుకొంటని ఆమోదించి, తమకు నచ్చని వానిని అధోజ్ఞాపికలలో హెచ్చరించి, ఎక్కువ పెంపకములేక, మూలమునకు చేర్పుగా, నేర్పుగా, సులభశైలిలో అనువదించినారు.

ఈ నృత్త రత్నావళికి మఱియొక యాంధ్రానువాదము, పైదానితో సమకాలికముగా, వేడివేడిగా 1971 లో వెలువడుట కూడ ముదావహము. అది శ్రీ జమ్మలమడక మాధవరామ శర్మగారు రచించి శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు (తణుకు) ప్రచురించినది. వీరు కూడ డాక్టరు రఘువన్‌గారి పరిష్కృత ముద్రణమున కెదురు చూచినవారే. వీరి ముద్రణము డెమ్మీ సైజులో శ్లోకము క్రింద వివరణ రూపమైన యనువాదముతో నున్నది. ఇంచుమించు సమకాలికముగా ఈ రెండనువాదములు వెలువడుట వస్తు గౌరవమును, దానివిూది మన యక్కరను వేనోళ్ల చాటుచున్నది. 'స్పర్ధయా వర్ధతే విద్యా' అన్నారు పెద్దలు.

శ్రీ డాక్టర్ పోణంగివారి పీఠిక అకాడమీ ముద్రణమునకు తలమానికము. వీరు భరతనాట్యాది శాస్త్రమును గూర్చి కొన్నియేండ్లనుండి పరిశోధించు వారిలో అగ్రేసరులు. అనంతకృష్ణ శర్మగారివంటి పెద్దలే, తమకు 'ఆరోగ్యము, వ్యవధి చాలనందున వీరి పీఠికకు ఆశపడిరనగా ఎంతటి పరిశోధకులో వేరుగా చెప్పనక్కరలేదు. నృత్య కళ, ఆంగికాభినయము నృత్త—నృత్య—నాట్యముల సూక్ష్మ సూక్ష్మ తర భేదములను, నాట్యకళా చరిత్రమును, భరతాది పూర్వ రచయితల జాయపయొక్క విశిష్టత, ఆంధ్ర నాట్యరంగములు మున్నగు బహువిషయములను డెబ్బది పుటలలో సోదాహరణముగా వీరు వివరించియున్నారు.

## సందిగ్ధములు

కాని లోకమునకు ఎక్కడికి తృప్తి. ఎవరెంత వివరించినను, ఎన్ని క్రొత్తవి చెప్పినను అభిప్రాయ భేదములకును, పునరాలోచనకును నూతనాంశముల చేరటమునకు అవకాశము లేకుండజేయుట దుర్ఘటము. నా దృష్టికి నాకు తోచిన వానిని హెచ్చరించుచున్నాను.

ఈ నృత్తరత్నావళి నృత్తము లేక వట్టి నృత్యము కాదా? సామాన్యుల పరిభాషలో నాట్యమును మాత్రమే చెప్పుట కుద్దేశింపబడినది. ఇందు సంగీత కావ్యనాటకాది విషయములకు బొత్తిగా చోటు లేదు. శ్రీ మాధవరామశర్మగారు తమ ముద్రణోపోద్ఘాతమున చెప్పినటు —'ఈ నృత్తరత్నావళి ఆంగికమునె విస్తరించినది· వాచికమును ప్రతిపాదింపలేదు. రస భావములను చెప్పలేదు. కావ్యనాటక రచనా ప్రక్రియలను జూపలేదు. గీతరత్నావళిలో నపేక్షితములను జెప్పితినని జాయప యనెను; ఆ గ్రంథము లభింపలేదు...దేశివృత్త నిరూపణమె ప్రాధాన్యము వహించును. అయినను మార్గరీతి యుపేక్షితముగాదు. అపేక్షితమైనంత సమీక్షితమైనది.'

గ్రంథముయొక్క రచనా విధానమును చూచిన నృత్తమును తెలిసికొనగోరువారికి రచయిత చెప్పని విషయములు నృత్తశాస్త్రమందు చేరవనియు, వానికి ఇతర శాస్త్రములు చూడవలసినవనియు రచయిత యభిప్రాయముగా స్ఫురించు చున్నది. నృత్త—నృత్య నాట్యపదములనుగూర్చి ప్రాచీనుల భిన్నాభిప్రాయములను చర్చించి శ్రీ అప్పారావుగారు ఇట్లు వ్రాసినారు 'ఇంత స్పష్టముగా నృత్త నృత్య నాట్యములు నిర్వచింపబడినను గ్రంథములందు లోకవ్యవహారమున నివి వ్యత్యస్తముగా ప్రయుక్తములగుచు వచ్చినవి.' అని కాళి

దాసునే ఉదాహరించినారు. 'నాటక ప్రదర్శనమను నర్థమందుకూడ వాడెను' అన్నారు. 'నాట్యమువలెనే నృత్యముకూడ రసస్ఫూరకమే యనెడి సత్యమును తెలుగు కవియగు నన్నెచోడుడు గుర్తించియుండుట స్మరణీయము' అని కుమార 9 ఆ—38 పద్య ఉదాహరించి 'కావున నృత్యముకూడ నాట్యమువలెనే రసవ్యంజకమనుట స్పష్టము. ఇచ్చట్ల గుర్తింప వలసిన విషయ మొకటి కలదు నృత్తము భావాభినయ హీనమగుటచేత గాత్రవిక్షేప మాత్రమై తాళ లయాశ్రితమగుచున్నది. గాత్రవిక్షేప విషయమున నృత్త నృత్యములు రెండును సమానములే (సంగీత రత్నాకరము నుదాహరించినారు) కాని నృత్తము భావ హీనముకాగా నృత్యము అభినయాత్మకమైనది. (ఈ యర్థమునందే నృత్యమును కేవలము అభినయము అని కూడ వ్యవహరించుట కద్దు.) నృత్తమున శుష్కాక్షరములు ప్రయుక్తములుకాగా నృత్యమున సాహిత్యము (గేయాదులు) ప్రయుక్తమగుచున్నది. ఇంక అభినయము విషయమున నృత్య నాట్యములు తుల్యములు. కాని నృత్యము ఆంగికాభినయ ప్రధానముకాగా నాట్యము సాత్వికాభినయ ప్రధానమును కళాత్మకమును అగుచున్నది ..' అయినచో 'జాయప రచించిన 'నృత్తరత్నావళి' నృత్తమునకు శాస్త్రమా, నృత్యమునకు శాస్త్రమా? అని ప్రశ్నించుకొని శార్ఙ్గదేవుని అనుసరించి "శార్ఙ్గదేవుడు ఒక్క ఆంగికాభినయము (గాత్రవిక్షేపము)ను గూర్చియే వివరించియున్నాడు . ఇక జాయపకూడ ఒక్క ఆంగికాభినయమును (గాత్రవిక్షేప మాత్రమైన నృత్తము )గూర్చి మాత్రమే అధికముగా చెప్పెను. అందుచేతనే తన గ్రంథమునకు నృత్తరత్నావళి అని పేరు పెట్టినాడు' అని సమర్థించినారు.

అంతదూరమెందులకు? జాయపయే ఇందు ప్రథమాధ్యాయమున నాట్యావతరణమునుచెప్పి నాట్య లక్షణమునుచెప్పి, చతుర్విధాభినయమును నిర్వచించి 'ఇదానీం ప్రకృతం నృత్యం' అని నృత్యమును నిర్వచించి నృత్తమును 'గాత్రవిక్షేపణార్థత్వాత్ నృత్తే బహుళమాంగికమ్' అని పీని మార్గదేశి భేదములను చెప్పి, నృత్య నాట్యాదికములను చెప్పి—

'గీత వాద్యాది మిళితం లయమాత్ర సమాశ్రయం
అంగవిక్షేపణం నృత్తం భవేదభినయోజ్ఝితమ్'

అని ప్రకృతమును నిర్దేశించి దేశియందు 'ఛిద్ర ప్రచ్ఛాదన ఫలంహితత్. అన్నాడు. ('నాట్యాభినయములలో గలుగు కొరతలను కప్పిపుచ్చుట దాని (నృత్తముయొక్క) ఫలముగదా. ఇది దేశియని ప్రసిద్ధమైనది?—అనువాదము) మఱి మార్గనృత్తము నాటవేదమునుండి వెలువడినదని జాయప అన్నాడు. అప్పారావుగారు జాయప వాక్యమునే ఉదాహరించియుండదగును.

ఒక ముఖ్య విషయము - జాయప శార్ఙ్గదేవుని పేరెత్తడు. ఇరువురును సమకాలికులు 'ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరేగదా!' జాయప గణపతి దేవుని కాలమున క్రీ. శ. 1253–54 లో రచించెను శార్ఙ్గదేవుడు 1247 లో గతించిన యాదవ సింఘణ దేవుని యాస్థానివాడు. గణపతి ప్రభువు కౌమార దశయందే ఈ విద్యయందు జాయపను ప్రవేశపెట్టి ఇప్పుడు సేనాపతియై వయసునిండి ఈ గ్రంధము రచించియుండును. కాబట్టి చాల వరకును ఇరువురును ఏకకాలమందుండినవారే. ఒకపాటి స్పర్థకూడ ఉండినదేమో!

ఇచ్చట ఒక సందేహము. గ్రంథముపేరు నృత్తరత్నావళిగానుండు నృత్తమున మార్గదేశి భేదములను రచయిత ప్రస్తావించుచుండ, ప్రధాన విషయము నృత్తముగా నగపడుచుండ 50 శ్లోకమున 'ఇదానీం ప్రకృతం నృత్యం' అని కనబడుచున్నది. ఇద్ది నృత్తం అనుటకు పొరపాటుగా నుండునా? అనువాదకు లిరువురును నృత్యమనియే అనువదించినారు. మఱి 'ఛిద్ర ప్రచ్ఛాదన ఫలం' దేశికిమాత్రమేనా? మార్గనృత్తమునకు అక్కరలేదా? నాట్యమందును అభినయమందును కలుగు కొరతలను నృత్తము కప్పిపుచ్చుట యనగానేమి యభిప్రాయమో. ఇది చెప్పిన శ్లోకము 54

అది యగుచునే 'అస్యాచార్యా మృడానీశః' అను 55 వ శ్లోకమున్నది. మృడానీశునికి నృత్తికి వచ్చినది నృత్తమంతయునా లేక దేశి నృత్తమువూత్రవూ? నృత్తము అసలు శివునిదే గదా. దేశినికూడ అతనికి అంటగట్టు ప్రయత్నమా? పైగా నాట్యవేదమునుండి వెలువడినది మార్గమన్న వెంటనే నృత్తలక్షణము చెప్పి తర్వాత దేశి నృత్త లక్షణము చెప్పుటచేత 51 శ్లోకమునుండి 55 వఱకుగల శ్లోకముల వరుసలో ఏదో తారుమారుకూడ నుండియుండునా యని తోచుచున్నది. 'గాత్రవిక్షేపణార్థత్వాత్ నృత్తే బహుళమాంగికమ్' అని రాళ్లపల్లి వారనగా 'నృత్తే' స్థానమున జమ్ములమడకవారు 'నృత్యే' అని గ్రహించినారు. పైగా 'నృత్యమునందు ఆంగికాభినయము బహుళముగా నుండును. గాత్రములు అవయములు వాని విక్షేపము—ఇట్టి నృత్యమును' అని వ్యాఖ్యానించినారు. చూడగా నిచ్చట పాఠములును శ్లోకముల వరుసయు కొంత గందరగోళమునకు తావొసంగినవి. అప్పారావుగారి వివరణము (పైన ఉదాహృతము)చేత ఇట్లుండుననని తోచుచున్నది.

'ఇదానీం ప్రకృతం నృత్తం
యథా లక్షణ ముచ్యతే
భవేత్ భావాశ్రయం నృత్యం
పదార్థాభి నయాత్మకమ్. 50

గీత వాద్యాది మిళితం
లయమాత్ర సమాశ్రయం
అంగవిక్షేపణం నృత్తం
భవేదభిన యోజ్ఝితమ్ 53

గాత్ర విక్షేపణార్థత్వాత్
నృత్తే బహుళమాంగికమ్
వివిధేన విలాసేన
క్షేపోవిక్షేప ఇష్యతే 51

నాట్యే(నృ)హ్యభినయే ఛిద్ర
ప్రచ్ఛాదన ఫలం హితత్
ఏ తద్దే శీతి విఖ్యాతం
తత్తద్దేశజనేచ్ఛయా 54

నాట్యవేద ప్రవృత్తత్వాత్
మార్గితత్వాత్ మహర్షిభిః
సద్భిః సంచారి తత్వాచ్చ
మార్గమాహురిదం బుధాః 52

అస్యాచార్యో మృడానీశః
స్తుతః సంధ్యాసు నృత్యతా
మయాపీదం స్మృతం నృత్తం'
ఇత్యుక్తం చంద్రమౌళినా 55

నృత్యం శ్రీ గదితాదిస్యాత్ నాట్యం
తన్నాట కాదికమ్.'

ఈ చివరి పంక్తి 52 వ శ్లోకమున మూడవదిగా నున్నది. ఎటను ఇముడదు. రచయిత నృత్తరత్నావళి వ్రాయుచున్నానని పలికి నాట్యావతారమును నాట్య లక్షణమును చెప్పి, చతుర్విధాభినయములను వివరించి ప్రకృతము నృత్తముగాన నృత్త లక్షణము ప్రారంభించి నృత్తనృత్య భేదమును 50 శ్లోకమున చెప్పినందువలన ఉదాహరణమువంటి ఈ పంక్తి 50 కి తర్వాత కుదురునేమో. తర్వాతి 'గీతవాద్యాది' మొదలుకొని అంతయు నృత్తమును గూర్చియే గదా. జాయప మార్గదేశి నృత్తములను రెంటిని చెప్పినాడు.

జాయప వట్టి డ్యాన్సును గుఱించియే వ్రాసినాడనుట స్పష్టము. కాని ఇతడు ఒక్క ఆంగికాభినయమును మాత్రము గ్రహించి 'వాచిక సాత్త్వికాహార్యము'లను విడిచియుండినయెడల నేపథ్య రచనయెట్లు? నటీనటుల వేష రచన ఎట్లుండెడిది? మామూలుగా సింగారించుకొనుటయా లేక ఒక రూప రచన (వేషము వేసికొనుట)యా? పాల్కురికి సోమనాథుని శివతాండవ వర్ణనలో శివుని తాండవమూర్తి కనబడుచున్నదిగదా, ఆ నృత్తమును ప్రదర్శించు వారు వాచిక సాత్త్వికములను వదలినను ఆహార్యమును ఎట్లు వదలుదురు. శివతాండవమూర్తికి తగిన రూప రచన యుండదా? అట్లే అధ్యా 7, శ్లో 162—163 లో నర్తకీ లక్షణమును చెప్పుచు జాయప—

'కల్యాణ కటకే పూర్వం భూతమాత్ర
మహోత్సవే

సోమేశః కౌతుకాత్ కాంచిత్
భిల్లీ వేషముపేయుషీ'

అనుటచేత వివిధ భూమికా ధారణ ముండియుండ వలెను. 'నృత్యంతీ మధగాయంతీం' అనుటచేత ఇది నృత్తము కాదు నృత్య మందువా యన్న గోండలీ నృత్తమున కిది ఉదాహరణము —దేశి నృత్తము-చూడగా వట్టి అంగవిక్షేపమాత్రము కాదు గాన ఒక పాటి స్వాతంత్ర్యము నర్తకుల కుండెడిదేమో! లేక పోయిన రచయితకు స్వవచోవ్యాఘాతము కలుగును గదా. కాబట్టి నృత్తము వట్టి ఆంగికముతో నిలువ లేదు. ఇట్టి వానిలో రసభావాదు లేల యుండవు? మఱియొక ప్రశ్న. ఈ నృత్తములకు ఆధారమేమి, ఇవి వేని నాశ్రయించి యుండును? ముఖ్యగాయకుడు పాడు గీత ప్రబంధముల కనుగుణముగా గదా నృత్తము ప్రవర్తిల్లవలెను. రసదృష్టులు, స్థాయిభావదృష్టులు. సంచారి దృష్టులు, ఇత్యాదు లుండుటచేత రసోత్పత్తి తప్పదు. నాటకములలో నెట్లున్నను నృత్త నృత్యము లలో శరీరావయవములు స్ఫుటముగా కనబడునట్టి ఆహార్యముండవలయునుగదా, లేకపోయిన ద్రష్టలు దేనిని చూచి ఆనందింతురు. శాస్త్ర నిర్వచనమునకును లోకాచరణమునకును ఇంత భేదముండుటచేతనే కాబోలు మహాకవులు కూడ ఈ పదములను వ్యత్యస్తముగా ప్రయోగించినారు.

## వ్యత్యస్త ప్రయోగములు

మనకు చరిత్ర గ్రంథములు లేవు సరిగదా చారిత్రక దృష్టికూడ బొత్తిగా లేదు. రసానుభవమునకు, గ్రంథార్థము, స్వారస్యము వీనిని గ్రహించుటకు చరిత్ర ఎందులకను అలక్ష్యము కూడ కలదు. ప్రతి విషయమునకును ఉత్పత్తికి కారణము పరమేశ్వరుడు. ఈశ్వరుడు కథలు చెప్పుటలో చాల సమర్థుడు. ఈ కల్పిత పౌరాణికోత్పత్తి గాథలవలన ప్రాచీనులే పొరపడి పెక్కు గందరగోళము లేర్పడినవి. సంగీతము ముందా నాట్యము ముందా? నాటక మెప్పు డేర్పడినది. భరత నాట్యశాస్త్రము బ్రహ్మ నిర్మించినదట. పంచమ వేదమట. అట్లయిన మహాభారతము గతి యేమి? అదియు పంచమవేద మనియే అన్నారు. రెండు పంచమ వేదములా? దీని కేమర్థము. ఎట్లు సమన్వయము. మనకు సంగీత గ్రంథములు వేరు, తాళలయాదుల గ్రంథములు వేరు, నాట్యగ్రంథములు వేరు. కావ్య నాటకాలంకార గ్రంథములు వెవ్వేరు. పరస్పరాశ్రయము లైన యీ శాస్త్రములను వెవ్వేరుగా వారువారు అభ్యసించుచుండినందువలన శాస్త్రకారులును గ్రంథములను వెవ్వేరుగా వ్రాయవలసి వచ్చినది కాబోలు. విద్యలు సాధించుచుండినవారు ఏదో ఒకదానిలో నిష్ణాతులు. అన్నియు కూలంకషముగా ఎఱిగిన సూత్రధారుల వంటి పండితులు నూటికో వెయ్యింటికో ఒకరు.

శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు సంస్కృత వాఙ్మయ చరిత్రలో గాంధర్వవేదమును గుఱించి వ్రాసినది ఇప్పట్టున స్మరణార్హము.—'గీతం వాద్యం తథా నృత్యం త్రయం సంగీత ముచ్యతే' అనునది సంగీత లక్షణము. (గాంధర్వం త్రివిధం గీతవాద్య నర్తన భేదతః) ఇందు నృత్యము వాద్యానుగమము, వాద్యము గీతానువృత్తి. అందుచేతనే గీతము ప్రధానమగుచున్నదని సంగీత రత్నాకరకారాదుల నిర్ణయము. పితామహుడు సామవేదమునుండి తొలుత గీతమును గ్రహించెనని వారి విశ్వాసము. గీతమనాది...గీతము నాదాత్మకము, నాదవ్యక్తియే వాద్యమునకు మూలము. ఈ గీతవాద్యములను రెంటిని నృత్యము అనుగమించును. అందుచే నీ మూడును నాదాధీనము లనుటయు విదితము. అట్టి యీ నాదము ఆహతము అనాహతము అని ద్వివిధము. దీనివలన శ్రుతియు, దానివలన స్వరమును, దానివలన రాగమును, దానివలన గీతము నుత్పన్నము లగును గావున గీతమునకు నాదమే యాత్మ యనియు మూలాధారమనియు దలంపబడుచున్నది. తదాత్మకమైన గీతము నధికరించియే సంగీతశాస్త్ర మావిర్భవించినది. ఆ గీతమునకు వాద్యనృత్తములు సహకారులు. అందుచే నీ మూడును సంగీత శాస్త్రమున కవలంబములైనవి.'

సకల విషయములను చేర్చి కూర్చిన ఆధునిక

పాఠ్య గ్రంథమువంటి భరతనాట్యశాస్త్రము (ప్రస్తుతము లభ్యమగు గ్రంథము) ప్రాచీనమేగాక మొదటిది, అన్నిటికిని మూలాధారమను భ్రమయే సకల వ్యత్యాసములకును మూలకారణము. అట్లు ఒక్కటిగా నుండి ఒకటిగా ఆవిర్భవించి తర్వాత విడిపోయి విభిన్న శాస్త్రములుగా వృద్ధినందినవనుట పరిణామ దృష్టికి విపరీతము 'నృత్తము అనాది, పరమేశ్వర సృష్టి, అంగవిక్షేపాత్మకమైనది, నాట్యము బ్రహ్మ సృజించినది అర్థ ప్రదర్శన సాధనము. నాట్యమును చూచి శివుడు రెంటిని కలిపెను. ఈ కలయికయే నృత్యము' మొదలైన కథలు వానివాని పుట్టుపూర్వోత్తరము లను మరచిపోయి కల్పించుకొన్నవి. నృత్తమును కల్పించిన పరమేశ్వరునికి నాట్యమును కల్పించు మహిమ లేకపోయినదా, లేక బ్రహ్మయే నృత్తము నెఱిగినవాడు రెంటిని కలుపు జ్ఞానమో ధైర్యమో లేనివాడా? ఇవన్నియు పుక్కిడి పురాణములు. భరతనాట్యశాస్త్రము మూలరూపమును కోలుపోయి తర్వాతి చేరికలచేత ఎంతో రూపహాని నందినది. కాశ్మీర శైవులు పరమేశ్వరుని తెచ్చిపెట్టినారు. రససిద్ధాంతాదులు తొలుత లేనివి తర్వాత ఎక్కియుండవలెను. సంగీతనృత్త నృత్యనాటకములు విశాల భారతమున భిన్నప్రాంతములలో భిన్నరీతుల వృద్ధినంది తర్వాత ఆలంకారికులును గ్రంథ రచయితలును వీనినెల్ల సమన్వయింప నారంభించి తమ కాయా కాలములలో ఉపలబ్ధములైన ప్రమాణములతో సిద్ధాంతములు చేసినందున తలతోక తెలియని పరిస్థితి యేర్పడినది.

ఉదాహరణమునకొక చిన్నప్రశ్న. అమరకోశమందు నాట్యవర్గయందు దశరూపకములను గుఱించిగాని నాటకములందలి పరిభాష సమగ్రముగాని ఏల కానరాదు. నాట్య సంగీతాదుల గుఱించి అంత విపులముగా చెప్పిన అమరసింహుడు ఇవి విద్యార్థుల కక్కఱలేవని తలంచెనా? లేక అమరుడు వీని నెఱుగడనియందుమా? అంకమను మాటగాని, నాటకరంగమందలి యవనికగాని ఏదియు కానరాక పోవుట ఆశ్చర్యము! నృత్త నృత్య నాట్య నాటక భేదములను బొత్తిగా చెప్పడే! భరతనాట్య శాస్త్రమందలి విషయములు ఎన్నో లేవు. భరతునికన్న ముందువాడా అమరుడు? ఇంతెందులకు బలరాముఁడున్నాడుగాని దశరథ రాముడే కనబడడే!

నాటకము–దశరూపకాది సంగీత నృత్యములకు తర్వాతిదిగా పరిణామమంది యుండవలెను. ఒకపాటి కావ్యమార్గమేర్పడిన పిదప, నాట్యపరిభాషను స్వీకరించి కావ్యమార్గమున విభిన్న పాత్రోచిత భాషా సమాశ్రయమైన నాటకము దేశమందు ఏర్పడి యుండవలెను. లౌకిక సంస్కృతము చక్కగా నెలకొన్న తర్వాతిదిగా నుండును. కావుననే దీనిని, అనగా నాటకమును, మనవారు సంగీత నృత్యశాస్త్ర గ్రంథములో చెప్పక కావ్యాలంకారాదుల చేర్చిరి. విద్యానాథుడుగాని విశ్వనాథుడుగాని సంగీత నృత్తములకు స్థానము కల్పింపలేదు.

మన పండితులు చారిత్రక పౌర్వాపర్య దృష్టితో వీనినెల్ల సమన్వయించిన యెడల పెక్కునూతనాంశములు గోచరింపగలవు.

## జా య సే నా ప తి

గ్రంథకర్త ఆంధ్రుడనుటకు సందేహము లేదుగాని ఈ నాట్య ప్రక్రియలలో ఆంధ్రుల స్వాతంత్ర్య ప్రక్రియ లెంతవఱకు అనునది పరిశోధకులకు విషయము. నందికేశ్వరుడు ఆంధ్రుడనియు, భరతముని ఆంధ్రులను పేర్కొనుచున్నాడనియు మనము సంతోషించుట మంచిదేకాని ఇతర దేశముల, జాతుల ప్రభావము మనమీద బొత్తిగాలేదని తలంచుట పొరపాటు. జాయపయు శార్ఙ్గదేవుడును సమకాలికులని మనముముందే గ్రహించితిమి. ఇరువురకును చాల పోలికలు కనబడుచున్నవి గదా. ఇరువురకును ఉమ్మడిగా వేరొక మూల గ్రంథముండెనేమో యని శ్రీ అప్పారావుగారు తలంచుట సమంజసమే. కాని ఇచ్చటకూడ కొంత చరిత్ర చూడవలెను. కాకతీయులకు మహాదేవగణపతి చక్రవర్తుల కాలమునుండి మైత్రియేగాని విరోధము లేదు.

తత్పూర్వముండిన వైరముపోయి చెరసాలలో నుంచబడిన గణపతిని యాదవులు స్నేహభావముతో వదలిపెట్టినది స్మరణార్హము. ఈ కాలమున మహారాష్ట్రులెందరో ఆంధ్రదేశమునకు వలసలువచ్చి ఇచ్చటనే నిలిచిపోయిరి. వారివలన అనేక నూతన వాఙ్మయ ప్రక్రియలు మనకు సంక్రమించినవి. అట్టివానిలో ఉదాహరణ వాఙ్మయ మొకటి అనియు, బొత్తిగా చారిత్రక జ్ఞానముగాని పరిశోధనా పద్ధతిని ఎఱుగని శుష్కాంధ్ర పండితులు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు దీనిని గుర్తింపలేదని, నేను ఆంధ్రపత్రిక ప్రమాది ఉగాది సంచికలో నొక వ్యాసమున విశదీకరించి యున్నాను. తిక్కన సోమయాజి ఈ జాయపకు సమకాలికుడుగదా. నిర్వచనోత్తర రామాయణమందలి ప్రస్తావములచేత నాటికే మహారాష్ట్రులు వచ్చియున్నారని తెలియుచున్నది. ఆరెమరాటీలు, మాయల మరాటీలు మొదలైన కథలు, వానిలో ప్రస్తావింపబడిన గండికోట, పానుగల్లు, బాలనాగమ్మ కథలు ఇవన్నియు ఈ సంబంధమునే తెలుపుచున్నవి. మరాటీలకే ఆరెలని పేరు అళియ రామరాయలు ఆరెవీటి వంశస్థుడు.

మహారాష్ట్రులవంటివారే, ఇంచుమించు, కల్యాణీ చాళుక్యులు, ఇంకను ఒక మెట్టు ముందరికి పోయిన మహారాష్ట్రులకుముందే కల్యాణీ చాళుక్యుల కాలమున సాంస్కృతిక సంబంధములు ఉండెననుట విశదము. గొండ్లి నృత్యము మహారాష్ట్రులది. మనకు ఓరుగంటిమీదుగా సంక్రమించి నాచన సోము శ్రీనాథాదుల ప్రశంసల నందుకొన్నది. 'తెరలెత్తి... వరుణుండు గొండిలి పరిఢవిల్ల'(ఉ హరి. 4–216) 'తనకీర్తి నర్తకి ఘనతర బ్రహ్మాండ భవన భూముల గొండ్లి పరిఢవిల్ల' (శృంగార నైషధము) కాని గొండిలి మహారాష్ట్రులది కాదేమో! గొండలదేశ మొకటి ఉండినట్లు, దానిని పాలించుచుండిన వారు తొలుత మాళవ పరమార భోజమహారాజా వంశస్థులైనట్లు, ఆంధ్ర కర్ణాటక ప్రాంతములకువచ్చి ఇచ్చటనే నిలిచి పోయినట్లు శాసనములచేత తెలియుచున్నది.

కల్యాణీ చాళుక్య ప్రభువు ఆఱవ త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు (చాళుక్య), పరమార భోజ మహారాజు మరణానంతరము ధారానగరమున అరాజకమేర్పడగా, తన్నాశ్రయించిన రాజకుమారునికి రాజ్యమిప్పించెను. ఈ కుటుంబమువాడైన జగద్దేవునికి తర్వాత తెలంగాణములో కరీంనగరుజిల్లా వేములవాడ ప్రాంత రాజ్యమును, సబ్బిసాయిరమును, సామంత రాజ్యముగా నిచ్చెను. ఈ జగద్దేవుని తండ్రి ఉదయాదిత్యుడు. వాని తండ్రి గొండల క్షోణిపాలుడట (చూ. తెలంగాణా శాసనములు, కొలనుపాక శాసనము)

'భోజః కవీశ్వర మహోరుహకల్ప భూజః
... . ............ . ... ...
నయవినయ విలాసో శౌర్యలక్ష్మీ నివాసః
శుభ విభవ విలాసో గొండల క్షోణిపాలః...'

భోజునికి సంతతిలేదు. ఈ గొండలుడు జ్ఞాతిగా నుండవలెను.

బాల్యమునుండియు విద్యనేర్చిన జాయపవిభాద పరిసరముల ప్రభావము తప్పదు. ఇతడు ప్రాచీనుల గ్రంథాదులనుండియు గురువులనుండియు గ్రహించినదేగాక తన కల్పనలను 'వయం, మన్మతమ్, స్వయం మన్యామహే...' ఇత్యాదులచే తెలిపినాడు. దేశమందు నృత్తమెంత ప్రకాశించినదో కాకతీయ శిల్పము చాటుచున్నది. ఆర్యావర్త, మాళవ, కల్యాణీ చాళుక్య మహారాష్ట్ర యాదవ సంస్కృతులు ఓరుగంటికి చేరుకొన్నట్లే తమిళదేశమందలి నృత్తముకూడ కనబడుచున్నది. తమిళ నృత్యమైన సిందు (చిందు) ఇందులో 'చింతు'గా కనబడుచున్నది. వీనినన్నిటిని సమన్వయించి పరిశోధించి చక్కని వ్యాఖ్యను సంగీత నాటక అకాడమీవారు వ్రాయించిన దేశోపకారమగును.

అనువాదమును గుఱించి మఱియొక మాట.

శ్రీ అనంతకృష్ణ శర్మగారి అనువాదము సకల విధముల ప్రశస్తమైనదని ఆదిలోనే చెప్పితిని. ఇట్టి మనోహర రచనలో ప్రూఫులు దిద్దుటలోనో అచ్చు

వకు శుద్ధప్రతి తయారుచేయుటలో కలిగిన కొన్ని పొరపాటుల వంటివి దొరలినవి. అధ్యాయ 1—శ్లోకము 14.

జిత్వా శౌర్యేణ పృథ్వీం
జలనిధి రశనాం, సుస్థిరీ కృత్యలోకం,
సంగీత స్యోపభోగే సకుతుక
మనసః స్వామినః శాసనేన,
తస్యాభీష్టస్య భావ్యమ్మణి
ముకురనిభం నృత్తలీలాయితస్య
ప్రాజ్ఞోఽసౌ శాస్త్రమేతత్
రచయితి చతురం నృత్త రత్నావలీతి.

అనువాదము—'ప్రాజ్ఞుడైన ఆజాయన, సముద్రములు మొలనూలుగాగల భూమినంతయు శౌర్యముచే జయించి, లోకమును స్థిరపరచి. సంగీతానుభవమునకు వేడుక పడిన ప్రభుని యాజ్ఞచే, ఆయనకు మిగుల ప్రియమగు నృత్తలీలకు రత్నదర్పణము వంటి చదరమైన యీ శాస్త్రమును 'నృత్త రత్నావళి' అను పేర రచించుచున్నాడు.'

ఇచ్చట 'చతురం' అనుటకు అనువాదమున 'చదరమైన' అని యున్నది. చతురమనగా చాతుర్యముతో కూడిన, నేర్పుగల అని సామాన్యముగా అర్థమగును. చదరమనగా చౌకమైన, నలుచదరమైన, చతురస్రమను నిత్యార్థ మగును. ఇది ఎట్లు పడినదో, ఒకవేళ చతురమునకు రాయలసీమ ప్రాంతములలో చదరమను మాండలిక పదము కలదేమో!

అధ్యాయ 2—శ్లోక. 40.

'యాత్యాకుంచిత పక్ష్మాగ్రా' అను దానికి 'తుది రెప్ప వెండ్రుకలు కొంచెము ముడుచుకొని' అని యనువాదము. రెప్పల తుదలు గదా పక్ష్మాగ్రములు. వానిని వదలి వెండ్రుకలను మాత్రము ముడుచుకొనుట నాట్యమున సాధ్యమా.

అధ్యాయ 2—శ్లోక. 162.

కిముధత్తే శ్రియం జాతు
మధు పుష్పాయుధం వినా
సూర్యోదయం వినా పద్మం
విభ్రమో యౌవనం వినా.

అను—'కామము లేక మద్యము, సూర్యోదయము లేక పద్మము, తారుణ్యము లేని శృంగార చేష్టలును ఎప్పుడైన అందగించునా?' ఇచ్చట శ్రీ మాధవరావు శర్మగారు 'మన్మథ భావము లేకున్న మధువు శోభా సంపాదకము కాగలదా?' అని అనువదించినారు. (పుట 107) ఇచ్చట మధువనగా వసంతఋతువని తోచుచున్నది.

అధ్యాయ 2—శ్లోక. 190 లో

'చపేటే తాలికాయాం చ స్యా ద్వరాభయ దానయోః' 'అరచేతిపెట్టు, వరము నిచ్చుట, అభయ ప్రదానము ..' ఇందు తాలిక వదలిపోయినది.

వీనినెల్ల 'ముఖ్యమైన సవరింపు'లలో సూచించి యుండదగును. కాని ఎంత యని ఈ వృద్ధాప్యమున శ్రీ శర్మగారు శ్రమ పడగలరు. ఇంతమాత్రము వారు చేసినదే మహోపకారము.

—శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి

## చిలకమర్తి—లక్ష్మీనరసింహము

(రచన: శ్రీ మొదలి నాగభూషణశర్మ. డెమ్మీ సైజు 99 పుటలు. వెల సాదా ప్రతి 2 రూ. గ్రంథాలయ ప్రతి రూ 4. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురణ, కళాభవన్, హైదరాబాదు-500004.)

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు గ్రంథాలు ప్రకటిస్తున్నట్లే సంగీత నాటక అకాడమీ వారు కూడా సంగీత నాటకాదులకు సంబంధించిన ఉత్తమ గ్రంథాలను ప్రకటిస్తూ ఉండడం ముదావహం. వారు ఈ వరకే సంగీత రత్నాకరం, నృత్తరత్నావళి మొదలైన గ్రంథాలను ప్రకటించారు. ఇట్టి శాస్త్రీయ గ్రంథాలతోపాటు నాటకకళాభివృద్ధికి దోహదం ఇచ్చిన తెలుగు నాటకకర్తలను గురించిన గ్రంథాలనుకూడా ప్రకటించాలని అకా

డనిగావారి ఉద్దేశం. ఆ ఉద్దేశాన్ని అనుసరించే మొదట్లో సుప్రసిద్ధ నాటక రచయిత చిలకమర్తి లక్ష్మీనరసింహంగారిని గురించిన యీ పుస్తకం వెలువడింది.

గత శతాబ్దం చివరనూ, ఈ శతాబ్దం తొలి నలభై ఏళ్లకుపైగా బహుముఖాల దేశసేవ చేసిన మహనీయుల్లో చిలకమర్తివారు ప్రసిద్ధులు. వీరు కందుకూరి— వీరేశలింగం పంతులుగారి అడుగుజాడల్లో నడిచి, ఆయనవలెనే వివిధ రంగాలలోను, ఉద్యమాలలోను గట్టి కృషి చేశారు. నవలలు, నాటకాలు, జీవిత చరిత్రలు, చరిత్రలు, ప్రహసనాలు రచించారు. నాటక సమాజం నడిపారు. సంఘసంస్కర్తలైనారు. అధ్యాపకులుగా ఉండడమే కాకుండా స్వయంగా విద్యాలయాలను నడిపారు, పత్రికలను స్థాపించి, నిర్వహించి, వానిలోని తమ రచనల మూలంగా ఎంతో ప్రబోధాన్ని కలిగించారు ఆయనను గురించిన యీ గ్రంథంలో జీవిత చరిత్రను గురించి తొమ్మిది పుటలూ, నాటకేతర రచనలను గురించి పందొమ్మిది పుటలూ ప్రత్యేకించబడినవి. మిగత గ్రంథం అంతా ఆయన దృశ్య రచనకూ నాటక రంగానికీ సంబంధించినదే!

నాటకేతర రచనలను గురించిన శీర్షికలో చిలకమర్తివారి సాంఘిక, చారిత్రక, పౌరాణిక నవలలను గురించీ, అనువాద నవలలను గురించీ, కావ్య రచనను జీవిత చరిత్రలను, స్వీయ చరిత్రలను గురించీ వివరంగా తెల్పబడినది.

'సమకాలీన నాటకరంగం' అనే శీర్షికలో— గత శతాబ్ది చివరా, ఈ శతాబ్ది ప్రారంభంలోనూ జరిగిన ఆంధ్రనాటకరంగపు ఆవిర్భావాభ్యున్నతులూ, వివిధ పరిణామాలూ వివరించబడినవి. చిలకమర్తివారికి ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారి మూలంగా నాటక రంగంలో ప్రవేశం కలిగిన విధమూ హిందూ నాటక సమాజ వృత్తాంతం, చిలకమర్తివారి స్వసమాజయాజమాన్యం వివరింపబడినవి. ఈ శీర్షిక వెనకటి నాటక సమాజాల వృత్తాంతాలను స్మృతిపథానికి తీసుకు వస్తున్నది.

చిలకమర్తివారి దృశ్య కృతులలో స్వతంత్ర నాటకాలు, అనువాద నాటకాలు, ప్రహసనాలూ ఉన్నవి. వీటిలో ప్రహసనాలు సంఘంలోని దురాచారాలను విమర్శించడానికి మాత్రం ఉద్దేశించబడినట్లు తోస్తున్నది. నాటకాలలోకూడా అనువాద నాటకాలకంటె స్వతంత్ర నాటకాలే ఎక్కువ ప్రచారానికి వచ్చాయి. అందులోనూ గయోపాఖ్యానానికిఉన్న ప్రసిద్ధి ఆ కాలంలోని మరి యే నాటకానికీ రాలేదు. అందలి పద్యాలు కొన్ని ప్రబంధ పక్కని ఉన్నా—అప్పటి సమాజానికి ఎబ్బెట్టుగా తోచేదికాదు. అందులోని 'అల్లుడా రమ్మని—' మొదలైన పద్యాలు ఆబాలగోపాలం కంఠస్థమై యుండేవి. అందలి పాత్రపోషణను గురించీ, కల్పించబడిన సంఘటనలను గురించీ విద్వద్విమర్శకుల వాదోపవాదాలు బయలుదేరాయి. డాక్టర్ కేతవరపు రామకోటి శాస్త్రిగారు మున్నగువారి తీవ్ర విమర్శనలకు ఏతద్గ్రంథ రచయిత నాగభూషణ శర్మగారు ఇచ్చిన సమాధానాలు కూడా ఇందు ఉన్నవి. పరస్పర విరుద్ధాలయిన పండితాభిప్రాయాలకు ఇది గురి అయినా, పండిత, పామరలోకంలో మంచి ప్రచారం పొంద గలిగింది. దీనిని గురించిన విషయమే ఇందు విపులంగా ఉన్నది.

చిలకమర్తివారి భాసనాటకానువాదాలు వారి ప్రతిభా పాండిత్యాలకు తార్కాణాలు. అనువాదాల్లో తెనుగు నుడికారాన్ని చొప్పించడం వీరి ప్రత్యేకత.

తెలుగు నాటకరంగానికి చిలకమర్తి చేసిన సేవను గురించి గ్రంథం చివర రచయిత 'తెలుగుజాతి పునరుజ్జీవనంలో సంఘ సంస్కర్తగా ఆయన ఎంతటి ప్రముఖమైన పాత్రను నిర్వహించారో, తెలుగు నాటక పునరుజ్జీవనంలో కూడా అంతటి ప్రముఖమైన పాత్రనే నిర్వహించిన మహారథుడు చిలకమర్తి' అని తమ అభిప్రాయాన్ని వెల్లడించారు.

చిలకమర్తివారి జీవితాన్ని గురించీ, ఆయన నాటక జీవితాన్ని గురించీ వివరించడానికి ఆయనతో

గాని, ఆయన రచనలతోగాని పరిచయం బాగా ఉండాలి. మంచి పరిశీలన ఉండాలి. రచయిత చిలకమర్తివారిని గురించి ప్రత్యేక పరిశోధన చేశారు. నాలుగు నాటకాలు, పదిహేను నాటికలు, పాతికదాకా రేడియో నాటికలు వ్రాసిన నాటక కళాభిజ్ఞులు. తెలుగునాటక సాహిత్యాన్ని గురించి, తెలుగు దేశ రూపకాలను గురించి పరిశోధన వ్యాసాలు వ్రాశారు. వ్యక్తిజీవిత చరిత్రతో మేళవించి నాటకచరిత్రను సంగ్రహంగానూ, సర్వజనోపయుక్తంగాను రచన సాగించడంలో సమర్థులు. అట్టివారిచే ఈ గ్రంథాన్ని రచింపజేసి, ప్రకటించిన ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీవారు అభినందనీయులు.

- శ్రీ బులుసు వేంకటరమణయ్య.

## స మ ర ం

(వెల : ఒక రూపాయి, ఎ. పుల్లయ్య, 3-13-111. కుమార్‌పల్లి, హనుమకొండ.)

కవితా సమర సముత్సాహులైన 30 మంది యువజనుల క్రాంతిగీతాల సంకలనం యిది. 'స్వేచ్ఛా సమాజం'కోసం 'సమసమాజం' కొరకు, 'శ్రామికుల శ్రేయోరాజ్యంకొరకు రాజీలేని' 'సమరంలో దూకడానికి ముందు అజ్ఞానంతో, అహంకారంతో, భయంతో ఇప్పటికే ఏర్పడిన అన్నితీర్ల విలువలతో, ఈ విలువలను సత్యంగా స్థాపించచూపే భ్రమలతో, విశ్వాసాలతో—ఒక్కమాటలో, ఈ వ్యవస్థకు వెన్నెముకయిన ఆలోచనతో సమరం తప్పదు. అందుకే ఇప్పటికిది కవితా సమరం'—అనేది ప్రకాశకుల మున్నుడి 'శాంతి కోసం'లో.

ఈ ప్రతిజ్ఞ కవితా వస్తువులో ఏలా ప్రతిధ్వనిస్తూందో పరిశీలించే ముందు రెండు అంశాలు చెప్పవలసి వుంది. కవితలన్నింటా 'నేటి దుర్వ్యవస్థను భగ్గునదహించి వేయగలగాలి' అన్నకసి, ఆవేశం, నిజాయతీ ప్రతిధ్వనిస్తూందని ఒప్పుకోవాలి.

ఈ కవులందరికీ 'కొట్టు, నరుకు, చంపు, తిట్టు, ఉరుకు, రక్తం, విప్లవం ఇవేవీ రాకుండా రాయడమే కష్టం' అని తోస్తూంది. చెరబండరాజుగారు ఒక చోట అన్నట్లు. కాని ఆలా రాస్తున్న చాలామందిలోకన్న ఈ కవితలలో కవితాస్ఫూర్తి మధ్యమధ్య కనిపిస్తూంది

ఇంక కవితా వస్తువుకు, కనీసం కవు లుద్దేశించిన వస్తువుకూ వారుపయోగించిన పదబంధాలకీ చాలచోట్ల పొత్తులేదు. నిజానికి వారి ఆలోచనలకి భిన్నమైన పర్యవసానాలిచ్చే పదాలే వుపయోగించేరు, పొడుగునా. ఏలాగో వివరిస్తా,

సంకలన ప్రకాశకులతోసహా చాలమంది తమ కవితలలో తూర్పు దిగ్భాగంమీద ఆసక్తి విశేషంగా కనపరచేరు. 'ఆలోచనల స్వేచ్ఛ వికసించే...తూర్పు శిఖరాలమీదికి...సాగిపోవడమో తేల్చుకోడానికి యిది సమయం—అంటారు ప్రకాశకులు. 'తూర్పుద్వారాలు మూయించి, పడమరగా మళ్లించి, స్వార్థ యజ్ఞంతో పేల్చడానికి సాదరంగా పిలుస్తోంది'—చీకటి, అంటారు సంకలనకర్త అగ్నిమిత్ర. తూర్పు శిఖరాలమీద హసిస్తున్న సాయుధకెందామరలు' అంటున్నారు, భువన్. 'కొత్తగా వీస్తున్న తూర్పుగాలిగొంతు పిసకబడింది'—అంటున్నారు 'వేట'లో. 'వేకువనే నిద్దుర లేవరా, లేచి తూరుపు ఎరుపును చూడుమురా'—అని 'కర్షక గీతం'లో ప్రబోధం. ఇల్లా పలుచోట్ల చూస్తాం. మరికొన్ని చోట్ల తూర్పును సంకేతించడానికి 'అరుణోదయం' 'సూర్యుడు' 'ఎరుపు' మొదలైన పదాల వుపయోగం కనిపిస్తుంది.

తూర్పు దిశకీ, సూర్యునికీ, అరుణోదయానికీ వేదకాలంనుంచీ మన సాహిత్యంలో విశేష ప్రాముఖ్యం ఇచ్చేరు. అది క్రమంగా తూర్పు దిశాభాగంలోవుండే ప్రతిదీ శ్రేష్ఠమేననే భావానికీ, తర్వాత మిగతావన్నీ నీచమనే అహంభావానికీ తావిచ్చింది. మనపెద వాళ్లు తప్పుపని చేసినప్పుడు తిట్టే తిట్టు'పదం' అప్రాచ్యుడు.' 'పాశ్చాత్య విద్యలువచ్చి మన ప్రాభవాన్ని పాడుచేశాయనే దుఃఖం ఇప్పటికీ చాలమంది నోటే వింటున్నాం. విప్లవ కవులకి ఆ అహంభావం వుందనుకోలేము. మరేమిటిది?

మావోసే-టుంగ్ మీదగల అచల విశ్వాసాన్ని తోసిపుచ్చేసేమాట అది. ఆయన 1957 నవంబరు 18 న మాస్కోలో కమ్యూనిస్టు-వర్కర్సు పార్టీల అంతర్జాతీయ సమావేశంలో ప్రసంగిస్తూ ఒక చైనా సామెతను (తూర్పుగాలిని పడమటిగాలో, పడమటిగాలిని తూర్పుగాలో జయిస్తుంది.) వుదాహరించి 'ఈనాటి పరిస్థితియొక్క స్వభావం పడమటిగాలికంటే తూర్పుగాలే బలంగా వీస్తూందని నా విశ్వాసం' అన్నారు. వెనువెంటనే దానిని వివరిస్తూ 'సామ్రాజ్యవాద శక్తులకన్న సోషలిస్టు శక్తులు అనేక రెట్లు బలంగా వున్నాయి'—అని వ్యాఖ్యానించేరు.

సోషలిస్టు, సామ్రాజ్య వాదశక్తులను దిగ్విభాగంగానూ, భౌగోళిక విభాగంగానూ చూపడం మార్క్సిస్టు పరిజ్ఞానం అనిపించుకోదు తూర్పు, పడమరలు రెండింటా సామ్రాజ్య వాదాలూ, పెట్టుబడిదారీ దేశాలూ, వాని వలసలూ వున్నాయి. రెండు దిక్కులా సోషలిస్టు రాజ్యాలూ, స్వాతంత్ర్యంకోసం పోరాడే ప్రజలూ వున్నారు. దానిని విస్మరించగలమా? ఇటువంటి విభజననే ఏ తద్భిన్న స్థితినుంచి రడ్యార్డ్ కిప్లింగ్ అనే బ్రిటిష్ సామ్రాజ్యవాద సమర్థకుడు అన్నాడవి గుర్తుచేసుకొంటే దీనిలోని పొరపాటు అర్థం అవుతుంది. ఆయన పద్యం ఇది.

East is east, west is west
The twain shall never meet.

అటు తర్వాత విన్‌పియావో 1965 లో సోషలిజం, సామ్రాజ్యవాదాల ఘర్షణ వర్ణించేందుకు ప్రపంచ గ్రామం, ప్రపంచ నగరం ఘర్షిస్తున్నట్లు సూత్రీకరించేరు. ఇక్కడ గ్రామం వ్యావసాయిక నాగరికతకూ, నగరం పారిశ్రామిక నాగరికతకూ సంకేతాలు. సోషలిస్టు విప్లవంలోనూ, సోషలిస్టు సమాజ నిర్మాణంలోనూ నాయకత్వం వహిస్తుందని మనం చెప్పే కార్మికవర్గం పారిశ్రామిక నాగరికతలో భాగం. మనం సోషలిస్టు విప్లవంతో నిర్మూలించవలసిన ప్రతి ఘాతకశక్తులలో ఒకటి ఫ్యూడల్, భూస్వామి శక్తులు. ఇవి గ్రామీణ వ్యావసాయిక నాగరికతలో భాగం. ప్రపంచ గ్రామానికి ఈ పోరాటంలో నాయకత్వం ఎవరిది? దానికి వత్తాసు నిచ్చే సామాజిక శక్తి ఏమిటి? వారి పోరాటం ఎవరి మీద? ఎందుకు? (పరిశ్రమలు నిర్మించే వుద్దేశం వుందా? లేదా?)

'గ్రామం, గ్రామం ఒక్కటే విప్లవకారులకు అనంతమూ, విశాలమూనైన క్రియారంగం. అంతిమ విజయ యాత్రకు విప్లవకారులు బయలుదేరే విప్లవ స్థావరం గ్రామం ఒక్కటే'—అన్నారు లిన్‌పియావో జెన్మిన్ ఝిపావోలో, (3—9—65). దీన్ని మరింత విస్పష్టపరుస్తూ ఫ్రాంజ్ ఫనాన్ 'ఒక్క రైతులే విప్లవకారులు. అంతా వచ్చేదేగాని, వారికి పోయేదేం లేదు'—అంటూ కార్మికవర్గం విషయంలో కమ్యూనిస్టు మేనిఫెస్టోలో మార్క్సు వుపయోగించిన పదాన్ని రైతులకి జతపరిచేరు. ఈ ఆలోచనా ధోరణిని రెజిడెబ్రే కొనసాగిస్తూ—'కార్మికుల్ని నగరం బూర్జువాగా మార్చివేస్తుంది' అని తమ Revolution in the Revolution లో వ్రాసేరు.

అంటే ఈ పోరాటం కార్మికవర్గం మీద కూడానని అర్థం చేసుకోవాలా?

ఈ అసందర్భ స్థితిని చూసుకోకుండా సమరం కవులు తూర్పు పడమర దిశా విభాగాన్నే కాదు, గ్రామనగర శత్రుత్వాన్నికూడా స్వీకరించేరు. చూడండి, మచ్చుకి.

'చిల్లర చీమలన్నీ కలిసి అడివిలో......
పుట్టలు పెట్టుకొంటున్నాయిట!
నగరాలకు సొరంగాలు వేస్తాయిట!!
నగరాల్ని ముట్టడించి...—ఎర్రజెండా
ఎగరేస్తాయిట!!... (వేటలో)

ఇంతతో ఆగకుండా 'ప్రపంచగ్రామ' సూత్రాన్ని మనదేశ పరిస్థితులకు సమన్వయించడం కావచ్చు. లేదా నాగరికత ఎంత వెనక్కి నడుస్తే అంత శ్రేష్ఠమనే ఆలోచనా కావచ్చు. సమరం కవులు అరణ్యాన్ని విప్లవ పీఠం చేసేరు. మచ్చుకి—

'గిరిజనుడు దూసిన బాణంలా, పల్లెలా, గెరిల్లా యోధుని పోరాటంలా అడవిలా నీ వూపిరి...అడవులు అంటుకొనిగాని మండవు...అడవులు రాజుకొవి, రాజు

కొని పోరాటం తప్పదు'—అంటారు, నీ లిమ, తమ సమరం కవితలో అరణ్యాల ప్రసక్తి వీనిలో తరుచుగా కనిపిస్తుంది.

మావో భావాలను అవిమర్శకంగా అనుకరించడంవలన తటస్థపడిన అసంబద్ధ పరిస్థితే దేశ పరిస్థితులనూ, పరిణామాలను సవిమర్శకంగా ఆలోచించకుండా కసీ, కార్పణ్యం ద్వేషాలకూ మాత్రమే ప్రాముఖ్యం ఇచ్చి ఆ ప్రవాహంలో కొట్టుకు పోవడం వలనకూడా తటస్థపడింది. వారు చూపుతున్నకసీ, ద్వేషం కారణం లేనివి కావు. కాని,

మనదేశంలో సోషలిజంతప్ప గత్యంతరంలేదనే భావం ప్రజలలో స్థిరపడింది. దానినికాదని ప్రజలను కూడగట్టుకోగల శక్తి పాలక వర్గాలకు లేదు. కనక వారూ సోషలిజమే తమ లక్ష్యం అన్నారు. దానికి తమ వ్యాఖ్య ఇచ్చేరు కొన్నాళ్ళు. అది పనిచేయనప్పుడు సోషలిస్టు చర్యలు చేపట్టి, అవి అమలు జరక్కుండా తంటాలు పడ్డారు. అదీ సాగనప్పుడు వానిని అమలు జరుపుతూ ప్రయోజనం కలగకుండేందుకూ, నష్టం కలిగేందుకూ ప్రయత్నించేరు. వీటన్నింటి లక్ష్యం ఒక్కటే. ప్రజల మీద తమ నాయకత్వం నిలుపుకోడం. అసలు సోషలిజం అంటే ప్రజలలో వ్యతిరేక భావం కలిగించడమూను.

ఇవన్నీ విభిన్న దశలు. ఏ దశలో మనం ఏం చెయ్యాలనేది ఇక్కడ చర్చనీయాంశం కాదు. మన కార్య విధానం దశాంతరాలలో భిన్నంగా వుండాలి.

కాని, సమరం కవులలో ఆ అవగాహన కనబడదు. పైగా వారు కనబరుస్తున్న కోపం, వైముఖ్యం చూస్తే పాలకవర్గాలు నిజంగానే సోషలిజాన్ని అమలు జరుపుతారని ఆశ పడినట్టూ, అది విఫలమయ్యేసరికి కోప్పడుతున్నట్టూ కనిపిస్తుంది. చూడండి :

'గుంటనక్కలన్నీ సోషలిజం ఊళలు నేర్చుకొన్నాయి' అంటారు 'కాలం మారింది'లో, 'సోషలిజం, సోషలిజం అంటూ ఓండ్రపెట్టే ధనవంతుల ప్రజాస్వామ్యం వర్ధిల్లాలి'—అంటారు, 'ప్రజాస్వామ్యం వర్ధిల్లాలి'లో 'మన ముందు సోషలిస్టు పోజుపెట్టే'—అనేది, 'ఎర్రగా నవ్వుకుందాం'లో. 'సోషలిజమ్ సామ్రాజ్యవాదం ముద్దు పేరని...' అంటారు 'భయ... జయహే'లో, ఇంకా చూపవచ్చు.

ఈ అవిమర్శిత ధోరణి వారిని ఎక్కడికి తీసుకుపోతుందో చెప్పడానికి వెతుక్కోనక్కర్లేదు. వారు తమ లక్ష్యం 'స్వేచ్ఛా సమాజం' 'సమ సమాజం'గానే కాని సోషలిజంగా చెప్పుకోలేని స్థితికి వెళ్లేరు. సామ్రాజ్యవాద సిద్ధాంతవేత్తలు సోషలిజానికి ప్రతిగా తమది 'స్వేచ్ఛా సమాజం' అని చెప్పుకొంటారు. 'సమసమాజం' రంగు, రుచి, వాసన స్పష్టంగాని శుద్ధసాత్వికరూపం. శ్రీ గోరాగారి అభిమానపదం. అవే వీరి లక్ష్యం?

దీనినిచూస్తే 'సోషలిజం'మీద వైముఖ్యం కలిగించాలనే పాలకవర్గాల ప్రయత్నం బొత్తిగా విఫలం కాలేదనే అనుకోవాలి

ఇదిక్కడితో ఆగలేదు. ఈ ద్వేషం వారి అంతర్జాతీయ దృక్పథాన్నికూడా వక్రం చేస్తోంది. జాతీయ విముక్తి పోరాటాలు విజయం పొందిన సంతోషంకన్న దుఃఖం ఎక్కువ ప్రదర్శిస్తున్నారు. చూడండి!

'అమాయిక బాంగ్లా!.. నాడు నేనూ, నేడు నువ్వూకూడ మోసపోయిన వాళ్లమే...భ్రమల సాలెగూళ్లనుంచి బయటపడి...సమతా సౌధాలు కట్టుకొని...' ('ఎర్రగా నవ్వుకొందాం' కవితలోని భాగం) ప్రస్తుతం బాంగ్లాదేశ్ స్వాతంత్ర్యం పొందిందనుకోడం భ్రమ! దానినుంచి బయట పడాలి! అంటే?

ఇంతవరకు జరిగిన పోరాటాలలో విజయం పొందినందుకు విచారపడుతున్నట్లుందేగాని, వానిని మెట్లుగా చేసుకొని ముందుకు పోవలసి వుంటుందన్న పరిజ్ఞానమూ ఉత్సాహమూ కనబడదు.

ఆశియా, ఆఫ్రికాదేశాలు చాల వానితో స్వాతంత్ర్యోద్యమాలకు జాతీయ బూర్జువా నాయకత్వం వహించింది. (దేశ ప్రజలలో వున్న సామ్రాజ్యవాద, వలసవాద వ్యతిరేకతలతో ఈ వర్గానికి ఏకభావం వుంది.) అందుచేత వుద్యమంలో దాని పాత్రను అర్థం చేసుకోవాలి.

కాని ఆ వర్గం సోషలిస్టు వుద్యమానికి నాయకత్వం వహించదు. పైగా దానిని వ్యతిరేకిస్తుంది. 'ప్రజల తీర్పును పాటించిన పట్నాయక్‌కు ఉరిశిక్ష వేసిన నోటితోనే బాంగ్లాలో ప్రజాస్వామ్య రక్షణకే పాదం పెట్టా' (భయ భయ భయ జయహేలో) నంటుంది. ఆ వర్గం కనబరిచే వైరుధ్యాలతో అదొకటి. దానిని మరిచిపోకూడదు.

ఈ జాతీయ బూర్జువాలో అనేక విభాగాలున్నాయి. వాని మధ్య హద్దులంత స్పష్టంగానూ వుండవు. స్థిరంగానూ వుండవు. వాని ప్రయోజనాలూ, దృక్పథాలూ భేదిస్తుంటాయి. ఈ భేదాలూ, అంతరువులూ ఆర్థిక స్థాయిలోనే కాదు. వివిధ రాజకీయ సమస్యలయెడ వారి దృక్పథాలతో కూడా వుంటాయి. ఇవి సర్వసాధారణంగా దేశంలోని వర్గ పోరాటం స్థాయిమీద ఆధారపడి వుంటుంది. ఈ విషయంలో చాల స్పష్టమైన అవగాహన వుండాలి. లేకపోతే 'నీ దోపిడి కొక సామ్రాజ్యం చాలక, సామంత దేశం కూడా' వచ్చిందనుకోడంలో ఆశ్చర్యం లేదు.

అయితే నిక్సన్, యాహ్యాఖాన్‌లు బంగ్లా ప్రజల పోరాట స్వభావాన్ని సరిగ్గానే అంచనా వేసుకొన్నారు. కాని మన మిత్ర కవులు మాత్రం, భషానీల మీదనున్న విశ్వాసంతో తమరు చేస్తున్నదాని ఫలితం ప్రజోద్యమాలకే ద్రోహం అవుతుందని చూసుకోలేదు.

భావాలలోనే కాదు పదప్రయోగాలలోకూడ ఆలోచనలేమి, పురోగామి భావానభిజ్ఞత చాల కవితలలో చూస్తాం. ఉదాహరణకి 'సంస్కృతి—వర్ణ వ్యవస్థకు వారసత్వంగా వస్తున్న పెద్దపేరు (యువకుడా!) 'సాయుధ విప్లవ పోరాటంలో విప్లవకారులు చేసే ఒక హత్య'—వంటి అర్థశూన్య పదప్రయోగానందం చాలా చోట్ల కనిపిస్తుంది.

వర్గరహిత సమాజంకోసం తన్ను అనుసరించమంటున్న 'జ్ఞానేశ్వర్ కీర్తి' 'ప్రజాకోర్టులో తీర్పు' కవితలో 'హోటల్ సర్వర్‌గా, మోటార్ కీపర్‌గా, థియేటర్ గేట్‌కీపర్‌గా యింకెన్నాళ్ళు' అంటూ శరీర శ్రమ అవసరమయ్యే పనులు నింద్యమన్నట్లు వ్రాస్తారు.

'స్ట్రైకర్‌నై వచ్చాము'లో సుధాకర్ రాజ్యం చేస్తున్న రాణికాయిన్‌మీద చేసిన complaint చిత్రంగా వుంది.

'తనవర్గం వాడి తమ్ముణ్ణీ, బామ్మరిదినీ బ్లాక్‌మార్కెట్టుదారు, పెట్టుబడిదారుగాచేసి—వా సోదరులందరికీ రిక్షాల్నీ...సమకూరుస్తూంది.'

ఈ విధంగా పోటీపెట్టడం కేవలం అర్థంలేని పని. మన సోదరుల్ని బ్లాక్ మార్కెటుదారుల్ని చెయ్యమని మనంకోరం. వాళ్ళని నిర్మూలించమంటాం. ప్రజల జీవితం సుఖమార్గంలో నడవకుండా వాళ్ళు అడ్డం గనక.

ఇల్లాగే వున్నాయి కవితలు, చాలవానిలో, ఏం వ్రాస్తున్నామో ఎరగకుండా మాటలు దొర్లించిన ఘట్టాలు.

ఈ మాదిరి అవ్యవస్థిత మనస్సులతోనే ఈ కవులు 'సమసమాజంకోసం పోరాటం దారి చూపాలనుంది.' ('పోరులోకి ఉరకాలని వుంది'లో), 'సామ్యవాద క్రాంతిరథం సమరపథాన నడిపే క్రాంతి వాదిని నేను' (క్రాంతి వాదిలో) 'నా వర్గం వాళ్లందర్నీ నన్నునుసరించమంటున్నా' (ప్రజా కోర్టులో తీర్పులో) మొదలైన పదాలతో తమకు నాయకత్వం ఆపాదించుకోడం, అపహాస్యంగా కనిపిస్తుంది.

మొత్తంమీద 'సమరం', విప్లవ కవుల రాజకీయ, సామాజిక, ప్రపంచ దృక్పథ అనభిజ్ఞతకి మచ్చుతునకగా వుంది.

## అర్ధ శతాబ్దకాలంలో ఆంధ్రులపైని అక్టోబరు విప్లవ ప్రభావం

(రచన: కంభంపాటి సత్యనారాయణ వెల— రూపాయిన్నర. వికాస సాహితి, మద్రాసు—21)

ఈ శతాబ్ది ఆరంభంనుంచి రష్యా, భారత దేశాలలోని ప్రజా తంత్రవాది, అభ్యుదయ శక్తుల మధ్య పరస్పరావగాహనా, సంబంధాలూ క్రమాభివృద్ధి పొందుతూ వస్తున్నాయి. గాంధీ—టాల్‌స్టాయ్‌ల మధ్య జరిగిన వుత్తర ప్రత్యుత్తరాలూ, బ్రిటిష్ పాలకులు

బాల గంగాధర్ తిలక్‌పై శిక్ష విధించినందుకు అసమ్మతిగా బొంబాయి కార్మికులు చేసిన సమ్మెపై లెనిన్‌చేసిన వ్యాఖ్యా, చూపిన హర్షమూ దీనికి వుదాహరణ.

ఈ అవగాహనా, సాన్నిహిత్యం అక్టోబరు విప్లవానంతరం బాగా వృద్ధిపొందింది. ఈ విప్లవం సమాజంలో పైపై మెరుగులు పెట్టడంగాక, మూలనుట్టుగా మార్చేసిందనే పరిజ్ఞానం, వ్యాప్తి ఆంగ్ల పాలకులు ఎంత చరాసిపెట్టినా, ఆగలేదు. ఎం. ఎన్. రాయ్, వీరేంద్రనాథ్ చటోపాధ్యాయ, రాజామహేంద్ర ప్రతాప్ వంటి అనేకానేక భారత విప్లవకారులు విప్లవ ప్రథమ దినాలలోనే సోవియటు దేశాన్ని సందర్శించేరు, కొంతమంది యువకులు ఆఫ్గనిస్థాన్ మీదుగా సోవియట్ మధ్య ఆశియా ప్రవేశించి, సోవియట్‌ల తరఫున అక్కడ అంతర్యుద్ధాలలో పాల్గొనడం కూడా జరిగింది.

అక్టోబరు విప్లవానికి జాతీయ విముక్తి వుద్యమాలపై గల బలమైన ఆకర్షణా, ప్రభావానికి నిదర్శనగా మన జాతీయోద్యమ నాయకులూ, చరిత్రకారులూ, రచయితలూ ఆ విప్లవం గురించి తెలుసుకోవడం, ఆలోచించడం, వ్యాఖ్యానించడమే నిదర్శనం. ఆ ప్రభావం ఎల్లా వుంటుందో వలస పాలకులు ఎరుగుదురు. అందుచేతనే వారు ఆ విప్లవం గురించి మనదేశానికి అసలు వార్తలు అందకుండా చూసేరు. అసత్యాలు వ్యాపింపచేసేరు. సత్యాన్ని నిషేధించేరు. కాని, వారి ప్రయత్నాలు ఫలించలేదు. భారతదేశం యావత్తూ, ముఖ్యంగా మన తెలుగుదేశం కూడా విప్లవం జరిగిన ప్రారంభ దినాలలోనే దాని ప్రాముఖ్యాన్ని అర్థం చేసుకొంది. ఆ విప్లవం గురించీ, రష్యాలో వస్తున్న వచ్చిన మార్పుల్ని గురించీ శత్రువు చేస్తున్న క్రోధపూరిత విష ప్రచారంనుంచే వాస్తవాలు తెలుసుకొనేందుకు పూనుకొంది.

శ్రీ కంభంపాటి సత్యనారాయణగారి ఈ సంకలనంలోని వ్యాసాలకు వస్తువు ఆ పూనిక ఫలితాలే. సుప్రసిద్ధ నాయకులు, రచయితలు, చరిత్రకారులు, కమ్యూనిస్టు యువకులు ఆ విప్లవం గురించి ఏమనుకున్నారు? వారిపై ఆ విప్లవ ప్రభావం ఎటువంటిది? ఎంత గాఢమైనది?- మొదలైన విషయాలను వారు వారు పత్రికలలో వ్రాసిన వ్యాసాలు, పుస్తకాలు సవిమర్శించి మనకు పరిచయం చేస్తున్నారు.

ఇందుకోసం శ్రీ సత్యనారాయణగారు ఏభయ్యేళ్లకు పూర్వంనాటి పత్రికలు, పుస్తకాలు పైకి తీసి, ఈ సమాచారాన్ని సేకరించడానికి ఎంత శ్రమ పడి వుండాలో వూహించగలం. అంతరిక్ష పరిశోధనకు లాగ సద్యః ఫలితం ఏమిటనే ప్రశ్న దీనికీ వస్తూంది. కాని ఒక జాతియొక్క సంస్కారం రూపొందడానికి తోడ్పడిన అంశాలేమిటో మనం తెలుసుకోగలుగుతే, దాని భవిష్యత్తును రూపొందించడంలో తప్పులు తక్కువ చేస్తాం.

కాని, మన దురదృష్టం, ఇటువంటి కృషికి కావలసిన గ్రంథాలయాలు మనకు బొత్తిగా తక్కువ. వున్నవి ఒకచోట లేవు. ఎక్కడ దొరుకుతాయో తెలియవు. సన్యాసులు, స్వాములవార్ల మాట ఏలా వున్నా ఇటువంటి ప్రయత్నానికి పూనుకొన్నవారి బతుకు కొంచెం కుడి యెడంగా 'కరతల భిక్షా తరుతల వాసః'యే. ఆ ఇబ్బందుల్ని భరించి ఈనాటి యువతరం సంస్కృతిని రూపొందించిన ఒక ముఖ్యచారిత్రక ఘట్టాన్ని గుర్తు చేస్తున్న శ్రీ సత్యనారాయణ గారికి నా అభివాదనలు.

దీనిలో వున్నవి 8 వ్యాసాలు. వానిలో ఏడు వ్యాసాలు వివిధ సందర్భాలలో వివిధ పత్రికలలో వచ్చినవే. వానిలో అయిదు వ్యాసాలు జాతీయోద్యమ నాయకులు శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు, కాంగ్రెసు వాది రచయితలు శ్రీ జి. వి. కృష్ణారావు, ఉన్నవగార్లు చరిత్రకారులు శ్రీ డి. శివరావుగారు కృష్ణాపత్రికవంటి పత్రికలూ ఆ విప్లవాన్ని అర్థం చేసుకొన్న పరిమితులు, వారిపై ఆ విప్లవ ప్రభావమూ, ఆ భావాలకు వారిచ్చిన స్వాగతం వర్ణించబడినాయి. ఒక వ్యాసం తెలుగుదేశపు యువజనులలో 1930 తర్వాత ఆ విప్లవ ప్రభావం ఎంత బలంగా వుందో తెలుపుతూంది. సోవియటు సాహిత్యం తెలుగులో పొందుతున్న ప్రచారం గురించి తెలుపుతున్నది ఇంకో వ్యాసం.

ఈ సంపుటిలోని ఆఖరు వ్యాసం 'మహామనీషి లెనిన్'. మార్క్సిస్టు తాత్త్విక భావాలకి వాస్తవ రూపం కల్పించిన లెనిన్‌లోని మానవత్వ దృక్పథాన్నీ, స్వార్థం ఎరుగని 'వసుధైక కుటుంబి' లక్షణాన్నీ వివరిస్తుంది. చదవవలసిన వ్యాసం. ఇటువంటి ఉత్తమ సంకలనాన్ని అందచేసిన ప్రకాశకులు కూడా అభినందనీయులే, ఇటువంటి రచనలకు పాఠకులు అంతంతమాత్రంగా వుండే మన తెలుగుదేశపు దుర దృష్ట స్థితి దృష్ట్యా.

## ప్రతిధ్వనులు

(వెల: మూడురూపాయలు. విశాఖ సాహితి, 26–15–204 మెయిన్‌రోడ్, విశాఖపట్టణం–1)

రెండేళ్ళు పూర్తిచేసుకొన్న విశాఖ సాహితి సాహిత్య సమరాంగణంలో మంచి విజయాలనే సాధించినదని ఈ కథా సంపుటి ఉపక్రమణిక (ఏప్రిల్ 4,1973) నుంచి అర్థం చేసుకోవచ్చు. ప్రతి పదిహేనురోజులకీ ఒక సాహిత్య సమావేశం, ప్రతి సమావేశంలోనూ సగటున ఏడుకుపైగా స్వీయరచనల పఠనం, ప్రస్తుతం మన చేతులలో వున్నదానితో సహా మూడుకథా సంకలనాల ప్రచురణ నిజంగా ఈర్ష్య కలిగించే కృషి.

ఏదో అమావాస్యకీ, పున్నమికీ కలుసుకొని, నాలుగు సాహిత్యం కబుర్లు చెప్పుకొని, తిరిగి యిళ్లకు పోయి జీవితపు ఆటుపోటుల్లో కూరుకుపోవడం గాక, సభ్యులు సజీవ సాహిత్య కృషిచేస్తున్నారని వినడం నిజంగా వుత్సాహం కలిగించేమాట. రెండేళ్లలో సాహితి సభ్యుల 209 రచనలు వివిధ పత్రికలలో వచ్చే యున్నకబురు తెలుగుదేశంలో రచయితలకూ, రచయితల సంఘాలకూ కూడ ఉత్తేజకారణం.

ఆ విధంగా వచ్చిన రచనలు కేవల సంఖ్యా పూర్తికేగాక లక్ష్యశుద్ధి కలిగి, ఫర్వాలేదు బాగానే వున్నాయనిపించేవే ననడానికి ఈ సంపుటి చక్కని వుదాహరణ. శ్రీయుతులు అంగర వెంకటకృష్ణారావు, ఘండికోట బ్రహ్మాజీరావు వంటి ప్రసిద్ధులతో పాటు కొన్ని కొత్తపేర్లు—విశేష పరిచయం లేనివి కని పిస్తున్నా — రచయితలంతా అంత మరీ కొత్తగా కలం పట్టినవారు కాదని చెప్తున్నాయి ఇందులోని కథలు.

అంగరవారి "ఎందుకు?" కథగా గొప్పగా లేదు. కాని, ఈవాడు వ్యాపార దృష్టితప్ప అన్యంలేని పత్రికలలో, సామాన్య పాఠకుల్ని వినోదపరచడం తప్ప మరో లక్ష్యం లేకుండా, ప్రపంచానుభవం, జీవితానుభవం కూడా లేకుండా, సమాజంలో నిత్యం ఎదురవుతున్న సమస్యల్ని వదిలేసి, ఊహా కల్పిత ప్రేమానుభూతులూ, సెక్స్ తొందరలూ, అవాస్తవిక కల్పనలూ, విహారయాత్రలు, 'లవ్‌ట్రయాంగిల్ లబ్బులూ'లో కూరుకుపోతున్న యువ రచయితలను ఆలోచింప చేసేందుకు వేసిన ప్రశ్న ఈ కథ. ఇక్కడ ఒకటనిపిస్తుంది. సంఘంలో అచ్చమ్మల్లాంటి వాళ్ల మొగుళ్లు తాగుబోతులై పెళ్లాల్ని తన్నేవాళ్లే కావచ్చు. నక్రుత్తుగా, పిల్లలకు పాలివ్వడానికి కూడా వ్యవధి లేకుండా పనిచేస్తేగాని పొట్టగడవని బ్రతుకులే కావచ్చు, అత్యధికంగా, పిల్లవాడు చచ్చిపోతున్నాడన్నా పనినాగా పెడుతుందేమోనని బాధపడే గృహిణులూ వుండొచ్చు నక్రుత్తుగా. రోగి ప్రమాద దశలోవున్నా, డాక్టరుకి లంచం ఇవ్వలేకపోతేనూ, పెద్ద సిఫార్సులే లేకపోతేనూ, అల్లరి చేయలేని సామాన్య వీధి మానిషి అయితేనూ, పబ్లిక్ హాస్పిటలులో మందివ్వని దుస్థితే వుంది చాలచోట్ల. కాని,... 'గురువుల రాక, దాసి మృతి...కరువును, మాపి కంబు' నన్న పద్యంలో ఏ కరువు పెట్టినట్లు, ఒకే చిన్న కథలో కథకోసమే అయినా కష్టాలు చేర్చి, దయనీయస్థితి సృష్టించగల మనుకోడం, సమస్య తీవ్రతను మనస్సుకు పట్టించగలమనుకోడం సరి కాదనుకుంటాను. ఈ తిబాధలన్నీ ఒకేచోట్ల పోగు పెట్టకుండా, వాస్తవికంగా, చిత్రించి పాఠకుల మనస్సులకి సమస్యను పట్టించలేమా? అన్ని బాధలూ ఒక్కుమ్మడి దాడి చేస్తే తప్ప చైతన్యం కలగని స్థితిలో జనం వుంటే కష్టమే. రచయితలూ, కవులూ ఆలోచించవలసిన సమస్య యిది.

మనిషి మనిషికి ఒక కొత్త ధర్మం చూపించే

మన సమాజ పరిస్థితుల అధార్మికతను ప్రశ్నించే కథ 'ఇదే(ం) న్యాయం'.

తాము సాగించే నయవంచనను కమ్ముకొనేందుకు నోరులేని పశువును అడ్డం పెట్టుకోగల అధికార్ల మేధోవిలాసం కీర్తిప్రియగారి కథ 'పశు బుద్ధి'లో చాల చక్కగా చూపించేరు.

తెలుగునాట ప్రజాసామాన్యంలో పోలీసుశాఖ యెడ వున్నది పరమద్వేషం. కొంచెపు చూపున్నా, ప్రజలలో శాంతి, భద్రతలు కాపాడడంకోసం ప్రభుత్వం ప్రత్యేకించి పోషిస్తున్న ఈ శాఖయెడ ఆ ద్వేషం ఎందుకు వచ్చింది? మామూలు రోజుల్లో పోలీసులు కనబరిచే దుష్టతనాన్నీ, నీచబుద్ధుల్నీ తెలిపే కథ వెన్నెలదారుల్లో. ప్రత్యేక వుద్యమాల కాలంలో వాళ్ళు కనబరిచే హింసానందం, క్రూరప్రవృత్తి చూపించే కథ —'బ్లడ్ బాత్'.

సమాజం అసహ్యించుకొని, నిరాదరించే దొంగతనం, లంజతనం మానవుని బతుక్కి ప్రధానాధారమయ్యే స్థితి ఏర్పడిందన్న నైతిక సంఘర్షణను తెలుపుతున్న కథలు ఉదయం, ఋణం.

ఋజువర్తనకు కూడా మోసం చేయవు అవసర మయ్యేటట్లు చేస్తున్న ఆఫీసు అధికార్ల లంచగొండితనాన్ని 'నల్లగీతలు'లో చూపించేరు యువ రచయిత ద్వయం మహేంద్ర, అంగర వెంకట శివ ప్రసాదరావులు.

"ఉభయకుశలో పరి" "ఇంకా తెలవారలేదు" "రెండోవేపు" అనేవి విభిన్న సామాజిక తరగతులకు చెందిన జీవితాల్ని చిత్రిస్తున్న కథలు. అయితే వాటన్నింటా అనుస్యూతంగా వున్న భావం ఒక్కటే; ప్రకృతి వుత్పాతాలు వచ్చినా ఆపదలు మనిషి పొరపాటువలన వచ్చినా, బుద్ధిపూర్వకంగా కలిగించినా సమాజంలో నష్టపడే జనం ఒక తరగతి వాళ్ళున్నారు. ఏ దెబ్బపడినా వాళ్ళమీదే. దానినుంచి ఆత్మరక్షణ చేసుకోగల శక్తి కూడాలేదు వాళ్ళకి. వాళ్ళకి వచ్చిన కష్టాలు, ఆపదల నుంచే సొమ్ముచేసుకొనే జనం, లాభపడే జనం వేరే వున్నారు. ఆ అదృష్టవంతులని చెరిచేశక్తి ప్రస్తుత సమాజంలో లేదు.

అధికారం అనేది నరాలమీది కురుపులాంటిది. వాళ్ళకి ఎంతసేపూ తమ బాధేగాని ఎదటివాళ్ళ కష్టం కాబట్టదు, తమ ప్రపంచంలోనేగాని వాస్తవ ప్రపంచంలో బ్రతకలేరు. బ్రతకగల వాళ్ళనిచూస్తే అసూయ, కోపం. అటువంటి దుర్దశలో వున్న ఒక ఇంజనీరు జుగుప్సాకర ప్రవర్తనను చిత్రిస్తున్న కథ కారడవిలో గంధపుద్రుమం.

ఈ విధంగా దీనిలోని కథ లించుమించు అన్నీ నేడు సమాజాన్ని పీడిస్తున్న వివిధ సమస్యల మీదికి మన దృష్టిని ఆకర్షిస్తున్నవే. శిల్పం అనేది ఒక్క రోజున పట్టుబడేదికాదు. అది శ్రమ సాధ్యం చాల వరకు. అసలు కావలసింది వస్తు సంగ్రహణాసక్తి. అది ప్రధానంగా సంస్కార లబ్ధం. ఈ లక్షణం రచయిత కుంటే శిల్పం అదే పట్టుబడుతుంది, శ్రద్ధతో ఆ శ్రద్ధను ఆశించగలం, ఈ రచయితల నుంచి.

—'అవంతి'

# తిష్యరక్షిత

(తొమ్మిది ఆశ్వాసముల పద్య కావ్యము)

ప్రథమ ముద్రణ : 1967.

ద్వితీయ ముద్రణ : 1972.

(రచన : శ్రీ కరుటూరి సత్యనారాయణ మూల్యము : రూ 8, పుటలు 190 ప్రాప్తిస్థానము: గ్రంథకర్త పేర, విజయమోహన పబ్లికేషన్సు, జయకృష్ణపురం, రాజమండ్రి— 3.)

భారతీయ సాహిత్యంలో చారిత్రక కావ్యాలే బహు కొద్ది. వ్రాయుటకు శక్తి యుండియు ప్రాచీనులు వ్రాయరైరి. ప్రాచీనకాలాన ఇంచుమించు పురాణాలకే ప్రాధాన్యత ఉండేది. వారికి గల అప్రతిహత ప్రతిభ, ఆలోచనాశక్తి, అనూహ్యమైనది. ఎందుకో కానీ పౌరాణిక వస్తుజాలాని కిచ్చిన ప్రాధాన్యం చరిత్రకు ప్రాచీను లొసగరైరి.

గ్రథన కౌశలం, భావావేశం, కల్పన—ఉన్నంత మాత్రాన చారిత్రిక కావ్యాలు రచించడం కష్టం. అందుకే చరిత్ర ఘట్టాలు విశదీకరించే కావ్యాలు

కొల్లదిగా లభిస్తాయి ఆంధ్ర సారస్వతంలో. వీటిని పరికిద్దాం!

సిద్ధేశ్వర చరిత్ర-ఇది ప్రప్రథమంగా పేర్కొన వలసిన గ్రంథరాజం. దీన్ని కాసె సర్వప్ప కొంత ద్విపదగానూ, వచనంగానూ పూరించాడు. ఇదొక చారిత్రక కావ్యం. దీనియందు కాకతీయ రాజ వంశపు యదార్థ కథనం, ఓరుగల్లు ప్రాభవం కాకతీయ రాజ్యపతనం వర్ణింపబడింది. ఈ గ్రంథం కాకతీయ రాజవంశావళీ గాథను తెల్సుకోటానికి జగాదివ్వటీ.

రామరాజీయం:—అర్వీటి వంశావళి క్షుణ్ణంగా వర్ణింపబడింది కావ్యంలో. చారిత్రికాంశాలను యథా తథంగానూ రసవంతంగానూ రచించి మెప్పుపొందా డీ వెంకయ్య కవి.

కృష్ణరాయ విజయం: ఈయది కుమార ధూర్జటి కృతం. సారసాహిత్య సాహిత్య సరణిలో నడి పించా డీ కావ్యాన్ని. కానీ రాయవాచకం దీనికి మాతృక. విజయనగర నిర్మాణం, కృష్ణరాయల పరి పాలనా విశేషాలతో కూడి వీరరస ప్రధానంతో—సాహి త్యంలో సమున్నత స్థానం ఆక్రమించుకొంది కృష్ణ రాయ విజయం.

రంగరాయ చరిత్ర:—రచయిత దిట్టకవి నారా యణ కవి. ఇది బొబ్బిలి యుద్ధాన్ని తు. చ. తప్ప కుండా వర్ణింపబడిన కావ్యరాజం. ఉర్దూ పదా లెన్నో వచ్చి చేరినా అవి కావ్యానికి ఓ వింతశోభ నిస్తుంది.

పలనాటి వీరచరిత్ర:—ఈ కావ్యాన్ని రచించి, పండిత లోకంలో ప్రతిభా ప్రాగల్భ్యాన్ని ప్రదర్శించు కొన్నాడు కవి సార్వభౌముడు శ్రీనాథుడు. వర్ణనా వైదుష్యం, పాత్ర చిత్రణ, శిల్పం—పల్నాటి వీర చరి త్రకు కొత్త వివ్వాణాన్ని చేకూర్చాయి.

తర్వాతి కాలంలో ఎన్నో కావ్యాలు వెలిశాయి. కానీ పండితుల విమర్శనా ధాటి కాగలేక కాలగర్భంలో లీనమైపోయాయి అనేక కావ్యాలు.

ఇరవయ్యో శతాబ్దంలో వెలసిన చారిత్రక కావ్యాలనేకం—అందులో,

మునలమ్మ మరణం, ఆంధ్రప్రశస్తి, సౌందర నందం, హంపీక్షేత్రం, శివభారతం, రాణాప్రతాప సింహ చరిత్ర, ఆంధ్ర పురాణం, గాంధీగారి 'ఆత్మ కథ' మొదలైనవి తెలుగుదేశమున విశేషఖ్యాతిగాంచినవి. వి రమణీయంగానూ, శ్రావ్యంగానూ తీర్చిదిద్దుటచే వీటికో విశిష్టత చేకూరింది సాహిత్యంలోనూ ప్రజా హృదిలోను. ఈ కోవకు చెందనదే ఇక్కడ సమీక్షింప బోవు 'తిష్యరక్షిత' మహాకావ్యం. ఒక నవలవలెనూ చదువుకోవచ్చును. ఈ కావ్యం నిర్వచనం. తొమ్మిది ఆశ్వాసములు. ఇంచుమించు పదకొండు వందల పద్యాలున్నవి. కావ్యమంతా మొదటినుంచీ చివరిదాకా ఒకే విధమైన రచన సాగినది. ఈ కావ్యంలో మనకు గోచరించు పాత్రలు అశోకుడు, ఉపగుప్తుడు, కుణా లుడు కుంజకర్ణుడు, తిష్యరక్షిత, కాంచనమాల, పరిష్యరక్షిత.

అశోకుడు మగధ సామ్రాజ్యానికి ప్రభువు. పరిష్యరక్షిత ఆయన పట్టపురాణి.

హఠాత్తుగా తటస్థపడిన తిష్యరక్షిత సౌంద ర్యానికి ముగ్ధుడైనాడు అశోకుడు. ఆమెతో స్నేహం చేసికొన్నాడు. చివరకు పెండ్లిచేసుకొన్నాడు.

ఇప్పుడు తిష్యరక్షిత మగధాంతఃపురాన్ని చేరింది. అశోకుడు ఆమె చేతిలోని కీలుబొమ్మయ్యాడు. తిష్య రక్షిత పన్నిన వలలో చిక్కుకున్నాడు అశోకుడు. 'పరిష్య రక్షిత'ను తరిమాడు అంతఃపురాన్నుండి. కుమారుడైన కుణాలుని కన్నులు పోయేదాకా తిష్య రక్షిత క్రూరస్వభావాన్ని గుర్తించలేకపోయాడు అశో కుడు. పశ్చాత్తప్తుడై కర్తవ్యంకోసం పరివేదన పొందాడు చివరన. ఈ బృహత్కావ్యంలోని కథ టూకీగా ఇది. ఈ కథ కొంత సారంగధర చరిత్రను పోలి యున్నది.

ఉపగుప్తుడు బౌద్ధాచార్యుడు. కుణాలుణ్ణి బౌద్ధంవైపు మరలించిన మహా మనీషి. కుణాలుడు అశోకుని కుమారుడు, సుచరితుడు. కుంజర కర్ణుడు వైదిక మతాభిమాని, అశోకునకు పట్టుబడి— ప్రాణాలు విడిచిన భగ్నజీవి. తిష్యరక్షిత ఈ కావ్యము

నందు కథా నాయకురాలు. తన సౌందర్యాన్నే పాచికగా ఉపయోగించి—అశోకుణ్ణి తన చేతిలోని కీలుబొమ్మను చేసుకొన్న జాణ. ఆ జాణతనమే కథా గమనానికి మూలం.

కాంచనమాల కుణాలుని భార్య. కుణాలుని విడబాయని సతి.

అశోకుని పెద్దరాణి పరిష్యరక్షిత. ఆమె వైదిక మతాభిమానిని. కుంజకర్ణుని అసమర్థతకు, తిష్యరక్షిత ద్వేషానికీ తన జీవితాన్నే బలిపెట్టుకొన్న భగ్నజీవి.

శ్రీ సత్యనారాయణగారు ఆయా పాత్రల స్వరూప స్వభావాలను—చిత్తరువువలె చక్కగా చిత్రించారు. ప్రతిభా వ్యుత్పత్తులు గల ఈ కవి మధుర మంజుల శ్రావ్యమైన కావ్యరాజాన్ని రసజ్ఞ లోకాని కర్పించి కృతకృత్యు లయ్యారు.

ఈ కావ్య రాజ్యమునకు డా॥ విశ్వనాథ సత్య నారాయణగారు వ్రాసిన 19 పుటల సమీక్ష, శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి ఐదు పుటల పరిచయ వాక్యాలు, శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారి ఐదుపుటల భూమిక—విశిష్టతను చేకూరుస్తున్నాయి అట్టి ఈ కావ్యమునుండి మచ్చునకొక పద్యమును తిలంకిపుడు.

అష్టమాశ్వాసంలో — శ్వపచుని చికిత్సచే కుణాలునకు కన్నులు వచ్చిన ఘట్టాన్ని చూడండి. ఆ చండాలుని త్యాగశీలానికి ఆశ్చర్యపడి — అతనిని ప్రశంసిస్తూ పల్కిన ఈ పద్యమును చూడుడు.

'కులమును బట్టియే మనుజు గుండెల
లోపల నుచ్చ నీచతల్
నెలకొనునంచు నా యెడద
నిల్చిన భావము వమ్ముజేసె నీ
సలలిత మంజువర్తనము చక్కని
పారము నేర్పె నాకు నే
కులమున బుట్టినన్ మనసు
కోమలమై తనరార వీలగున్.'

ఈ గ్రంథకర్త ప్రాచీనాధునిక మహాకవులతో తులతూగగల ప్రతిభాశాలి. అంతేకాదు ఆయన కవితా వైశద్యమునకు 'తిష్యరక్షిత'యే తార్కాణ. ఈ కావ్యము ఆంధ్రదేశమున బహుళ ప్రచారముపొంది, విద్వజ్జన మునలకు విశిష్టామోదాన్ని కల్పించి— విద్యార్థులకు విపుల సాహితీ సంపదను చేకూర్చి—బహుళ ప్రచారము పొందాలని నా ఊహ.

వే. రా.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1, Editor : S. Radhakrishna.